# చతుర

మే 2000 రూ.7/-



## ఏడు రోజులు

తంగెళ్ల శ్రీదేవిరెడ్డి

# స చి త్ర వి చి త్రం



## నలుపు - తెలుపు

నైజీరియాలో పుట్టిపెరిగిన సింధియా (36), డిక్‌సన్ (41)లకు పుట్టిన ముగ్గురు పిల్లలూ తెల్లరంగులోనే పుట్టారు. తల్లితండ్రులిద్దరూ నల్లరంగు చర్మం కలవాళ్లే. అటిన్యూక్ (6), అయోనోట్ (4), ఒసిమా (1) పిల్లల పేర్లు. ఇంగ్లాండులోని లండన్‌కి వలస వచ్చాక వాళ్లకీ పిల్లలు పుట్టారు. మొదట్లో ఇరుగూ పొరుగూ ఆ పిల్ల తండ్రి డిక్‌సన్ కాదేమో అని చెవులు కొరుక్కునేవారు. రక్తపరీక్షలో అది అబద్ధం అని తేలింది. ఆ తల్లిదండ్రులిద్దరి పూర్వీకులకీ అల్బినో అనే వ్యాధి వుండి వుండవచ్చని, అందుచేత వంశపారంపర్యంగా వచ్చు ఆ వ్యాధి వల్ల పిల్లలు తెల్లగా పుట్టారని డాక్టర్ వివరణ ఇచ్చాడు. ప్రపంచంలో ప్రతి 17000 మందిలో ఒకరు అల్బినో చర్మంతో అంటే స్కిన్ పిగ్మెంటేషన్ లేకుండా పుడుతుంటారిలా.

వీరిపేర్లు గిన్నిస్‌బుక్‌లోకి కూడా ఎక్కాయి.

# చతుర కతలు

## ఆశయం

అమ్మా, నాన్నల పోరు పడ లేక అమెరికానుంచి పెళ్లిచూపు లకి ఇండియా వచ్చాడు సుబ్బా రావ్.

వస్తూనే స్నేహితుడు సూరిబాబును కలిసి "పది సంవత్సరాలు ఇదిగో అదిగో అని గడిపేశాను. ఈసారి వాయిదా వేయడం కుదరదు. ఎప్పుడో ఒకప్పుడు ఈ పెళ్లి అనే తంతు తప్పదు. నాకు తగిన అమ్మాయిని వెదికిపెట్టు." అన్నాడు.

"ఇన్నేళ్లు అమెరికాలో అఘోరించావు కదా! దలు. కట్నాలూ దండిగా దక్కు తాయి." అన్నాడు సగటు ఆంధ్రా పెళ్లికొడుకు సుబ్బారావు.

"ఇవన్నీ నేను మాత్రం ఇక్కడ చేయడం లేదా వెర్రివెధవా" అని మనసులో అనుకుని "సరే, అలాగే చూద్దాం! ముందుగా మ్యారేజ్ బ్యూరోలో నీపేరు రిజిస్టర్ చేయి స్తాను. ఇకచూసుకో... రేపటినుంచీ ఒకటే జనప్రవాహం. మనింటిముందు క్యూ లో వుంటారు." అంటూ తీసుకెళ్లి అక్కడ రిజి స్టర్ చేయించాడు.



అక్కడ నీకు తగిన అమ్మాయి దొరకలేదా? "

"మహ బాగా దొరుకుతారు. కానీ వాళ్లు చెప్పినట్టు నేను వినాలి. ఇంటిపని, వంట పని, బజారుపని అన్నీ నేనే చేయాలి. పిల్లల్ని కనడం సాధ్యంకాదుకానీ లేకుంటే అదీ నేనే చేయాల్సివచ్చేది.

"అదే మన ఇండియాలో పిల్లని చేసు కుంటే హాయి. సరికదా బోలెడు మర్యా



ఓ నాలుగు రోజులు తర్వాత జనం రాసా గారు. మరోపక్క ఉత్తరాలు. పోస్ట్‌మాన్ అమెరికా పెళ్లికొడుక్కు ఉన్న డిమాండ్ గ్రహించి "రోజుకో యాభై రూపాయలైనా ఇస్తేకానీ నేను మోసుకురాలేను" అంటూ ఖచ్చితంగా చెప్పేశాడు.

ఆ ఉత్తరాలు తెరవడానికి చేతులు నొప్పి పుట్టాయి. చదవడానికి కళ్లు పోట్లువచ్చి నడుం పట్టేసింది ఇద్దరికీ.

"అయ్య బాబోయ్! ఇంతమంది జనమూ, ఇన్ని ఉత్తరాలూనా? ఇండియాలో ఆడపి

ల్లల జనాభా ఎంతో బాగా తెలుస్తోంది. పోనీ అంటే ఒక్కమ్మాయి ఫొటో బావుండలేదు. లేనిపోని గొడవ తెచ్చుకున్నాంరా బాబూ!" అన్నాడు విసిగిపోయిన సుబ్బారావు.

"పెళ్లి సంబంధం చూసుకోవడం అంటే మాటలా? మాట్లాడకుండా చెప్పిన పని చెయ్యి." అని విసుక్కున్నాడు సూరిబాబు.

ఓ నెల రోజుల్లో 'ఫరవాలేదు' అనిపించిన అమ్మాయిల్ని చూసి వచ్చారు.

తనకి నచ్చలేదని కొన్ని, అమ్మా, నాన్నలకి నచ్చలేదని కొన్ని(కట్నంలేదని) అంటూ ఏదో ఒంక పెట్టసాగాడు సుబ్బారావు.

"ఒరేయ్ దౌర్భాగ్యుడా! ఇలా వచ్చిన ప్రతి సంబంధానికి పేరు పెడితే, ఈ జన్మకి పెళ్లి అవదు. కొన్నింటికి కాంప్రమైజ్ అవ్వాలి తప్పదు." అని హితబోధ చేశాడు సూరిబాబు.

"కాంప్రమైజ్ అవ్వాలనుకుంటే అమెరికా అమ్మాయితోనే అయిపోదును. జన్మలో ఒకే ఒక్కసారి చేసుకునే పెళ్లికి ఆమాత్రం స్వతంత్రం వుండద్దురా?" అంటూ బిక్క మొహం వేశాడు సుబ్బారావు.

పోస్ట్‌మాన్ ఖర్చు, పెళ్లి చూపులకి వెళ్లడానికి అయ్యే ఖర్చు పెరిగిపోతోంది కానీ ఒక్క సంబంధం కలిసి రాలేదు.

సుబ్బారావ్ వాలకం చూసి పురిటికి వెళ్లిన పెళ్లాన్ని చూసి వస్తానని వంకపెట్టి అప్పుడప్పుడు తప్పుకోసాగాడు సూరిబాబు.

రానురాను ఉత్తరాలు ఆగిపోయాయి. ఇంటికి వచ్చే జనమూ పలచబడ్డారు.

సుబ్బారావుకి బెంగ పట్టుకుంది ఇంక తన పెళ్లి అవదేమో అని.

"ఒరేయ్ నామాట విని మీ మామయ్య కూతుర్ని చేసుకో. ఎలాగా నీకు నచ్చిన పిల్ల దొరకదు." అన్నారు అమ్మానాన్నలు.

"నేను చస్తే ఆ రౌడీని చేసుకోను. దాని ఫ్యాషన్లు, బోయ్ ఫ్రండ్స్ నేను భరించలేను...." అన్నాడు సుబ్బారావు.

"పెళ్లయితే అన్నీ సర్దుకుంటాయి. అందర్నీ అలా తీసి పారేస్తే ఎలా? ఇప్పటికే జుట్టు నెరిసింది. రంగేస్తావు కనుక తెలియదు. సగం పళ్లు ఊడిపోయాయి. కట్టించుకున్నావు కనుక పట్టించుకోరు. ముప్పై అయిదేళ్లు నెత్తికి వచ్చాయి. బట్టతలకూడా వచ్చేస్తోంది. ఓరి మూర్ఖుడా!..." అంటూ తండ్రి తిట్లు లంకించుకున్నాడు.

"సరే! ఈసారి చూసిన అమ్మాయిని ఒప్పుకుంటాలే." అని అరిచాడు అసలే మనసు చెడిపోయిన సుబ్బారావు.

అత్తవారింటినుంచి వస్తూ, వాళ్ల బంధువులమ్మాయి లతాంగిని వెంట తీసుకువచ్చాడు సూరిబాబు.

ఆ పిల్ల పేరుకి తగ్గట్టే సన్నగా వుంది. నల్లగా వుంది. పదో క్లాసు పరీక్షకి పదోసారి కట్టింది.

"అయితేనేం. నీకు తగిన పిల్లరా! నా బాధ్యత తీరిపోయింది." అన్నాడు సూరిబాబు ఆ అమ్మాయిని చూపించి.

"ఏ విషయాల్లో తగిన పిల్ల." అని కూడా అడక్కుండా ఎక్కడ పెళ్లి అవదో అని స్పీడుగా బుర్ర ఆడించేశాడు సుబ్బారావు.

"పిల్ల ఎలా వుంటేయేం. ఏం అదృష్టం. అమెరికా వెళ్లే యోగం పట్టింది." అంటూ బంధువులంతా చెవులు కొరుక్కున్నారు పెళ్లిలో.

పెళ్లయిన వారానికి అమెరికా తీసుకుపోయాడు లతని. అక్కడ మూణ్ణెల్లు తిరక్కుండా కారు డ్రైవింగ్ నేర్చుకుంది.

కారు కొనిపించుకుంది. "నువ్వు" అని పిలుస్తుంది మొగుణ్ణి. "అదేమిటి మరీను..." అంటే "నాకలా పిలుస్తే ఇష్టం" అంది.

"ఇంట్లో బోర్‌గా వుంది. నువ్వు ఉదయం చీకట్నే పోయి చీకటి పడేదాకా ఇంటికి రావు కదా! నేను స్విమ్మింగ్ నేర్చుకుంటాను" అంది ఒకరోజు.

"వండినవి ఫ్రిజ్‌లో ఉన్నాయి. ఆకలేస్తే తిను. నేను మారియాతో మాల్‌కి వెడుతు

న్నాను. రెస్టారెంట్‌లో డిన్నర్ చేసేసి వస్తాను." అంది మరోరోజు.

"ఇండియన్ అసోసియేషన్‌లో చేరాను. మీటింగులు, పండగలు, పెళ్లిళ్లు, పార్టీలూ..." అంటూ క్షణం ఇంట్లో వుండదు.

ఖాళీగా ఉన్న రోజున కంటపడితే "ఊరికే కూర్చోకపోతే ఇల్లంతా వ్యాక్యూమ్ చేయరాదూ? లాండ్రీలో బట్టలు వెయ్యి, జిమ్ కెళ్లు. ఆ చార్లెస్ చూడు. చక్కగా ఫిగర్ మెయిన్‌టెయిన్ చేస్తాడు. చూసి నేర్చుకో." అందోరోజు.

సంవత్సరం తిరిగే సరికి అమెరికా వాతావరణం ఇట్టే వంటబట్టి మొగుణ్ణి దారిలోకి తెచ్చేసుకుంది లతాంగి.

లావుగా, పిప్పళ్ల బస్తాలా తయారయి, జుట్టంతా ఊడి, బట్టతల వచ్చేసి, భార్య పక్కన తండ్రిలా కనిపిస్తూ అందరూ నీ కూతురా? అని అడుగుతుంటే.. సిగ్గుపడిపోయి... ఆమెతో బయటకు వెళ్లడమే మానుకున్నాడు సుబ్బారావు.

తను ఎంతమంది అమ్మాయిలకో పేర్లు పెట్టాడు. పెళ్లవదని భయపడి అస్థిపంజరంలా, కళాకాంతుల్లేని ఓ పల్లెటూరి గబ్బిలాయిని వెనకాముందూ చూడకుండా పెళ్లి చేసుకున్నాడు.

కానీ ఇప్పుడు తన రూపం మారిపోయింది. వికృతంగా తయారయ్యాడు. విచిత్రం. లతాంగి అద్భుత సౌందర్యరాసిగా మారిపోయింది. తన సంపాదన మంచినీళ్లలాగా ఖర్చు చేస్తోంది.

ఇన్నాళ్లయినా స్వంతిల్లంటూ లేదు. పీనాసివి. అంటూ పాష్ లొకాలిటీలో మంచి ఇల్లు కొనిపించేసింది.

ఇప్పుడు భార్య ఎలా చెపితే అలా వింటాడు సుబ్బారావు. రోజులు మారాయి. రోజుల్ని బట్టి మనుషులూ మారిపోయారు. అని సరిపెట్టుకోక తప్పడంలేదు పాపం సుబ్బారావుకి.

–ఎ.అన్నపూర్ణ

---

## జోక్

"నీ మనవడైనటువంటి నా మునిమనవడ్ని చూడడానికొస్తున్నాను. వాడ్ని ఉయ్యాల్లో వేసే కార్యక్రమాన్ని నా ఆధ్వర్యంలో జరిపిస్తాను. పేరంటాళ్ని పిలిచి ఏర్పాట్లు చెయ్యి"అంటూ అత్తగారు రాసిన ఉత్తరం అందుకోగానే కమల గుండెల్లో రైళ్లు పరిగెత్తాయి. "భగవంతుడా! కాపాడుతండ్రీ!" అని ప్రార్థించింది. కమల కూతురు విమలక్కూడా బామ్మగారి రాక ఆనందాన్ని కలిగించలేదు.

కమలకు అత్త, విమలకు బామ్మ అయినటువంటి గోవిందమ్మకు ఉందికదా అని నోరు ఊరికే పారేసుకోడం బాగా అల'వాటు. మరంచేత ఆవిడ వస్తోందంటే సంతోషించేవారరుదుగా ఉంటారు.

ఆ సాయంత్రం పిల్లాడ్ని ఉయ్యాల్లో వేసే ఉత్సవాన్ని తిలకించడానికి పేరంటాళ్లందరూ వేంచేసి చాపల మీద సుఖాసీనులయ్యారు.

బుర్రుమని చప్పుడు చేస్తూ ఇంటిముందు ఓ ఆటో ఆగింది. అందులోంచి గోవిందమ్మగారు దిగి వినాయకుడిలా నడుస్తూ హాల్లో పేరంటాళ్ల మధ్యకొచ్చారు. ఆవిడ వెనకే మూషికంలాంటి మరో జీవి చండీదాస్ అనే నిక్‌నేమ్‌తో పిలవబడే గోవిందమ్మ భర్తగారు పెట్టె, సంచీ మోసుకుంటూ లోపలకొచ్చాడు.

వస్తూనే గోవిందమ్మ హాల్లో కూచునున్న పేరంటాళ్లందర్నీ ఓసారి చూసింది. తల్లిని, పిల్లాడిని కూచోబెట్టి దిష్టితీద్దామన్న ఉద్దేశంతో అలంకరించి పెట్టిన కుర్చీ ఆవిడ కంటబడింది. సరాసరి వెళ్లి ఆ కుర్చీలో కూలబడింది.

"ఏడీ నా మునిమనవడు? " అని గర్జించింది.'నాకు మనవలు పుట్టుకొస్తున్నా నా మీద ఈవిడ దాష్టీకం తప్పట్లేదు. ఈవిడ

కొడుకు ముఖం చూసి ఊర్కుంటున్నాగానీ' అని సణుక్కుంటూ కమల పిల్లాడ్ని అత్తగారికందించింది.

ఆవిడ చెయ్యిజాచి అందుకోలేదు. అలా కూచునే కమల చేతుల్లోని చంటివాడ్ని నిశితంగా పరిశీలించింది.

“ఇదేవిటీ రంగు ఇంత తక్కువగా ఉన్నాడూ? ఆ మూతికాస్త ఎత్తుగా ఉన్నట్టుందే? ముక్కు వంకరే అనుమానంలేదు. పిల్లాడు బొత్తిగా బాలేడు. నీ కూతురేంటే ఇలాంటి కొడుకును కన్నదీ? ” ఈసడించింది గోవిందమ్మ.



కమల బిగుసుకుపోయింది. కన్న తల్లి విమలకు ఉక్రోషం ముంచుకొచ్చి వెక్కివెక్కి ఏడుస్తూ పోయి మంచంమీద బోర్లాపడిపోయింది.

‘నెలకూడా నిండని నెల బాలుడిలాంటి ఆ పసికూనకి ఇన్ని వంకలు పెట్టగలిగిన ఈ ముసలమ్మకెంత అహంకారం! ముదిమి ముంచుకొస్తున్న కొద్దీ తనో అప్సరసనన్న భ్రమ ఈ మహాతల్లికి ఎక్కువైపోతోంది కాబోలు’ అనుకుంటూ పేరంటాళ్లు ముక్కున వేలేసుకున్నారు.

అప్పుడాగింది బుర్రుమంటూ మరో ఆటో ఇంటిముందు. అందులోంచి విమల ఫ్రెండు విలాసిని దిగింది. హడావిడిగా హాల్లోకొచ్చింది.

“మీరు మా విమల బామ్మగారైయుంటారు. నమస్కారం. మిమ్మల్ని నేనింతకు ముందెప్పుడూ చూళ్లేదులెండి. కమలాంటీ! వీడేనా విమల కొడుకు? హాయ్ బుజ్జిబాబూ! నేను మీ అమ్మ బెస్టు ఫ్రెండు నిరా” అంటూ మురిపెంగా చంటివాడ్ని చేతుల్లోకి తీసుకుంది.

గోవిందమ్మలాగే పిల్లాడ్ని నిశితంగా పరిశీలించింది. గిర్రున గోవిందమ్మవైపు తిరిగింది.

“అద్భుతం బామ్మగారూ! పిల్లాడిది అచ్చు మీ పోలికే” అని కేకెట్టి చెప్పింది.

ఒక్క క్షణం నిశ్శబ్దం.

తరువాత ఘొల్లున నవ్వులు!

“బెస్ట్ ఫస్ట్ జోక్ ఆఫ్‌ది మిలీనియమ్” అంటూ పేరంటాళ్ల నవ్వుల్తో ధైర్యం చేసి శృతికలిపాడు చండీదాసు.

–పి.కృష్ణకుమారి

# అసలుసంగతి

"నెంబర్ పది" అని కాంపౌండర్ కేక వెయ్యగానే చేతిలో ఉన్న టోకెన్ చూసుకుని చిన్నగా లేచాడు శంకరయ్య.

డాక్టరుగారి రూంలోకి వెళ్లగానే ఆయన శంకరయ్యని కూర్చోమని రిపోర్ట్సు ఇవ్వమన్నట్టు చెయ్యిచాచి వాటిని పరిశీలిస్తూ...

"మీ పేరు? " అడిగాడు.

"శంకరయ్య."

"మీ కంప్లయింట్ ఏమిటన్నారు? "



"సార్! వారం, పది రోజుల్నుంచీ తలంతా దిమ్ముగా వుంటోంది. ఊపిరి తీయడం కష్టంగా ఉంటోంది. గుండె దడగా, కాళ్లు నొప్పులుగా కూడా వుంటోందండీ."

"స్కానింగ్ రిపోర్ట్ నార్మల్ గానే ఉందే. మీ బ్లడ్, యూరిన్ వగైరా రిపోర్ట్సు తెచ్చారా? "

"ఇవిగోనండి. అన్నీ తెచ్చాను."

"అన్నీ బాగానే ఉన్నాయి కదండీ. చూడండి శంకరయ్యగారూ! మీరే కాదు. చాలామంది ఉద్యోగస్థులు ఎదుర్కొంటున్న సమస్యే ఇది. మీ ఆఫీసులో మీ రూమ్ ఎలా ఉంటుంది చెప్పండి ముందు."

"సార్! అదీ...అదీ.."

"ఓకే.. ఓకే.. మీరేం చెప్పనవసరంలేదు. నేనూహించగలను. బొత్తిగా గాలీ, వెలుతురూ ఏమాత్రం రాని రూంలో పనిచేస్తున్నప్పుడు ఇలా సైకలాజికల్ ఫీలింగ్స్ రావడం క్వైట్ నాచురల్.

"మీరు రోజూ బాగా వ్యాయామం చెయ్యాలి. వ్యాయామం కన్నా ముందు వాకింగ్ చెయ్యాలండీ. బెస్ట్ ఎక్సర్‌సైజ్ అదే. మీరు ప్రతిరోజూ కనీసం అరగంట మంచి గాలి, వెలుతురూ ఉన్న ప్రదేశంలో వాకింగ్ చేసుంటే ఈ రిపోర్టుల అవసరం ఉండేది కాదు. వాటికయ్యేఖర్చు మిగిలివుండేది. ఎంతయ్యుంటుంది సుమారుగా? "

"సార్! మొదటిసారి వచ్చినప్పుడు ఏడొందలూ, రెండోసారి మూడొందలూను. మీ ఫీజు కూడా కలిపితే పన్నెండు వందలయ్యుంటుంది."

"ప్చ్ మీలాంటి చదువుకున్నవాళ్లు కూడా ఇలా చేస్తే ఎలాగ? ఏం ఉద్యోగం చేస్తున్నారు? "

"సార్! రెండేళ్లుగా అదే ఉద్యోగం. నేనొక పోస్ట్‌మాన్‌ని. రోజూ ఓ పది కిలోమీటర్లయినా తిరుగుతాను."

–సి. అరుణ

☆

# ఏరినముత్యాలు

★ ఒక వ్యక్తిని తూచే త్రాసు అతని ప్రవర్తనే కాని వృత్తికాదు.

-జూనియస్

★ అప్పులు చేయడం స్వభావంగా మారినప్పుడు ఎంతటి ఉన్నతుడైనా దిగజారుతాడు.

-జాన్సన్

★ ఇతరుల పాపాలు కనబడినట్టుగా మన పాపాలు మనకు కనపడవు.

- సెనెకా

★ ఆచరణకు నోచుకోని విజ్ఞానం దీపంముందు కూర్చుని కనులు మూసుకోవడం వంటిది.

-ఆర్యోక్తి

★ మొత్తం మానవాళిని ప్రేమించడం సులువే. మన పొరుగువాడిని ప్రేమించడమే కష్టం.

-ఎరిక్ హోఫర్

★ దౌర్జన్యాన్ని ఎదిరించడం మానవుల ప్రథమ కర్తవ్యంగా వుండాలి.

-మహాత్మాగాంధీ

★ అనేక పొరపాట్లకు జాప్యమేకారణం.

-జఫర్సన్

★ బుద్ధిజీవులది ఆలోచన, హృదయజీవులది అనుభూతి.

-సంజీవ్‌దేవ్

★ అన్నిరకాల హింసలకు పుట్టినిల్లు బలహీనతే.

- సెనెకా

★ మనం ఎదురు చూడని దానితో సర్దుకుపోవడంలోనే జీవిత కళ ఇమిడివుంది.

-ఎలీనర్ వుడ్

★ఎవరు చెప్పారన్నది కాదు ఏమి చెప్పారన్నది పరీక్షించు.

-అరేబియన్ సామెత

★ ఎవరూ చూసి కొట్టలేనిదాన్ని గురిచూసి కొట్టగలవాడే మేధావి.

-జార్జ్ హర్బర్ట్

★ నాకు తెలిసినంత వరకు బెంగను మించి మనిషిని వికలాంగుడుగా చేసేది మరొకటిలేదు.

-ఛార్లెస్ కింగ్స్‌లె

★ ప్రేమించబడడంకన్నా విశ్వసించబడడం శ్రేష్టమైన ప్రశంస.

-జార్జ్ మెక్‌డొనాల్డ్

సేకరణ: కాట్రగడ్డ వెంకట్రావు

చతుర

సంపుటి : 23 సంచిక : 4 మే 2000

ఊరి శివార్లలోని గుడివద్ద కూర్చున్న ఆ ప్రేమజంట వేరువేరు మతాలకి చెందినవాళ్ళు.

అ, ఆలు కూడా నేర్వని ఆ అమ్మాయీ... పదోక్లాసు కూడా గట్టెక్కలేకపోయిన ఆ అబ్బాయీ... మతాలు, చదువులు...లాంటి అడ్డుగోడల్ని ఛేదించుకుంటూ విశాల ప్రేమాకాశంలోకి విహంగాల్లా ఎగిరిపోదామనుకునేంతలో... తండ్రి తనని మూడు లక్షలకి ఓ అరబ్బుషేకుకు అమ్మేసినట్లుగా తెలిసిందా అమ్మాయికి.

విషయం తెలిసిన అబ్బాయి విచలితుడయ్యాడు. తండ్రి గొంతు వింటేనే చిగురుటాకులా వణికే ఆ అమ్మాయి... తండ్రి కుదిర్చిన బేరానికి తలవంచిందా? వలచిన ప్రియుడితో అడుగేసిందా?

చివరకి వాళ్ళ జీవితాలు ఏ మలుపు తిరిగాయి?

మతకలహాలతో మంటలు రేగే ఆ బస్తీలో ఈ పసివారి ప్రేమాంకురం... మొలకలేసిందా?

**హృదయపు లోతులను స్పృశించే తంగెళ్ల శ్రీదేవిరెడ్డి రాసిన**

# ఏడు రోజులు

ఈ నెల 'చతుర' సమగ్ర నవల.

భాగ్యనగర శివార్లలో వున్న మైసమ్మ గుడిదగ్గర కూర్చుని వున్నారా ఇద్దరు యువ తీయువకులూ.

ఆమెపేరు గౌసియా బేగం. పద్దెనిమిదేళ్ళ వయసులో ఉంది.

అతడిపేరు భవానీశంకర్. ఇరవై ఏళ్ళ వయసులో వున్నాడు.

ఇద్దరి వదనాల్లోనూ ఆందోళన స్పష్టంగా కనబడుతోంది.

"శంకర్! ఇప్పుడేం చేద్దాం? " అడిగిం దామె.

"ఎక్కడికైనా వెళ్ళిపోదాం" చెప్పాడు అతను.

"వెళ్ళి ఎలా బతకగలం? "

"కూలిపని చేసుకుందాం"

"అల్లా!" నొచ్చుకుందామె.

"అంతకంటే మార్గంలేదు"

"మరి ఎప్పుడు వెళ్ళిపోదాం? "

"వచ్చే శుక్రవారం"

"వద్దు... రేపే వెళ్ళిపోదాం"

"అంత త్వరగా ఎలా వెళ్ళిపోగలం? వెళ్ళాలంటే చేతిలో కొద్దోగొప్పో డబ్బు వుండాలి. ఈ శుక్రవారం నాటికి మా పప్పాకి జీతం వస్తుంది. నేను సగం డబ్బు ఎత్తుకుని వచ్చేస్తాను"

"ప్చ్" బాధగా నిట్టూర్చింది గౌసియా.

ఆమె బాధ అతడికి తెలుసు. అందుకే ప్రేమగా ఆమె తల నిమురుతూ అన్నాడు, "నేను డబ్బు కాజేస్తే మా ఇంట్లో కష్టాలు ఎదురౌతాయని నాకు తెలుసు. పప్పా కష్ట పడడం నాకు ఇష్టంలేదు. అలాగని వూరు కుంటే మనం ఎటూ వెళ్ళలేం. అప్పుడు నీ పరిస్థితి మరీ దారుణంగా వుంటుంది. అందుకే అన్నివిధాలా గుండె దిటవు చేసు కుందాం"

"సరేకానీ, ఒక విషయంలో మనం జాగ్రత్త వహించాలి" అందామె.

"ఏ విషయం? " అడిగాడు.

"ఇల్లు వదిలిన తర్వాత మనం ఈ హైద్రాబాద్‌లో వుండొద్దు. అస్సలు ఈ రాష్ట్రంలోనే వుండొద్దు. ఎందుకైనా మంచిది వేరే రాష్ట్రానికి వెళ్ళిపోదాం. అక్కడైతే మన ఆచూకీ ఎవ్వరికీ తెలీదు"

"మంచి ఆలోచనే! కానీ మనం అలా వెళ్ళాలి అంటే నేను తీసుకువచ్చే డబ్బు ఎందుకూ సరిపోదు"

"ఎలాగోలా వెళ్దాం"

"ఎలా వెళ్ళగలం? "

ఆమె ఆలోచనగా వుండిపోయింది. అతడు కూడా ఆలోచించసాగాడు. కాసేపటి తర్వాత ఆమె అంది.

"శంకర్! ఒక మంచి ఆలోచన"

"ఏమిటి? " అన్నట్టుగా చూశాడు అతడు.

"రైలు ఎక్కి ఎక్కడికో అక్కడికి వెళ్ళిపోదాం"

"మధ్యలో టిక్కెట్ కలెక్టర్ వస్తే, మన దగ్గరున్న డబ్బుని మొత్తం జరిమానా కిందికి లాగేసుకుంటాడు. అప్పుడు మన పరిస్థితి ఏమిటి? "

"అదీ నిజమే..."

"అందుకే మొదట మనం ఏ మారుమూ లకో వెళ్ళిపోదాం"

"సరే"

తర్వాత అతడేం మాట్లాడలేదు. ఆమె ముఖాన్ని తన చేతుల్లోకి తీసుకుని ఆమె నుదుటిపై మృదువుగా చుంబించాడు. ఆమె పరవశంగా కళ్ళు మూసుకుంది.

"ఇక వెళ్ళిపోదామా? " అతడు ముద్దుపె ట్టుకున్న తర్వాత అడిగింది.

"కాసేపు వుందాం" చెప్పాడు.

"నేను వెళ్ళే సమయం అయ్యింది. ఆలస్యం చేయకుండా వెళ్ళిపోదాం" భయంగా అంది.

ఆమెను అతడు అర్థంచేసుకుని ఆమె చేయి పట్టుకుని ఆమెతో పాటుగా లేచి నిల బడ్డాడు. ఇద్దరూ మైసమ్మ దేవతకి దణ్ణం పెట్టుకున్నారు.

"దేవత మనల్ని తప్పకుండా కరుణి

స్తుంది" వెళ్ళబోతూ చెప్పాడు అతడు.

"ఆ నమ్మకం నాక్కూడా వుంది" అంటూ తలమీది బురఖాను సరి చేసుకుంది గౌసియా.

తర్వాత ఇద్దరూ కలిసి కొద్దిదూరం ముందుకు నడిచారు. అరకొర ఇళ్ళతో నగరం ఆరంభమయ్యింది. అక్కడ ఇద్దరూ విడిపోయారు. ఆమె ఎడమవైపుగా వున్న దారివెంబడి నడిచి వెళ్ళింది. అతడు కుడిపక్కగా వున్న దారివెంబడి వెళ్ళిపోయాడు.

## సోమవారం

రెండు చిన్నగదుల పెంకుటిల్లు. ఇంట్లో వున్న గుమ్మాలకి, కిటికీలకి, అల్మారాలకి, పాత చీరలతో కుట్టిన పరదాలు వేలాడదీసి వున్నాయి. వంటింట్లో పింగాణి వస్తువులు ఎక్కువగా వున్నాయి. ఒక పద్ధతి ప్రకారం కాకుండా చిందరవందరగా అమర్చిన సామాను, ఇంటిని మరీ ఇరుకుగా చూపెడుతోంది. గోడలకి నిండుగా వేలాడదీసిన 'అల్లా'ని సూచించే కేలండర్‌లు కొన్ని పాతబడి వున్నాయి. తోడుగా పెచ్చులు ఊడిన గోడలు పేదరికాన్ని భూతద్దంలోంచి చూపిస్తున్నట్లుగా వున్నాయి.

నడి ఇంట్లో పరిచిన గోనెతట్టుమీద సుమారుగా ఐదు కిలోల మల్లెపూలు రాసి పోసి వున్నాయి. వాటిచుట్టూ కూర్చుని వేగంగా మాలలు అల్లుతున్నారా తల్లీ, ఆరుగులు ఆడపిల్లలూ. ఇంకో ఆడపిల్ల మరీ చిన్నది కావడంతో తల్లి పక్కలోనే కూర్చుని ముతకబట్టలతో తయారుచేసిన బొమ్మలతో ఆడుకుంటోంది. మరోపిల్ల తల్లిపాలు తాగుతోంది. కాగా ఆ తల్లి మళ్ళీ కడుపుతో వుంది.

మాలలు అల్లుతున్న పిల్లల్లో అందరికంటే పెద్దదైన గౌసియా బేగం, ఒకవైపు మాల అల్లుతూనే, మరోవైపు కొద్దిగా తొలగిన పరదా చాటునుండి ఎదురింటివైపు చూస్తోంది.

ఒక మోస్తరుగా వున్న ఎదురింటి ముందు రెండు అరుగులు వున్నాయి. అవి జాజుతో ఎర్రగా అలికి ముగ్గులతో పొందికగా అలంకరించి వున్నాయి. అందులో ఒక అరుగుమీద కూర్చుని వున్నాడు భవానీశంకర్. అతడి చూపులు పెంకుటింటివైపే వున్నాయి. అయితే అతడు వెలుగులో కూర్చుని వున్నందున, ఇంట్లో పరదాచాటున కనీకనిపించక కూర్చుని వున్న గౌసియా బేగం అతడికి కనబడటంలేదు.

"రేయ్... శంకరూ" ఇంట్లో తిరుగలి విసురుతున్న అతడి తల్లి లక్ష్మీదేవమ్మ పిలిచింది.

"ఆ" కళ్ళతో ప్రియురాలిని వెదుకుతూనే పలికాడు.

"బయట కూర్చుని ఏంచేస్తున్నావురా?" అడిగిందామె.

"ఏం చేయాలి?"

"ఇల్లంతా సాలీడు గూళ్ళతో నిండిపోయి వుంది. కాస్తాకర్ర తీసుకుని దులపరాదూ?"

"నేనేమైనా ఆడపిల్లనా?"

"నాకు ఆడపిల్లవైనా మగపిల్లాడివైనా నువ్వేకదరా! అయినా ఇంటిపని చేసుకోవడంలో తప్పులేదు కానీ, అదొక్క సాయం చేసిపెట్టు"

"పోమ్మా" అతడి గొంతులో నిర్లక్ష్యం.

"కాస్త చెప్పినమాట వినరా" ఆమె గొంతులో అభ్యర్థన.

"నేను అలాంటి పనులు చేస్తే నా స్నేహితుల ముందు తక్కువైపోనూ? మగాడివై ఆడంగి పనులు చేస్తున్నావేంట్రా అని వాళ్ళు నన్ను హేళన చేస్తుంటే నేను ఎలా తలెత్తుకోవాలి?" అంటూనే అరుగుమీద నుండి లేచి లోపలికి నడిచాడు భవానీశంకర్.

"ఈమాట మాట్లాడ్డానికి నీకు సిగ్గు, శరం వుండాలి" అంటూనే తిరగలి విసరడం ఆపిందామె.

"నీ స్నేహితులంతా చదువుకున్నారు కాబట్టి, వాళ్ళతో నీకు పోటీ తగదు అంటావు, అంతేకదా" రోషంగా అన్నాడు అతడు.

"లేకపోతే ఏంట్రా? నీ స్నేహితులంతా డిగ్రీల్లో వున్నారు. నువ్వేమో పదవతరగతి పాసవ్వడానికే నానాతంటాలు పడుతున్నావు. మీ పప్పాకి అసలే ఆరోగ్యం బాగోలేదు. ఆ పొగాకు కంపెనీలో పనిచేసీ చేసీ నలభై ఏళ్ళకే యాభైఏళ్ళ వాడిలా తయారయ్యాడు. ఆయనకి వచ్చే పదిహేను వందల్లో ఏడువందలు మందులకే సరిపోతున్నాయి. ఇక ఎనిమిది వందలతో ఎలా బతుకుతామనుకుంటున్నావురా? ఒక్కసారైనా ఇంటిగురించి ఆలోచిస్తావా? తినడం, అరుగుమీద కూర్చోవడం, ఇదే నీకు తెల్సిన పని! ఇంట్లో ప్రతీదీ కొనడమే! దానికి తోడు నీ అవసరాలకోసం 'నెలకు వంద ఇవ్వు చాలు' అంటావు. ఇలా అడిగి ఇప్పించుకోడానికి సిగ్గులేదురా? ఏదైనా పనిచేసి సంపాయించాలిరా! అదేరా మగవాడంటే..." కోపంగా మాట్లాడుతోంది లక్ష్మీదేవమ్మ.

"ఈ మాటలు పాతవే" అన్నాడు భవానీ శంకర్.

"నీకు ఎన్నిసార్లు చెప్పినా తలకు ఎక్కడం లేదుకదా? అయినా చెవిటివాడిముందు శంఖం వూదడం నాదేతప్పు" ఆమె గొంతులో నిష్టూరం.

భవానిశంకర్‌కి నవ్వొచ్చింది. చిన్నగా నవ్వుతూ తల్లి ముందుకు వెళ్ళి మునివేళ్ళపై కూర్చుని, "అవునమ్మా! ఒక్క కొడుకుని సాకడానికే నువ్వు ఇంత కష్టంగా మాట్లాడితే, ఆ ఎదురింటి సాయిబుకి ఏడుమంది ఆడపిల్లలు. మరా పిల్లల్ని, భార్యని, ఆయన ఎలా పోషిస్తున్నాడు? పైగా ఆయన జీవనాధారం చాయ్ బండిమాత్రమే" అన్నాడు.

"నోర్ముయ్యరా! ఆ తల్లీ, పిల్లలు నీలా తిని తిరుగుతున్నారా? రోజూ మల్లెపూల దండలు అల్లి డబ్బు సంపాయిస్తున్నారు. తెలుసా?" ఎత్తిపొడిచింది లక్ష్మీదేవమ్మ.

"ఆ... దండలు అల్లుకుని ఎంత సంపాయిస్తారు గనుక? ఒక్క కిలోకి మూడురూపాయలు. మహా అంటే రోజుకి ఆరుకిలోల పువ్వులు కడతారు అంతేకదా"

"కష్టపడి సంపాయించేది రెండ్రూపాయలైనా చాలు"

"అయితే కొన్నిరోజులు ఆగు! నేనూ రోజుకు యాభైరూపాయలు సంపాయిస్తాను"

"నా కొడుకు యోగ్యుడైతే నాకు అంతకన్నా సంతోషమా?" అంటూ తిరగలి విసరబోయిందామె.

"కాసేపు ఆపు" అంటూ విసురుతున్న తల్లిచేయి పట్టుకుని ఆపి, ఆమెకు మరింత చేరువగా జరిగి కూర్చుని, "ఒకమాట, నువ్వేమీ అనవుకదా?" లోలోపల భయపడ్తూనే అన్నాడు.

"ఏం మాట?" కొడుకువైపు సూటిగా చూసింది.

"మొన్నరాత్రి సాయిబు ఇంటికి కారులో ఒక పెద్దమనిషిలాంటి వ్యక్తి వచ్చాడే, ఆయన నిజంగా పెద్దమనిషి కాదు. అరబ్బు షేకు. వాడికి ఈ సాయిబు తన పెద్దకూతుర్ని మూడు లక్షల రూపాయలకు అమ్మివేస్తున్నాడంట, పాపం" గొంతు తగ్గించి రహస్యంగా చెప్పాడు భవానీశంకర్.

"హా! నీకు ఎవరు చెప్పార్రా ఈ విషయం?" గుండెలపై చేయి వేసుకుంటూ కళ్ళింత చేసింది లక్ష్మీదేవమ్మ.

"ఎలాగో తెల్సిందిలే కానీ, ఎట్లాగయినా చేసి ఆ పిల్లను మనం రక్షిద్దాం" అని ఆశగా తల్లివైపు చూశాడు భవానీశంకర్.

"మనకెందుకొచ్చిన గొడవరా? నోర్మూసుకో" గదమాయించింది లక్ష్మీదేవమ్మ.

"మానవత్వం లేకుండా అలా మాట్లాడ్తావేం?"

"ఇది వూరుకాదు, హైద్రాబాద్. ఊర్లల్లో అయితే హిందూ ముస్లీంలు స్నేహంగా

మెలుగుతారు. ఇక్కడ అట్లాకాదు గదా! తెలిసి కూడా వాళ్ళతో కల్పించుకుంటానం టావేం? "

"పూర్లల్లోనే కాదు, ఇక్కడ కూడా చాలా మంది హిందూముస్లింలు స్నేహితులుగా మెలుగుతున్నారుగా"

"కావొచ్చు కానీ ఆ సాయిబు ఎలాంటి వాడో నీకుతెలీదా? మూత్రం పోసేటప్పుడు ఇటుకముక్క పట్టుకోవడమేకాదు, హిందువు లతో మాట్లాడేటప్పుడు కూడా ఇటుకముక్క పట్టుకుని దోషం లేదనుకుంటాడు. అలాంటి వాడితో కల్పించుకుంటే ఇంకేమైనా ఉందా? లేనిపోని మాటలు చెప్పి హిందూముస్లింలకి గొడవలు పెడ్తాడు. అప్పుడు నగరం రక్తంతో తడిసిపోతుంది"

"నిజమే! కానీ ఆ పిల్లలు చాలామంచి వాళ్ళు. వాళ్ళకి అలాంటి తేడాలులేవు. మంచితనమే మతం అనుకుంటారు..."

"ఆ సాయిబు వాళ్ళతో మాట్లాడ్డానికి వాళ్ళ మతస్థులే భయపడ్తారు. మరి, ఆ పిల్లలు మంచివాళ్లని నీకెలా తెలుసు? "

"ఎలా అంటే... తెల్సింది అంతే"

"గొప్పనిజం తెల్సుకున్నావు గానీ, నోర్మూ సుకుని ఇంట్లో పడివుండు" అని చెప్పి, తిర గలి విసురుకుంటూ "దమ్మిడి సంపాదన లేదు గానీ, దానధర్మాలకి తనే మహారాజు అన్నాడంట... వెనకటికి ఎవడో" తనలోతనే గొణుక్కుంది లక్ష్మీదేవమ్మ.

"ప్చ్ నేను వాళ్ళకి ఏదో ధర్మం చేస్తానని అనడంలేదు" తల్లి గొణుగుడు విని అన్నాడు భవానీశంకర్

"సర్లేగానీ, ముందు సాలీడుగూళ్ళు దులిపి నడుం నొప్పుల్నుండి నన్ను కాపాడు" అంది లక్ష్మీదేవమ్మ.

"నువ్వు ఒప్పుకుని వుంటే నీ అనుమతితో గౌసియాను తీసుకుని వెళ్ళిపోయేవాణ్ణి. ఇందువల్ల మీరు బాధపడకపోయేవాళ్ళు. మిమ్మల్ని బాధపెట్టి వెళ్ళాలంటేనేమో నా మనసు ఒప్పుకోవడంలేదు. ఇప్పుడేం చేయాలి? " తల్లినే చూస్తూ మనసులో అను కుని,

"అమ్మా!" పిలిచాడు భవానీశంకర్.

"ఏంట్రా? ఇంతకీ ఈరోజు నన్ను పని చేసుకోనిస్తావా? చేసుకోనివ్వవా? " విసుగ్గా తిరగలి విసరడం ఆపిందామె.

"నాకు ఆ అమ్మాయిని చూస్తుంటే ఏడు పొస్తోంది. అందుకే ఆ అమ్మాయిని తీసు కుని ఎటైనా వెళ్ళిపోతాను. నాకు ఓ నాలుగు వందలు ఇవ్వు" కూర్చునే తల వంచుకుని భయంతో తడబడుతూ అడి గాడు.

లక్ష్మీదేవమ్మ కొడుకువైపు ఓ మూడుక్ష ణాలు నివ్వెరపోయి చూసింది. ఆ తర్వాత కొడుకు చెంపపై బలంగా కొట్టింది.

ఆ దెబ్బకి అతడు అల్లంతదూరం తుళ్లిప డ్డాడు.

"నీ బతుకు నువ్వే బతకలేవు. పైగా వాళ్ళను ఉద్ధరిస్తానంటావా? ఇంకొక్కసారి వాళ్ళ గురించిన మాట నీ నోటినుండి వచ్చిందా ఇక నీకు ఈ ఇంట్లో అన్నంమెతు కులు వుండవు. పస్తులుండి చావాలి. వెధవ సన్యాసీ" కోపంగా అంది లక్ష్మీదేవమ్మ.

భవానీశంకర్ కిమ్మనలేదు. తల్లివైపు రోషంగా చూస్తూ, లేచి బయటికి వెళ్ళి, ఎప్పట్లా అరుగుమీద కూర్చుని గౌసియా కోసం చూడసాగాడు.

అప్పుడు సమయం సాయంకాలం ఆరు గంటలు కావొస్తోంది. ఆ సమయంలో బాతులకోసం బయటికి వస్తుంది గౌసియా. అందుకే ఇంట్లో తల్లి తనమీద ఇంకా గొణు గుతూనే వున్నా పట్టించుకోకుండా, ఆమె ఎప్పుడెప్పుడు బయటికి వస్తుందా అని ఆత్రంగా ఎదురుచూడసాగాడు భవానీశం కర్.

కాసేపటికి మేతకోసం బయటికి వెళ్ళిన బాతులు బకబక అరుస్తూ తమ ఇంటిముం దుకువచ్చాయి. వాటి రాకకోసమే తను ఇంతసేపూ ఎదురుచూస్తున్నట్లుగా, ఆ

వెంటనే ఇంట్లోంచి వెలుపలికి వచ్చింది గౌసియా.

రాగానే అలవాటుగా భవానీశంకర్‌కోసం చూసింది. అతడు కూడా ఆమెనే చూస్తు న్నాడు. ఇరువురి చూపులు పలకరించుకు న్నాయి. పైకిమాత్రం పరిచయంలేని వాళ్ళలా కన్పిస్తున్నారు.

"బ్బ... బ్బ...బ్బ..." బాతుల్ని ఇంటి ముందు కట్టిన ఒక చిన్న గూడులోకి తోలు తోంది గౌసియా.

ఆమెనే చూస్తూ తల్లికొట్టిన దెబ్బను గురించి పూర్తిగా మర్చిపోయాడు భవానీశం కర్.

"ఏంట్రా... ఎవ్వరితోనైనా దెబ్బలా డావా? చెంప కందిపోయి వుంది" అంటున్న తండ్రి మాటలకు ఇహలోకంలోకి వచ్చాడు భవానీశంకర్.

తండ్రి గోపాలయ్య అప్పుడే వచ్చినట్టు న్నాడు. ఇంకా సైకిల్ కూడా దిగకుండానే కొడుకుని గాభరాగా చూస్తున్నాడు.

"నేను ఎవ్వరితో దెబ్బలాడలేదు" పౌరు షంగా అన్నాడు భవానీశంకర్.

"వాడి నిర్వాకం గురించి నేను చెప్తాను గానీ, మీరు ఇంట్లోకిరండి" ఆ వెంటనే ఇంట్లోంచి లక్ష్మీదేవమ్మ గొంతు వినబ డింది.

"ఏం చేశావురా?" అంటూనే సైకిల్ దిగి, ఒకపక్కగా ఆపి ఇంట్లోకి నడిచాడు గోపా లయ్య.

భవానీశంకర్ అక్కడే కూర్చుండిపో యాడు. అప్పటికి గౌసియా లోపలికి వెళ్ళి పోయింది. ఆమె చిన్నచెల్లెళ్ళు ఇద్దరు మాత్రం ఇంటిముందుకి వచ్చి తువ్వాళ్ళని చీరలుగా కట్టుకుని టీచర్లుగా ఆటాడుకుంటు న్నారు.

ఆ ఇంటికి రెండిళ్ళ అవతలవున్న మరో పెంకుటింట్లోంచి తబలా వాయిస్తూ ఖవాళి పాడుతున్న గొంతులు స్పష్టంగా వినబడుతు న్నాయి. అది కూడా ముస్లింల ఇల్లే. వాళ్ళ అబ్బాయికి ఇంకో వారంరోజుల్లో పెళ్లి. ఆ సంతోషాన్ని ఆరోజునుండే అనుభవిస్తు న్నారు వాళ్ళు. ఆ ఇంటితర్వాత అన్నీ హిందువుల ఇళ్ళు వున్నాయి.

ఆ ప్రాంతం మొత్తానికి సుమారుగా పది వరకు ముస్లిం కుటుంబాలు వున్నాయి. అది పూర్తిగా దిగువస్థాయి ప్రాంతం. అంతా పల్లెటూరి వాతావరణం గోచరి స్తుంది. అయినప్పటికీ అక్కడ హిందూ, ముస్లిం తేడాలు వున్నాయి.

మొదట్లో హిందూముస్లింలు చాలా స్తబ్ద తగా కలిసిమెలిసి వుండేవారు అక్కడ. ఎక్కడ మతసంబంధ గొడవలు జరిగినప్ప టికీ ఆ ప్రాంతంలో మాత్రం శాంతిభద్రత లకి భంగం కలగకపోయేది. అయితే రామ జన్మభూమి గొడవల సమయంలో మెల్లగా అక్కడకూడా గొడవలు లేవనెత్తారు. అది మొదలు ఆ ప్రాంతంలో హిందూముస్లింల మధ్య స్నేహభావం చెడిపోయింది.

"శంకర్..." ఇంట్లోంచి తండ్రి పిలుపు.

"మళ్ళీ చివాట్లు తప్పవు" అనుకుంటూ లేచి లోపలికి నడిచాడు భవానీశంకర్.

"నువ్వు గొప్ప సంఘసంస్కర్తగా మారాల నుకుంటున్నావా?" వెళ్ళగానే అడిగాడు తండ్రి గోపాలయ్య.

సమాధానం చెప్పలేదు భవానీశంకర్. తల వంచుకుని నిలబడిపోయాడు.

"అసలే ఇక్కడ పరిస్థితి బాగోలేదు. ఇలాంటి పరిస్థితుల్లో నువ్వు రాజారామ్మోహ నరాయ్‌వో, కందుకూరి వీరేశలింగానివో కానవసరంలేదు. నా కొడుకు భవానీశంక ర్‌గా బతుకుచాలు" అన్నాడు గోపాలయ్య.

అప్పటికీ పెదవి విప్పలేదు భవానీశం కర్.

"సాయిబు ఎంత దుర్మార్గుడో, మన పక్కింటి బాలస్వామి అంతకన్నా పదిరెట్లు దుర్మార్గుడు. వాడికి ముస్లిం పిచ్చి, వీడికి హిందూ పిచ్చి, ఇలాంటి మనుషులమధ్య నువ్వు ఆ పిల్లను రక్షించాలని వెళ్తే, తలలు

# ఏరినముత్యాలు

★ వివిధ విషయాలను చర్చించుకుంటాంగాని, ఒక్కటీ ఆచరణలో పెట్టం. అదే మన ముఖ్యలోపం.

–నెహ్రూ

★ వివేకంకంటే భావన ముఖ్యం.

–అల్బర్ట్ ఐన్‌స్టీన్

★ అలిసిపోయి ఏదో పుస్తకం చదవాలనుకున్నవాడికి, ఉత్సాహంతో పుస్తకం చదవాలనుకున్నవాడికి ఎంతో తేడా వుంది.

–జి.కె. చెష్టర్‌టన్.

★ చిన్న చిన్న పనులుగా విభజించుకుంటే ఏ పనీ అసాధ్యం అనిపించదు.

–హెన్రీ ఫోర్డ్

★ ఓ పువ్వునో, సీతాకోక చిలుకనో రూపాన్ని బట్టి నిర్ణయించవచ్చు. మానవుని నిర్ణయించలేం.

కె.కె.ఆర్.

★ తెలిసిన మూర్ఖుడు తెలియని చవటకన్నా మరింత పెద్ద చవట.

–మోలియర్

★ అతికష్టమైన పని 'నిన్ను నీవు తెలుసుకోవటం,' అతి తేలికైనపని 'ఇతరులకు సలహాలివ్వటం'

–లెరిటస్

★ మనకు ఇష్టమైనది చేయడంకాక, చేస్తున్నది ఇష్టపడటం మనం నేర్చుకోవల్సిన ముఖ్యపాఠం.

–బ్లేక్

★ అనుభవంవల్ల విజ్ఞానం, అవివేకంవల్ల అనుభవం లభిస్తాయి.

–గుచా గుయెట్రీ

★ మధురమంటే తీపి అని కాదు. ఎవరికి ఏది ఇష్టమైతే వారికది మధురం.

–ప్రదీప్ చైతన్య

★ ఆగ్రహావేశపరుడెప్పుడూ నోరు తెరచి కళ్లు మూసుకుంటాడు.

–కాటో

★ మరణం- జీవితంలో నష్టమైనదేమీ కాదు. మనం బతికి వున్నప్పుడు మనలోని మంచి గుణాలు మరణించడమే అతితీవ్ర నష్టం.

–నార్మన్ కజిన్స్

★ ఏదీ స్థిరం కాదు కీర్తి అయినా, ప్రఖ్యాతి అయినా.

–సి.సిడ్నీ

సేకరణ: పులగం వరలక్ష్మీగాంధీ

తెగడం ఖాయం. అయినా కాపాడుతానని నీవు అడుగు ముందుకు వేసినంత మాత్రాన ఆ పిల్ల నీ వెంట వస్తుందనుకుంటున్నావా? పిచ్చివాడా? వాళ్ళ పిల్లలు ప్రాణంపోతున్నా సరే గోష దాటి బయటికి రాలేదు. అయినా ఆ పిల్లను కాపాడ్డానికి నీకేం హక్కుగానీ, సంబంధంగానీ వుందిరా?" కచ్చితంగా అడిగాడు గోపాలయ్య.

"ఎదుటివాళ్ళని కాపాడ్డానికి హక్కులతో సంబంధాలతో పనిలేదు పప్పా" మనసులోనే అనుకున్నాడు భవానీశంకర్.

"ఇంక వెళ్ళరా. నాముందు నిల్చోవద్దు" అన్నాడు గోపాలయ్య.

వెనుతిరిగి మౌనంగా బయటికి నడిచాడు భవానీశంకర్.

"వేలెడు లేదు కుర్రకుంక. వీడికి సమాజ సంస్కరణ కావాల్సొచ్చింది" వెళ్తున్న కొడుకును చూస్తూ భార్యతో అన్నాడు గోపాలయ్య.

బయటికి వచ్చేశాడు భవానీశంకర్. అతడి మనసులో ఇప్పుడు మునుపటికంటే రెండింతలు ఎక్కువ భయపడుతున్నాడు.

"డబ్బు తీసుకుని తను ఇంట్లోంచి వెళ్ళిపోవడంవల్ల తన పప్పాకి ఇబ్బందులు ఎదురౌతాయని మాత్రమే ఇదివరకు బాధపడ్డాడు. ఎందుకంటే తను గౌసియాతో కలిసి వెళ్ళిపోయినట్లు ఇంట్లో తెలియకుండా, కేవలం డబ్బు తీసుకుని ఎటో పారిపోయినట్లు మాత్రమే తెలియాలనుకున్నాడు. అలాంటిది ఇప్పుడు అనవసరంగా గౌసియా గురించి ఇంట్లో మాట్లాడాడు. రేపు ఇంట్లోంచి వెళ్ళిపోతే విషయం ఇంట్లోవాళ్ళకి కచ్చితంగా తెల్సుకాబట్టి, నిజం ఎలాగైనా బయటికి పొక్కి హిందూముస్లిం గొడవలు జరుగుతాయేమో? తల్లిదండ్రుల ప్రోత్సాహంతో ఇంట్లోంచి వెళ్ళిపోతే ఎలాంటి సమస్యలు వుండవనీ, గౌసియా గురించి ఇంట్లో చెప్పగలిగాడు. మరి, తను తెలిసీ తెలియక చేసిన ఈ పొరపాటు నిజంగానే తలలు తెగేవరకు దారి తీస్తుందేమో"

నిలువెల్లా వణికిపోతున్నాడు భవానీశంకర్.

అప్పటికి చీకటిపడింది. సమీపంగా వున్న హనుమాన్ మందిరం దగ్గర భజన కార్యక్రమం ఆనవాయితీగా మొదలయ్యింది.

"అమ్మా! నేను భజనకు వెళ్తున్నాను" బయటనుండేచెప్పి మందిరంవైపు నడిచాడు భవానీశంకరం.

"రామా మేలుకొనరా... శ్రీరామ మమ్మేలుకొనరా" మైకు ముందు కూర్చుని భజనకీర్తన పాడుతున్నాడు బాలస్వామి. అతడు కొంత పాడగానే మిగతావాళ్ళు ఆ రాగాన్ని అందుకుంటున్నారు. వెళ్ళి అందరి మధ్యనా కూర్చున్నాడు భవానీశంకర్.

కొంచెం దూరంగా కనిపిస్తున్న మసీదుతాలూకు ప్రహరిగోడ పక్కన చాయ్‌బండి అమ్ముతూ కనిపిస్తున్నాడు సాయిబు. అతడి బండిచుట్టూ గిరాకీజనాలు నిండుగా వున్నారు.

తనే చాయ్ కాయడం, తనే గ్లాసులు కడుక్కోవడం వంటి అన్నిపనుల్ని తనే చూసుకుంటూ ఎప్పుడూ తీరికలేకుండా కనిపించే సాయిబు... ఆ సమయంలో చాయ్‌మాత్రమే అమ్ముతూ కనిపిస్తున్నాడు. ఎవరో దాదాపు పది సంవత్సరాల పిల్లవాడు పక్కనే ఎంగిలి గ్లాసులు కడుగుతున్నాడు.

భజనమధ్యలో లేచి సాయిబువైపు నడిచాడు భవానీశంకర్. అతడు చాయ్‌బండికి సమీపంగా వెళ్ళగానే, "చాయ్ హోనా" అడిగాడు సాయిబు.

"వద్దు... వక్కపొడి పాకెట్టు ఇవ్వు" అంటూ చొక్కాజేబులోంచి రూపాయిబిళ్ళ తీసి డబుల్‌రొట్టెల డబ్బామీద వుంచాడు భవానీశంకర్.

బండిలో ఒకపక్కగా వేలాడదీసిన వక్కపొడి పాకెట్లలో ఒక పాకెట్టును చింపి భవానీశంకర్‌కి అందించి, రూపాయిబిళ్ళ

తీసుకుని గళ్లాలో వేసుకున్నాడు సాయిబు.

"ఈ అబ్బాయి ఎవరు సాయిబూ?" పాకెట్టును చింపి వక్కపొడి నోట్లో పోసుకుని నములుతూ అడిగాడు భవానీశంకర్.

"పూరా గరీబు బచ్చా! సహాయం చేద్దామని పనిలో పెట్టుకున్నాను" చెప్పి, "అరే పాషా! జల్దీ కామ్ కరో" గ్లాసులు కడుగుతున్న కుర్రాడిని ఆదేశించాడు సాయిబు.

అంతలోనే ఓ ఇద్దరు గిరాకీలు వచ్చారు. వస్తూనే "సాయిబూ ఒన్‌బైటూ చాయ్" చెప్పాడు ఒక వ్యక్తి.

"టీకే, టీకే" అంటూ చిన్నగా వెలుగుతున్న బర్నాల్ స్టౌ మీద వున్న చాయ్‌గిన్నెలో మరికొంచెం టీపొడి, పంచదార, పాలు కలిపాడు సాయిబు. ఆ తర్వాత మంటను పెద్దది చేసే ప్రయత్నంగా గాలికొట్టడం ఆరంభించాడు.

భవానీశంకర్ కొన్నిక్షణాలు సాయిబు వేపు ఆశ్చర్యంగా చూసి, తర్వాత హనుమాన్ మందిరంవైపు నెమ్మదిగా నడిచాడు.

రోజూ రెండుకిలోల బియ్యం కొనుక్కొని అతిభారంగా జీవితాన్ని నడిపే సాయిబులో ఇప్పుడు కొత్త ఉత్సాహం. ఇన్నిరోజుల వరకు 'పనిపిల్లాడు ఎందుకు? పైసలు దండుగ' అనుకున్నవాడల్లా, ఇప్పుడు పనిపిల్లాడ్ని పెట్టుకోవడం... తోడుగా 'గరీబు బచ్చా' అని జాలిచూపడం చేస్తున్నాడు. సాయిబులో అంతమార్పు ఎందుకు వచ్చిందో భవానీశంకర్ గ్రహించగలిగాడు. అందుకే అతడిపై కోపం వచ్చింది.

"కన్నకూతుర్ని అంగడి సరుకు చేయాలనుకుంటున్న పాపిష్టి వెధవ" తనకి మాత్రమే వినిపించేలా తిట్టుకుంటూ మందిరం దగ్గరకి వెళ్లి ఎప్పట్లా అందరిమధ్యనా కూర్చున్నాడు.

బాలస్వామి పాడుతున్న కీర్తన పూర్తయ్యింది. మరోపాట అందుకుంటాడని అనుకున్నాడు భవానీశంకర్. కానీ అతడు తనని దోషిలా చూడ్డంతో కలవరపడ్డాడు. అతడు ఎందుకు అలా చూస్తున్నాడో కూడా భవానీశంకర్‌కు తెలుసు.

"ఆ తుర్కోడి బండిదగ్గరకు ఎందుకు వెళ్లావు?" నిలదీసినట్టుగా అడిగాడు బాలస్వామి.

"వక్కపొడికోసం" చెప్పాడు భవానీశంకర్.

"ఇకనుండి ఆ సుబ్బిశెట్టి దుకాణంలో కొనుక్కో" చెప్పి "రామా శ్రీ రామా జయ రామా... మాకు మతంలేదు...కులం లేదు... వున్నది నువ్వొక్కడివే" అంటూ మరో కీర్తన అందుకున్నాడు బాలస్వామి.

భక్తిపారవశ్యంతో కీర్తన పాడుతూనే తనపై ఆగ్రహించిన బాలస్వామి తీరు భవానీశంకర్‌కి విస్మయాన్ని కలిగించింది. తోడుగా ప్రస్తుతం అతడు పాడుతున్న కీర్తన నవ్వును తెప్పించింది. అయినా మౌనంగా కూర్చుండిపోయాడు.

హిందూముస్లిం తేడాలు బాలస్వామి, సాయిబుల కారణంగా ఆ ప్రాంతంలో బలంగా వున్నాయి. అలాగని శతృవుల్లా ఎవ్వరూ మెలగరు. ఎవరికివారే అన్నట్టుగా వుంటూనే, అవసరం అయితే అడపాదడపా కొందరు మాట్లాడుకుంటారు.

అయితే ఆ 'ఇద్దరు'లో సాయిబు మాత్రం వ్యాపారరీత్యా తరచూ అందరితో మాట్లాడుతుంటాడు. కానీ లోలోపల మనసు చంపుకుంటుంటాడు.

నిజానికి ఆ ప్రాంతానికి చెందినవాళ్ళు సాయిబు దగ్గరకి వెళ్ళడం బహు అరుదు. మసీదులో తాయెత్తులు కట్టే ముస్లీపు ఒకాయన వున్నాడు. ఆయన దగ్గరకి వేరే ప్రాంతాలకి చెందిన జనాలు మతప్రమేయం లేకుండా వస్తుంటారు. అలాంటివాళ్ళ గిరాకీ సాయిబుకి ఎక్కువ.

అదేపనిగా వస్తుండే ఆ జనాల కోసమే తన దగ్గర నిమ్మకాయల్ని, అగర్‌బత్తీలని, ఊదును ఉంచుకుని బయటికంటే ఎక్కువ అమ్ముతుంటాడు.

బాలస్వామి మాత్రం ముస్లీంలతో అస్సలు మాట్లాడడు. మాట్లాడిన భవానీ శంకర్ లాంటి వాళ్లను అధికారికంగా నిలదీస్తుంటాడు. ఇంకా చెప్పాలంటే ముస్లీం పండుగల సమయాల్లో ప్రత్యేకంగా భజనసమయాన్ని పెంచుతుంటారు. అవసరమైతే ఆ సమయాల్లో రేయింబవళ్ళు భక్తి గీతాలతో గుడితాలూకు మైకును అదరగొడుతుంటారు.

అందుకే బాలస్వామిని చూస్తున్న భవానీ శంకర్‌కి కోపం వచ్చింది. 'మంచి మనసు ఉండాలేగాని, ఏ మతమైతే ఏముంది?' మనసులోనే అనుకున్నాడు.

అతడి మనసును హర్షిస్తున్నట్లుగా అప్పుడే గుడిగంటలు మోగాయి. ఎవరన్నట్లుగా చూశాడు భవానీశంకర్.

తన పప్పా! అప్పుడే మందిరంలోకి వచ్చి భజనకు కూర్చోబోతూ హనుమంతుడికి దణ్ణంపెట్టుకున్నాడు.



## మంగళవారం

వేకువజామునే లేచి వ్యాయామశాలకు బయలుదేరాడు భవానీశంకర్.

వాతావరణం ఆహ్లాదంగా వుంది. అతడి మనసు మాత్రం గందరగోళంగా వుంది.

"జన్మ ఒక్కటే... జననం ఒక్కటే! పీల్చే గాలి ఒక్కటే... తాగే నీరు ఒక్కటే! వుండే దేశం ఒక్కటే. ప్రవహించే రక్తంలో రంగు ఒక్కటే! కాని మనసులోని భావాలు మాత్రం ఒక్కటిగా లేవు. మనుషులుగా పుట్టిన ఈ మనుషులు క్రూరమృగాలకంటే హీనంగా ప్రవర్తిస్తుంటారు" మనసులో అనుకుంటూ నెమ్మదిగా అడుగులు ముందుకు వేస్తున్నాడు అతడు.

"శంకర్..." కొద్దిదూరం వెళ్ళాక వెనక నుండి బాలస్వామి కంఠం వినపడింది.

ఆగుతూ వెనక్కి చూశాడు భవానీశంకర్.

"ఆరోగ్యం బాగోలేదా? బాగోలేకపోతే ఇంట్లోనే పడుకోవచ్చుకదా?" దగ్గరగా వస్తూ అడిగాడు బాలస్వామి.

"అలాంటిది ఏంలేదు" చెప్పాడు భవానీ శంకర్.

"మరి ఒంట్లో శక్తిలేని వాడిగా నడుస్తున్నావేం?" దగ్గరగా వచ్చి భవానీశంకర్ భుజాల చుట్టూరా చేయివేసి ముందుకు నడుస్తూ అన్నాడు బాలస్వామి.

వెంటనే ఏమని సమాధానం చెప్పాలో తోచలేదు భవానీశంకర్‌కు. అందుకే చిన్నగా నవ్వి వూరుకున్నాడు.

"ఏంట్రా పిల్లగా! నవ్వుతావు?" భవానీ శంకర్ భుజాన్ని చరిచాడు బాలస్వామి.

"ఏడవమంటావా?" మనసులో అనుకున్నాడు భవానీశంకర్.

ఇద్దరూ హనుమాన్ వ్యాయామశాలకు సమీపంగా వెళ్ళారు. అది బాలస్వామి నడిపిస్తున్నదే! అక్కడ ముస్లీంలకు ప్రవేశం లేదు. దానికి ఎదురుగా 'ఇస్మాయిల్ బాడీ లాంగ్వేజ్' పేరుతో మరొక వ్యాయామశాల వుంది. సాయిబు ప్రోద్బలంతో ఇస్మాయిల్ అనే యువకుడు నడుపుతున్న వ్యాయామశాల అది.

"ఆ తుర్కనా కొడుకుల్ని చూశావా? సగం తుర్క పేరు, సగం ఇంగ్లీషు పేరు

పెట్టుకున్నారు? " ఇస్మాయిల్ వ్యాయామశాలవైపు చూస్తూ వెక్కిరింతగా అన్నాడు బాలస్వామి.

"వాళ్ళ ఇష్టంలే అన్నా! మనకు ఎందుకు? " ఏదో ఒకటి అనాలనుకుని అన్నాడు భవానీశంకర్.

"అదేం శంకర్? ఆ సున్తీనాకొడుకులకి సపోర్టు ఇస్తున్నావు? " వెంటనే అడిగాడు బాలస్వామి.

"లే... లేదన్నా" గాభరాగా అని "బేకార్ నా కొడకా" మనసులో అనుకున్నాడు భవానీశంకర్.

"అదీమాట" అన్నాడు బాలస్వామి.

"అవును అన్నా... ఒకమాట" భయపడ్తూనే అన్నాడు భవానీ శంకర్.

"ఒక్కమాట ఎందుకు? పది మాటలు అడుగు" అన్నాడు బాలస్వామి.

వెంటనే అడగలేకపోయాడు భవానీశంకర్. కాసేపు తడబడి, ఆ తర్వాత కొద్దిగా ధైర్యాన్ని తెచ్చుకుని, "ఆ..." అంటూ ఏదో అడగబోయి, అంతలోనే విరమించుకుని, "ఏంలేదు" అంటూ బాలస్వామినుండి ముందుకు నడిచి వ్యాయామశాల లోపలికి వెళ్ళాడు భవానీశంకర్.

వెళ్తున్న భవానీశంకర్వైపు చిత్రంగా చూస్తూ, "పోరేగాడు" తనలో తను అనుకున్నాడు బాలస్వామి.

అరగంట తర్వాత వ్యాయామం ముగించుకుని వ్యాయామశాల వెలుపలికి వచ్చాడు భవానీశంకర్.

అప్పుడు సమయం ఐదుగంటలు. సమీపంగా వున్న మసీదులోంచి "అల్లాహో అక్బర్..." అంటూ నమాజు ఆరంభం అయ్యింది.

నమాజు అలా మొదలయ్యిందో లేదో వ్యామాయశాల వెలుపలే వ్యాయామం చేసుకుంటున్న బాలస్వామి... చేతిలోని డంబుల్స్ కిందపడేసి వడివడిగా అక్కడ్నుంచి వెళ్ళిపోయాడు.

అతడు వెళ్ళిన కాసేపటి తర్వాత గుడిదగ్గర భక్తిగీతాలు ఆరంభమయ్యాయి. మైకులోంచి వినబడుతున్న భక్తిగీతాలు నమాజు స్వరప్రవాహానికి అడ్డుకట్టలా మారాయి.

"వీడికి కాలమే బుద్ధిచెప్పాలి" బాలస్వామిని ఉద్దేశిస్తూ అన్నాడు ఒక పెద్దమనిషి. అతడు రోజూ వ్యాయామశాలకు వచ్చి యోగా చేస్తుంటాడు.

"అంకుల్..." పెద్ద మనిషికి దగ్గరగా వెళ్ళాడు భవానీశంకర్.

ఏంటన్నట్టుగా చూశాడు పెద్దమనిషి.

"మీతో ఒక్కమాట" అన్నాడు భవానీశంకర్.

"ఏంటీ? " అన్నాడు పెద్దమనిషి.

"హిందువులు, ముస్లింలు, ఐక్యత లేకుండా వుండటం మీకు బాధగా వున్నట్టుంది" నెమ్మదిగా అన్నాడు భవానీశంకర్.

"వున్నట్టుంది కాదు బాబూ వుంది" అన్నాడు పెద్దమనిషి.

"మరి మీరు పెద్దవాళ్లుకదా, బాలస్వామితో ఈ విషయం గురించి మాట్లాడండి"

నవ్వాడు పెద్దమనిషి "అభ్యుదయవాదిలా ఉన్నావే? " నవ్వుతూనే అన్నాడు.

ఆ మాటకు ఇబ్బందిగా కదిలాడు భవానీశంకర్.

"నీలాంటి కుర్రవాళ్లు ఈ సమాజానికి అవసరం. ఇలాగని ఆవేశం పనికిరాదు" అని కాసేపాగి "ఆ... బాబూ! నీ పేరు శేఖర్కదూ? " అడిగాడు పెద్దమనిషి.

"శంకర్. భవానీశంకర్" చెప్పాడు భవానీశంకర్.

"ఏం చదువుతున్నావు? " అడుగుతూ అక్కడ్నుంచి ముందుకు కదిలాడు అతడు.

"ఇంటర్ చదువుతున్నాను" వెంటే నడుస్తూ అసలు సంగతి చెప్పుకోలేకపోయాడు భవానీశంకర్.

"చదువుతున్నావు కాబట్టే నీకు ఇంగిత జ్ఞానం వుంది. కానీ ఇటు బాలస్వామి, అటు సాయిబు, ఇద్దరూ చదువుకోలేదు.

కాబట్టే అజ్ఞానులుగా వ్యవహరిస్తున్నారు. చదువుకున్న వాళ్ళల్లో కూడా ఇలాంటి అజ్ఞానులు ఉన్నారు. కాని ప్రస్తుతం ఇక్కడ చదువుకోనివాళ్ళే అజ్ఞానులు. వీళ్ళను ఎవ్వరూ మార్చలేరు" అంటూ సిగరెట్టు వెలిగించుకున్నాడు అతడు.

వింటూ వెంటే నడుస్తున్నాడు భవానీశంకర్.

"నాది స్వతహాగా కర్నూలు బాబూ! మాది రాయలసీమ అయినా మా బంధువులు విజయవాడలోనూ, మహబూబ్‌నగర్ లోనూ ఎక్కువగా వుండేవాళ్ళు. ఆ జిల్లాల్లో నాకు స్నేహితులు కూడా ఎక్కువే!

నా స్నేహితుల్లో ముస్లీంలు కూడా వున్నారు. వాళ్ళు ఎంత చక్కగా తెలుగు మాట్లాడతారూ అనేది విశేషం కాదు. తెలుగు సాహిత్యాన్ని సైతం ఎంతగా అభిమానిస్తారు అనేదే ముఖ్యం. ఇప్పటికీ నాలోగాని, వాళ్ళల్లోగాని, హిందూ ముస్లీం తేడాల్లేవు. మా బంధువులు కూడా తమ చుట్టుపక్కల ముస్లీంలతో ఎంతో సఖ్యతగా మెలుగుతుంటారు..." చెప్పుకుపోయాడు అతడు.

"అట్లాంటి సఖ్యత ఇక్కడ వుంటే ఎంత బావుండేదికదూ అంకుల్? " అన్నాడు భవానీశంకర్.

"ఇక్కడ కూడా వుంది. కాని మన వీధికి సంబంధించిలేదు. అందుకే నాకు ఇక్కడ ఉండాలి అన్పించదు. కాని స్వంత ఇల్లు కట్టుకున్నాను. కాబట్టి తప్పడం లేదు...

"నేను పుట్టింది బ్రాహ్మణుల ఇంట్లో! మా కులంవాళ్లకు చాదస్తం కొద్దిగా ఎక్కువే! ఈ చాదస్తం మా ఇంట్లో కూడా వుండేది. అయితే నేను మాత్రం అందుకు పూర్తిగా విరోధిని.

నాకు కులం, మతం, తేడాల్లేవు. అందరూ ఒక్కటే అనుకుంటాను. అనుకోవడం ఒక్కటే కాదు, నా భావాల్ని పదిమందితో పంచుకోవాలి అనుకున్నాను, అనుకుంటున్నాను. కాబట్టే ఇప్పుడు నీతో నా భావాల్ని చెప్పుకుంటున్నాను. మరి అంకుల్ నాతో సుత్తికొడుతున్నాడు అనుకోవుకదా? " భవానీశంకర్‌వైపు చూశాడు అతడు.

"అట్లా ఏమీ అనుకోను అంకుల్! మీ భావాలు నాకు బాగా నచ్చాయి" అన్నాడు భవానీశంకర్.

అతడు ముందుకు చూస్తూ తన భావాల్ని గుండెలోతుల్లోంచి మాట్లాడుతూపోయాడు.

"నేను సాహిత్యాభిమానిని కూడా! అప్పట్లో పత్రికలకు నా రచనలు పంపేవాడ్ని. నా రచనలు అన్నీ సామాజిక... మానవ సంబంధాల చుట్టూ తిరిగేవి" అని కాసేపాగి.

"ఇప్పుడు ఈ సాహిత్యం గురించి ఎందుకుగానీ, నీది చాలా చిన్నవయసు. నీ వయసులో వున్న పిల్లలు తమాషా మనస్తత్వాన్ని కలిగివుంటారు. కానీ నువ్వు అలా వుండకూడదు. నీ దృష్టి కేవలం చదువుపైనే వుండాలి.

తాత్కాలిక ఆనందాన్ని అందించే విషయాల మీదకు నీ దృష్టిని అస్సలు పోనీవద్దు. ప్రేమ, దోమా అంటూ నీ అమూల్యమైన సమయాన్ని వృధా చేసుకోవద్దు.

నీకు బంగారు భవిష్యత్ వుంది. ఆ భవిష్యత్‌ను పాడుచేసుకోవడం, తీర్చిదిద్దుకోవడం... రెండూ నీ చేతుల్లోనే వున్నాయి"

అతడి మాటలు భవానీశంకర్ గుండెల్లోకి సూటిగా గుచ్చుకున్నాయి. అందుకే ఇబ్బందిగా చేతులు నలపసాగాడు.

"బాబూ నీకు ఇంకో విషయం చెప్పడం మర్చిపోయాను. మనం వుంటున్నది మత విధ్వంసాల గుప్పిట్లో. ఏరోజు ఏంజరుగుతుందో తెలీకుండా రోజులు గడుపుతున్నాం. ఇట్లాంటి రోజులు రాక పూర్వం రాత్రనానూ ఇక కులమతాలు సమసిపోతాయి అనుకున్నారు. కానీ అవి సమసిపోవడంలేదు. రోజురోజుకీ పేట్రేగిపోతున్నాయి"

"..."

"కనీసం మీరయినా ముమ్ముందు ఇక్కడ సఖ్యతను నెలకొల్పాలి? మేం వచ్చిన

మొదట్లో ఇక్కడ సఖ్యత వుండేది. హిందూ ముస్లింలు ఒక కుటుంబంలా మెలిగేవారు.

అయితే ఒక ముస్లిం అమ్మాయిని, ఒక హిందూ అబ్బాయి టీజ్‌చేసిన విషయమై ఇక్కడ క్రమంగా గొడవలు మొదలయ్యాయి. ఇరవై ఐదేళ్ల క్రితం మొదలైన ఆ గొడవలకు కారకులు ఈ సాయిబు, బాలస్వాములే!

అప్పట్లో కొందరు ముస్లిం మతపెద్దలు తమ మత వ్యాప్తికోసం పాటుబడుతూ, అన్నివిధాలా సరైన వ్యక్తుల్ని ఎంపికచేసి ఆయా చోట్లకు పంపించేవాళ్ళు. ఆ విధంగా వెళ్ళే వ్యక్తులకు నెలసరి జీతాలు వుండేవి. ఆయా చోట్లకు వెళ్ళినప్పుడల్లా వాళ్ళ ఖర్చుల్ని కూడా భరించేవాళ్ళు. కాబట్టి వాళ్ళల్లో తను ఒకడిగా వుండాలని తెగ ప్రయత్నించేవాడు సాయిబు. కానీ అతడికి చదువుసంధ్యలు లేవుకాబట్టి, మత ప్రచారానికి అంతగా పనికిరాడనే ఉద్దేశ్యంతో కాబోలు మతపెద్దలు అతడ్ని పెద్దగా పట్టించుకోకపోయేవాళ్ళు.

అదే అతడ్ని ఉసిగొల్పింది. మతపెద్దలు తనని ఏంచేస్తే పట్టించుకుంటారోనని పరిపరివిధాలా ప్రయత్నించడం మొదలెట్టాడు. అందుకు అతడి పేదరికం కూడా ఒక కారణం కావొచ్చు. ఇట్లాంటి తరుణంలోనే ఓ ముస్లిం అమ్మాయిని హిందూ అబ్బాయి టీజ్ చేయడం, దాన్ని ఆసరాగా తీసుకుని సాయిబు పెద్దఎత్తున ఆవేశపడడం, క్రమంగా హిందూముస్లింల మధ్య గొడవలు తలెత్తడం జరిగింది.

ఇక్కడ స్వార్థం సాయిబు ఒక్కడిదేకాదు, బాలస్వామిది కూడా! ఎలా అంటే అప్పట్లో పిట్టలరాజు అనేవాడు ఈ ప్రాంతం మొత్తానికి దాదాగా వ్యవహరించేవాడు. మనుషుల్ని పిట్టల్ని చంపినట్టుగా చంపించేవాడు. కాబట్టి వాడికి ఆ పేరు వచ్చింది. వాడి దగ్గర యువకుడిగా వున్న బాలస్వామి ఒక తొత్తు.

అయితే పిట్టలరాజు పథకం ప్రకారం "హిందూముస్లింల మధ్య చాపకిందనీరులా ప్రవర్తించి గొడవలు రేపాలి. గొడవలు జరుగుతుంటే ఇరువురిమధ్యా సయోధ్యకు ప్రయత్నించాలి. ఇరువురితో మంచితనాన్ని నటించాలి. ఇందువల్ల రెండుమతాల అండదండలు తనకు లాభిస్తాయి" అని యోచించి బాలస్వామిని అందుకు ఆసరాగా మలుచుకుని, లక్షల రూపాయల్తో కాంట్రాక్టు మాట్లాడుకున్నాడు. డబ్బుకోసం మానవతను మరిచిన బాలస్వామి, తనకు తెల్సిన అబ్బాయిని వుసిగొల్పి ముస్లిం అమ్మాయిని కావాలని టీజ్ చేయించాడు.

ఈ గొడవల్లో ఆ అబ్బాయి మరణించాడు. అమ్మాయి కూడా ఆ తర్వాత మరణించింది. వీళ్ళిద్దరూ మరణించారు అని చెప్పేకంటే చంపబడ్డారు అని చెప్పడమే బాగుంటుంది.

తన స్వార్థంకోసం పడగవిప్పిన పిట్టలరాజు మాత్రం క్షేమంగా వుండిపోయాడు. సాయిబు, బాలస్వాములుకూడా హాయిగా వున్నారుకదా" చెప్పి భవానీశంకర్‌వైపు చూసాడు అతడు.

"ఈ గొడవల గురించి నాకు మా అమ్మ చిన్నప్పుడే చెప్పింది" అని, "అవును అంకుల్! పిట్టలరాజు నరరూపరాక్షసుడు అని అందరికీ తెలుసు. మరి అతడు మంచివాడుగా నటిస్తూ హిందూముస్లింల మధ్య సయోధ్యకు ప్రయత్నించినంతమాత్రానా, అతడ్ని ఈ ప్రజలు ఎలా నమ్ముతారు అనుకున్నాడు? " అడిగాడు భవానీశంకర్.

నవ్వాడు అతడు. నవ్వి, "డబ్బు బాబూ! డబ్బు! డబ్బు... వున్నవాడికి ఈ ప్రపంచం సలాం అంటుంది. వాడెవ్వడైనప్పటికీ డబ్బుగల వాడు కాబట్టి, వాడితో గులాంగా వుంటే తమ పనులు నెరవేరుతాయేమో అని ఈ వెర్రిజనాలు భావిస్తారు. కాబట్టే అట్లాంటి గూండాల దగ్గర నేటికినీ ఎందరో యువకులు తొత్తులుగా చేరుతున్నారు"

అన్నాడు.

"అవును అంకుల్! తమ పనులు సులువుగా నెరవేరుతాయని, తాము కూడా ఏదో ఒకరకంగా డబ్బు సంపాయించుకోవచ్చని, గూండాల దగ్గరవుంటే ఈ సమాజాన్ని కూడా బెదిరించవచ్చని, నాలాంటి యువకులు చాలామంది భావిస్తున్నారు" అన్నాడు భవానీశంకర్.

"శభాష్! నువ్వు ఈ మాట అంటున్నావంటే నీవు బుద్ధిమంతుడివి అన్నమాట" భవానీశంకర్ భుజం చరిచాడు అతడు. అతడి పొగడ్తకు భవానీశంకర్ పెదిమలపై చిరునవ్వులు పూశాయి.

"ఓకే బాబూ ఇక నేను వస్తాను" ఇంకొంత దూరం నడిచి అన్నాడు అతడు.

"ఒక్క నిముషం అంకుల్" అని కాసేపు తటపటాయించి, "మీరు హిందూముస్లింల మధ్య సఖ్యత అన్నారు కదా! ఈ సఖ్యతను ఎలా సాధించాలి? హిందూముస్లిం ఇద్దరూ పెళ్ళి చేసుకుంటే ఐక్యత వస్తుందా? " అడిగాడు భవానీశంకర్.

భవానీశంకర్‌వైపు చిత్రంగా చూస్తూ నవ్వుతూ, "మరీ ఇంత అమాయకత్వం పనికిరాదు..." అంటూ భుజం చరిచాడు అతడు.

"...."

"హిందూ ముస్లీంలు పెళ్ళిచేసుకోవడంతో ఐక్యత రాదు బాబూ? అసలు ఆ ఆలోచనే తప్పు! ఎలా అంటే... మతానికి సామాజిక విలువ వుంది. ఎవరి మతం మీద వాళ్ళకు అపారమైన అభిమానం వుంటుంది. మతాభిమానం లేనివాళ్ళు కూడా వున్నారు. ఇదంతా ఏమైనప్పటికీ రెండు మతాల మధ్య భేదభావాన్ని తొలగించి, మనుషులంతా ఒక్కటే అన్నట్లుగా మెలగాలి అంటే అది సామాన్యమైన విషయం కాదు. అందుకు ఎంతో శ్రమపడాలి.

మంచి మనసుతో మెలుగుతూ, అందరితో స్నేహపూర్వకంగా వుంటూ ఓర్పూ నేర్పూ పాటించాలి. ఇంతేకాని పెళ్ళిళ్లు చేసుకుంటేనే ఐక్యత వస్తుందనుకోవడం పొరపాటు. మతాంతర వివాహం తప్పుకాదు. కాని ఐక్యత విషయంలో అట్లాంటి ఆలోచన రావడం తప్పు" అన్నాడు అతడు.

సరే అన్నట్టుగా తలాడించాడు భవానీశంకర్.

"వస్తాను బాబూ..." అంటూ ఎడంగా వున్న సందువైపు బయలుదేరాడు అతడు.

భవానీశంకర్ నెమ్మదిగా తమ ఇంటివైపు అడుగులు వేయసాగాడు.

"శంకర్" వెనకనుండి పిలుస్తూ వచ్చాడు స్నేహితుడు సురేష్. ఆగాడు భవానీశంకర్.

"అంకుల్ నీకు ఏదో క్లాస్ తీసుకున్నట్టు వున్నాడు? " అడుగుతూ దగ్గరగా వచ్చాడు సురేష్.

"తీసుకున్నాడులేగాని, నాకు భయంగా వుందిరా" ముందుకు నడుస్తూ అన్నాడు భవానీశంకర్.

"ఎందుకు? " అడిగాడు సురేష్.

"గౌసియా విషయంలో"

"ఉదయాన్నే ఏంట్రా ఈ తలనొప్పి? " అన్నాడు సురేష్.

"తలనొప్పి కాదురా, పరిస్థితుల్ని తల్చుకుంటే బాధ" అన్నాడు భవానీశంకర్.

నవ్వాడు సురేష్. ఆ నవ్వులో తేలిక భావం.

"నువ్వెప్పుడూ ఇంతేరా! నన్ను అస్సలు అర్థం చేసుకోవు" భవానీశంకర్ గొంతులో బాధ.

"లేకపోతే ఏంట్రా? ఆ పిల్ల ఏంటీ... ఆ పిల్లకోసం ఇంత బిల్డప్ ఏంటీ? " వెక్కిరింతగా అన్నాడు సురేష్.

భవానీశంకర్ ఇంకేం అనలేదు. సురేష్ ఎప్పుడూ అంతే. అతడి ప్రేమను మాటవరసకు కూడా ఆమోదించడు. అందుకే అతడు సురేష్‌తో వీలైనంతవరకు తన ప్రేమగు



రించి చెప్పుకోడు. ఎప్పుడైనా చెప్పుకున్నా ఇలాంటి పరిస్థితే ఎదురవుతుంది.

"ఆ చెప్పరా! వ్యాయామశాల దగ్గర్నుండి ఆ ముసలి అంకుల్‌తో ఏమేం బాతాఖానీ కొట్టావు? " తనే అడిగాడు సురేష్.

"ఏం లేదురా! హిందూ ముస్లీంల మధ్య సామరస్యం కోసం యువత పాటుపడాలి అని చెప్పాడు" అన్నాడు భవానీశంకర్.

ఫకాలున నవ్వాడు సురేష్.

"ఎవ్వడి బతుకు వాడే బతకలేక ఛస్తుంటే, ఆయనగారు నీతిబోధనలు చేస్తున్నాడా? సరేలే... ఆయనగారు చెప్పినట్టే బాగుపడదాం. మరి రేపొద్దున్న మన పెళ్ళాం పిల్లల్ని ఎలా పోషించాలో ఒకసారి అడుగు" నవ్వాక అన్నాడు సురేష్.

"అంటే స్వంత పనులన్నీ సామరస్యం కోసం వదులుకోవడం కాదు..." అన్నాడు భవానీశంకర్.

"పోరా" నిర్లక్ష్యంగా చేయి విదిల్చి ఆ పక్కనే వున్న సందు వెంబడి సాగిపోయాడు సురేష్.



"నువ్వు సామాన్యుడివి కాదురా! నీలో వున్న స్వార్థం భయంకరమైనదిరా" వెళ్తున్న స్నేహితుడ్నే చూస్తూ మనసులో అనుకున్నాడు భవానీశంకర్.

అప్పటికి మసకమసగ్గా తెల్లవారసాగింది. నమాజు ఎప్పుడో పూర్తయింది. భక్తిగీతాలు మాత్రం ఇంకా ఆగలేదు.

"ప్చ్! గౌసియా నాకు ఎందుకు నచ్చిందో, ఆమెకు నేనెందుకు నచ్చానో..." మనసులోనే విచారంగా అనుకుంటూ నెమ్మదిగా అడుగులు ముందుకు వేయసాగాడు భవానీశంకర్.

అతడికి గతం క్రమంగా గుర్తుకు రాసాగింది.

అప్పట్లో రామజన్మభూమి గొడవలు జరిగినప్పుడు తను బాగా చిన్నవాడు. రేగుతున్న మతకలహాలు బాగా అర్థమయ్యాయి. ఆ ప్రాంతంలో అంతకుముందు నుండే మతభేదాలు వున్నందున రామజన్మభూమి గొడవలు అక్కడ తీవ్రతరంగా చెలరేగాయి. ఫలితంగా అమాయక ప్రాణాలు నేలకు ఒరిగాయి. ఇందుకు పూర్తిగా భయకంపితులైన తన తల్లిదండ్రులతో పాటుగా చాలామంది కుటుంబాలు ఆ ప్రాంతాన్నే వదిలిపెట్టడం జరిగింది. అప్పుడు తాము నల్లగొండ జిల్లాలో వున్నారు.

హిందువుల దేవాలయాలపైనే కాదు, ఊళ్లోకి వచ్చిన రామపాదుకలపై కూడా ముస్లింలు దాడిచేశారు. పొలాల్లోనూ, కొన్ని ఇళ్లముందరనూ, భక్తిపూర్వకంగా కట్టుకున్న మహ్మద్‌హుస్సేన్ దర్గాలపైనే కాకుండా... మసీదులపై కూడా హిందువులు దాడిచేశారు. ఆ గొడవల్లోనే బాలస్వామి తమ్ముడు చనిపోయాడు. సాయిబు అన్న కూడా చనిపోయాడు.

గొడవలు సద్దుమణిగాక ఇంటికి రావడం జరిగింది. అప్పటికి గౌసియాతో తనకు పరిచయం లేదు. కాకపోతే కలహాల్లో గౌసియా గాయపడింది. ఆమెకు ఒళ్ళంతా కట్లుకట్టి వున్నారు. తనకు పాపం అన్పించింది. అందుకే ఓ రోజు ఇంటిముందు కూర్చున్న గౌసియా దగ్గరకి వెళ్ళి మాట్లాడాడు. అప్పుడు మళ్ళీ గొడవలు చెలరేగాయి. ఆ గొడవల్లో తన తండ్రి గాయపడ్డాడు.

ఇవన్నీ గుర్తుచేసుకుంటే ఒళ్ళు గగుర్పొడుస్తుంది. మరి తమ ప్రేమను తను ఎలా గెలుచుకోగలడు? గెలవకపోతే తను బతకగలడా? తనే కాదు, గౌసియా కూడా బతకలేదు.

"రేయ్ శంకర్..." వున్నట్టుండి సురేష్ గొంతు మళ్ళీ వినబడింది.

ఆగి తిరిగి చూశాడు భవానీశంకర్.

"రేయ్... ఎప్పుడూ కూడా నీ మాటను, నీ ప్రేమను, నేను లక్ష్యపెట్టలేదుకదా! కాని ఇప్పుడు మాత్రం ఒక మంచి సలహా ఇవ్వడానికి వచ్చాను" దగ్గరగా వస్తూనే అన్నాడు సురేష్.

"ఏంట్రా? " ఆసక్తిగా కళ్లింత చేశాడు భవానీశంకర్.

"ఇదిగో! మన హిందువుల్లో మతం మార్చుకునే ఆత్మాభిమానంతక్కువ వెధవలు చాలామంది వున్నారు. వాళ్ళల్లో నువ్వొకడివి అయిపోతే చాలు! నీకు ఇష్టమైన పిల్లను నువ్వు హాయిగా చేసుకోవచ్చు" చెప్పి ఆ వెంటనే వెనుతిరిగి వెళ్ళిపోయాడు సురేష్.

"వీడు నన్ను ఎత్తిపొడుస్తున్నాడా లేక నిజంగా ప్రోత్సహిస్తున్నాడా? " అర్థం కాలేదు భవానీశంకర్‌కు. అందుకే వెళ్ళిపోతున్న స్నేహితుడివైపు ఎగాదిగా చూస్తుండిపోయాడు.

అంతలోనే అన్పించింది కూడా... "నిజమే! నాకు తెల్సీ మతం మార్చుకున్న ముస్లింలు ఎవ్వరూ లేరు. ఎక్కడైనా వున్నారేమో తెలీదుగాని, తనకు తెల్సి సంగీత దర్శకుడు రెహమాన్ ముస్లిం మతాన్ని తీసుకున్నవాడే... సరూర్‌నగర్‌లో తమకు తెల్సిన బ్రాహ్మణ స్త్రీ ముస్లింను పెళ్ళిచేసుకుని

రజిత పేరును కాస్తా రజియాగా మార్చుకుంది. ఇంకా సినిమానటి ఐశ్వర్య, ఆమని ముస్లీం మతాన్ని తీసుకున్నవాళ్ళే మరి వీళ్ళంతా వాడు సురేష్ అన్నట్టుగా ఆత్మాభిమానం లేనివాళ్ళా? కాదు! ఆ మతంలో వాళ్ళకు ప్రేమతత్వం కనబడింది. అందుకే అంత గొప్ప త్యాగం చేశారు. మరి నేను కూడా ముస్లీం మతం తీసుకుంటే ఎలా వుంటుంది? "

"రేయ్ శంకర్!" అంతలోనే మళ్ళీ వచ్చాడు సురేష్.

"మళ్ళీ ఏం మాటరా? " అడిగాడు భవానీశంకర్.

"ఇతర మతస్థులు హిందూమతాన్ని స్వీకరిస్తే పెద్ద హంగామా వుండదు కాని, తమ మతాన్ని స్వీకరించే ఇతర్లను ముస్లీంలు మాత్రం ఆనందంగా ఆహ్వానిస్తారు. అంతేకాదు, అట్లాంటివాళ్ళను పరిపూర్ణ ముస్లీంగా కూడా భావిస్తారు, గౌరవిస్తారు, ప్రేమిస్తారు. ఎందుకంటే... చెల్లెళ్ల చేయిని కూడా పట్టుకునే "చెడిన మతం" కదా అది అని తిరిగి ఆ వెంటనే వెళ్ళిపోయాడు సురేష్.

"వీడికేం వచ్చింది? నిముషానికి ఒక మాట మాట్లాడి వెళ్తాడు. ముస్లీం మతం చెడిన మతం అయితే హిందూమతం కూడా చెడిన మతమే! వీళ్లు మేనకోడల్ని చేసుకోవడంలేదా? అబ్బ తమ్ముడు అబ్బనే అవుతాడు. అమ్మ చెల్లి అమ్మనే అవుతుంది. అమ్మ తమ్ముడు మాత్రం మొగుడు ఎందుకు అవుతాడు. ఇది హిందువుల అనంగీకార పద్ధతి కాకపోతే మరేం అవుతుంది? " అనుకుంటూ ఇంక అక్కడ ఆగకుండా ఇంటివైపు వడివడిగా అడుగులు వేయసాగాడు భవానీశంకర్.

ఇంటికి సమీపంగా వెళ్ళేసరికి చేతిపంపు దగ్గర నీళ్ళు పట్టుకుంటూ కనిపించాడు సాయిబు.

అతడితో పాటుగా ఒక హిందూవ్యక్తి కూడా వున్నాడు. అయితే హిందూ వ్యక్తి సాయిబు ఉనికిని పెద్దగా పట్టించుకోవడం లేదు. సాయిబు మాత్రం ఆ వ్యక్తి ఉనికిని సహించలేనట్టుగా ముఖమంతా గంటులా పెట్టుకుని పంపుకొడుతున్నాడు.

పంపుకింద వున్న బిందె నిండగానే తన బిందెను తీసుకుని పంపుకు సమీపంగా వెళ్ళాడు హిందూవ్యక్తి.

"ఏం... జర దమాక్ కరాబ్ అయ్యిందీ? ఇవి పీనేకే పానీ! నీవు ఇట్లా మీదికి ఉర్కివస్తే మేము నీళ్లను ఎట్లా తాగాల? " ఆ మాత్రానికే కోప్పడిపోయాడు సాయిబు.

"సర్లే సర్లే..." హిందూ వ్యక్తి శాంతంగా అన్నాడు.

"ఈ సూదరి జనాలకు ఎవ్వరితో ఎట్లుండాల్నో గూడా తెల్వదు" అనుకుంటూ బిందె ఎత్తుకుని వెళ్ళిపోయాడు సాయిబు. (మామూలు వూళ్లల్లో హిందువులు అందర్నీ 'సూదరి జనాలు'గా పేర్కొంటుంటారు ముస్లీంలు)

హిందూ వ్యక్తి సహజంగా పంపుకింద తన బిందెను పెట్టి, పంపుకొట్టసాగాడు. అంతసేపూ అంతా గమనిస్తూ ఎక్కడ ఉన్నాడో మరి బాలస్వామి... పరుగున వచ్చి పంపుకింద బిందెతీసి, పంపును కడిగినట్టుగా నీళ్లను ఒక్కసారిగా గుమ్మరించాడు.

"అదేంటన్నా? " విస్తుపోయాడు ఆ వ్యక్తి.

"నీకు సిగ్గూ శరం లేదురా! నీ కార్జానికి చేదు లేదురా? వాడు నువ్వేదో అంటరాని వాడివి అన్నట్టుగా మాట్లాడిపోతే, నువ్వు పౌరుషం లేనివాడిగా వుండిపోవడమేనా? " ఆవేశంగా అని "ఇంకొక్కసారి పంపును కడిగి నీళ్ళు పట్టుకో" చెప్పి వెళ్ళిపోయాడు బాలస్వామి.

అంతా చూస్తున్న భవానీశంకర్‌కు తల తిరిగినట్టయ్యింది. "ఇంకేమైనా పనీపాట వుంటేకదా" తనలో తను గొణుక్కుంటూ వెళ్ళిపోతున్న బాలస్వామివైపు గుర్రుగా చూశాడు.



ఉదయం పదవుతుందనగా సాయిబు ఇంటిముందుకు తెల్లని అంబాసిడర్ కారు వచ్చి ఆగింది. కారు ఆగీ ఆగగానే వెనక డోరు తీసుకుని అరబ్బుషేకు దిగాడు.

అప్పటికే బయటకి పరుగెట్టుకొచ్చిన సాయిబు, అరబ్బుషేకుకు సలాం చెప్పి, సాదరంగా ఇంట్లోకి తీసుకెళ్ళాడు.

చెక్క స్టూలును దులిపి "కూర్చోండి మహరాజ్" వినయంగా చెప్పాడు.

అరబ్బుషేకు స్టూలుమీద కూర్చుని ఇల్లంతా కలియచూశాడు.

"చాయ్ తీసుకుంటారా మహరాజ్" ఈ మారు చేతులు కట్టుకున్నాడు సాయిబు.

"నాకు చాయ్ వద్దు ఏమీవద్దు. శుక్రవారం రోజు నీకు యాభైవేలు ఇచ్చాను. ఇచ్చి ఈ రోజుకి ఐదురోజులు కావొస్తోంది. ఐదు నా అదృష్టసంఖ్య. అందుకే ఈరోజు మిగతా డబ్బులు ఇచ్చేసి, పిల్లను నిఖా చేసుకుని వెళ్ళిపోవాలనుకుంటున్నాను"

"మంచి మాట" చిరునవ్వుతో తలాడించాడు సాయిబు.

ఆ మాటల్ని వింటుండగానే లోపలిగదిలో కూర్చుని వున్న గౌసియాబేగం నిలువెత్తున వణికిపోయింది.

"అల్లా" గుండెలపై చేయివేసుకుని భయంగా తల్లివైపు చూసింది.

"ఎందుకు భయపడ్తున్నావు? షేకు ముసలివాడైనా నీకు సుఖం దక్కుతుంది. ఈ గరీబు జీవితాన్ని భరించేకంటే అట్లాంటి సంపన్న జీవితమే మేలు" గౌసియాకి మాత్రమే వినబడేలా అంది తల్లి.

"వొద్దమ్మా... నాకా జీవితం వొద్దు" గౌసియాకి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"అట్లా అనవద్దు బేటా! నీవు మహారాణివి అయిపోతున్నావు. ఇక కోరింది కొనుక్కోవచ్చు ఈ చిరిగిన బట్టలు, ఈ గడ్డితిండి, ఈ పాత ఇల్లు, ఇవేమీ నీకు వుండవు

"పట్టెమంచాలు, జరీచీరలు, పెద్దపెద్ద గదులు వున్న బంగళా, అన్నీ నీ సొంతమైపోతాయి. అందుకే ఆనందంగా వుండు" ఆశ పెంచే ప్రయత్నం చేసింది తల్లి ఖతీజాబీ.

అనూహ్యంగా తనకోసం అరబ్బుషేకు ఇంటికి వచ్చినరోజు, గౌసియాబేగం భయపడింది... బాధపడింది... కలవరపడింది. అప్పుడు తల్లి ఖతీజాబీ ఇలాగే ఆశల్ని పెంచుతూ ధైర్యాన్ని అందించింది. అయినప్పటికీ గౌసియా మనసు కుదుటపడలేదు.

ప్రియుడ్ని కలుసుకున్న తర్వాత అతడు అందించిన ఓదార్పు, ధైర్యమే ఆమె మనసు కుదుటపడేలా చేసాయి. అయితే అరబ్బుషేకు తిరిగి ఇంత త్వరగా ఐదురోజుల తర్వాతే తనకోసం వస్తాడని అనుకోలేదు. తల్లిదండ్రులు ఆ విషయం గురించి ఆమెకు చెప్పనూలేదు. వాళ్ళ దృష్టిలో కూతురు ఒక వ్యాపారవస్తువు. అందుకే ఆమె గురించిన విషయాన్ని కూడా ఆమెకు చెప్పాల్సిన అవ

సరం లేదనుకున్నారు వాళ్ళు. కాపోతే తన రేటును మాత్రం తెల్సుకోగలిగింది గౌసియా. అదీ కూడా తెలియకపోయేదే. కాని "వచ్చే డబ్బుల్తో ఏఏ పనులు చేసుకుని, ఏఏ అవసరాలు తీర్చుకోవాలి? అందుకు ఎంత ఖర్చవుతుంది?" అంటూ తల్లిదండ్రులు లెక్కలు వేసుకుంటుంటే విననట్లుగానే వుండీ వినగలిగింది.

"షేకు వెంట వెళ్ళడం నాకు ఇష్టం లేదు" ఉబికివస్తున్న కన్నీళ్ళను తుడ్చుకుంది గౌసియా.

"బేటా" అంతలోనే లోపలికి వచ్చాడు సాయిబు.

కళ్ళనీళ్ళను మరోసారి తుడుచుకుంటూ తండ్రివైపు చూసింది గౌసియా.

కూతుర్ని అలా చూడగానే సాయిబు చీకాగ్గా ముఖం చిట్లించాడు.

"క్యెకు రోరి?" పళ్ళబిగువున అడిగాడు.

భయంగా చూసింది గౌసియా.

"షేకుకు సలాం చెప్పాలి. తొందరగా కొత్త సారి కట్టుకుని తయారవ్వు" అని చెప్పి, బయటకి వెళ్ళిపోయాడు తండ్రి.

ఇనప పెట్టెలోంచి వారంరోజుల కిందట కొన్న ఎరుపురంగు జరీచీర తీసి కూతురుకు అందించింది ఖతీజాబీ.

చీర తీసుకుని ఒక మూలగా వెళ్ళింది గౌసియా. పెద్దచెల్లెలు జుబేదాబేగం పెట్టికోట్... జాకెట్టు... తెచ్చి ఇచ్చింది.

పదినిముషాల్లో చీరకట్టుకుంది గౌసియ. తర్వాత అదే గదిలోవున్న జాలాడిలో ముఖం కడుక్కుంది.

అంతలోనే మళ్ళీ వచ్చాడు సాయిబు. తయారవుతున్న కూతురిని చూస్తూ "తొందరగా" అని చెప్పి ఆ వెంటనే వెళ్ళిపోయాడు.

మరో పదినిముషాల్లో తయారయ్యింది గౌసియ. ఆమె ముస్తాబు చౌకబారుగా వుంది. పదిరూపాయల విలువచేసే పొడవైన లోలకులు ధరించి, రెండ్రూపాయలకు దొరికిన అత్తరు పరిమళాన్ని దూది సహాయంతో నిలువెత్తున అద్దుకుని... ఆ దూదిని పదిలంగా చెవిలో ఒకమూలగా దోపుకుని, ఐదుగూపాయలకి కొన్న ఎర్రని లిప్‌స్టిక్‌ని పెదవులకి పూసుకుని, రంగు పక్కపిన్నులతో నున్నగా దువ్వి జడవేసుకుని, పాపెడలో మెరుగు అద్దుకుని, నిరుపేద ఇంటి నిండైన బొమ్మలా కనబడుతోంది.

"అయిపోయిందా?" అడుగుతూ లోపలికి వచ్చాడు తండ్రి. రాగానే కూతుర్ని చూసి, "మేరీ బేటీ అచ్ఛాహై" మెచ్చుకోలుగా అన్నాడు.

ఆ సమయంలోనే తలనిండుగా కొంగువేసుకుంది గౌసియ.

"ఆ... అదీ" కూతురు ముసుగును కూడా మెచ్చుకున్నాడు తండ్రి.

"అబ్బ వెంటనే బయటకి వెళ్ళు" చెప్పింది ఖతీజాబీ.

"సరే" అన్నట్టుగా తలాడించి, తండ్రివెంటే బయటకి నడిచి, ముఖాన్ని పూర్తిగా నేలకు వంచేసి "సలాంవాలేకుం" అంటూ చేతిని నొసటికి ఆన్చి తీసి అలాగే నిలబడిపోయింది.

ఆమెను చూస్తున్న అరబ్బుషేకు కళ్ళు ఆశగా మెరుస్తున్నాయి. జరీచీర చాటునున్న ఆమె అందాన్ని చూస్తూ, "ఈ రాత్రికి నిఖా చేసుకుంటాను" అన్నాడు.

"అట్లాగే" తలాడించాడు సాయిబు.

"రేపు ఉదయాన్నే ముంబాయి బయలుదేరాలి. అక్కడ నాకు కొన్ని పనులు వున్నాయి. కాబట్టి ఒక నెలరోజులు అక్కడే వుండి, ఆ తర్వాత దుబాయి వెళ్ళిపోతాం" చెప్పాడు షేకు.

వింటూ తలాడించాడు సాయిబు.

"మీ ఇంట్లోనే నిఖా చేసుకుంటాను. ఇందుకు మీరేమీ ఖర్చు పెట్టుకోవద్దు. ఖర్చంతా నాదే" నిండుగా గాజులు ధరించిన గౌసియా చేతిని ఒకసారి మృదువుగా స్పృశించి వదిలేస్తూ చెప్పాడు షేకు.

అందుక్కూడా తలాడించాడు సాయిబు.

"ఇక నీ బేటీను ఇంట్లోకి పంపించు" లేచి నిల్చుంటూ అన్నాడు షేకు.

"బేటీ! లోపలికి వెళ్ళు" తను కూడా లేచి నిల్చుంటూ చెప్పి, "బయలుదేరుతున్నారా? " షేకు ముఖంలోకి సవినయంగా చూస్తూ అడిగాడు సాయిబు.

"అవును" అంటూనే బయటికి నడిచాడు షేకు. వెంటే వెళ్ళాడు సాయిబు. షేకు వెళ్ళగానే కారుడోరు తీసి పట్టుకున్నాడు డ్రైవరు. ఎక్కి కూర్చున్నాడు షేకు.

అతడికి మరోసారి సలాం చెప్పాడు సాయిబు. అతడు గంభీరంగా తలపంకించాడు. మరుక్షణం కారు ముందుకు కదిలింది.

బయటినుండి ఇంటికి వస్తున్న భవానీశంకర్ ఆ దృశ్యాన్ని చూడగానే అప్రయత్నంగా తన అడుగుల్ని నెమ్మది చేసాడు. కలవరపడిపోతూ, ఎదురొచ్చిన కార్లోకి గుచ్చి మరీ చూసాడు.

"గౌసియాను తీసుకెళ్ళిపోతున్నాడేమో" అని ఏ మూలనో పీడించిన అనుమానం, కార్లో గౌసియా కనబడకపోవడంతో ఆనందంగా మారింది.

"రక్షించావురా దేవుడా" అనుకుంటూ సాయిబువైపు చూశాడు.

సన్నగా మహమ్మద్‌రఫీ పాట పాడుకుంటూ చాయ్‌బండి అమ్మేదిశగా వెళ్తున్నాడు సాయిబు.

"దుర్మార్గుడా" మనసులో అనుకుని, ఆ వెంటనే వెనుతిరిగి, పరుగుపరుగున కిలోమీటర్ దూరాన వున్న స్నేహితుడి ఇంటివైపు నడిచాడు భవానీశంకర్.

స్నేహితుడి ఇల్లు సమీపించగానే, ఆ దరిదాపుల్లో బాలస్వామి గనుక వున్నాడేమోనని అటూ ఇటూ చూసి, లేడని నిర్ధారించుకున్నాక హాయిగా ఊపిరిపీల్చుకుంటూ స్నేహితుడి ఇంటి తలుపు తట్టాడు.

ఎవరు అన్నట్లుగా కిటికీలోంచి చూసి, ఆ తర్వాత తలుపుతీసింది స్నేహితుడి అక్క పర్వీనాసుల్తాన.

"ఆపా... షిరాజ్ వున్నాడా? " హడావిడిగా అడుగుతూ లోపలికి నడిచాడు.

"కాలేజికి వెళ్ళాడు" చెప్తూ తలుపులు దగ్గరగా వేసింది పర్వీనా.

"ఆపా... గౌసియా వాళ్ళింటికి ఆ షేకుగాడు మళ్ళీ వచ్చాడు" అదే హడావిడితో చెప్పాడు భవానీశంకర్.

"అనుకున్నాను" అంటూ గుమ్మం తాలూకు పరదా సరిచేసి, "షేకు వాళ్ళ ఇంట్లోనే వున్నాడా ఇప్పుడు? " అడిగింది పర్వీనా.

"వెళ్ళిపోతుంటే చూశాను"

"అలాగా!" అంటూ వెళ్ళి అక్కడున్న కుర్చీలో కూర్చుంటూ "గౌసియాతో మాట్లాడాలి అనుకుంటున్నావా? " అడిగింది.

"అవును ఆపా" అంటూ వెళ్ళి ఆమెకు ఎడంగా వున్న మరో చెయిర్‌లో కూర్చున్నాడు అతడు.

"ఈరోజు నాకు కుదరదు. కాబట్టి రేపు మాట్లాడు"

"వద్దు ఆపా! ఈరోజే మాట్లాడాలి"

"కాని ఈరోజు వూరినుండి మా అమ్మా నాన్న వస్తున్నారు"

"అయితే కనీసం గౌసియాతో మాట్లాడి, విషయాలు తెల్సుకో"

"సరే"

"ఇప్పుడే వెళ్తావా వాళ్ళింటికి? "

"అంత తొందరపడ్తావేం? " చిన్నగా నవ్వింది పర్వీనా.

"నాకు కంగారుగా వుంది" చేతులు నలుపుకుంటూ చెప్పాడు భవానీశంకర్.

"మొన్న జుమ్మా రోజు కూడా ఇలాగే కంగారుపడ్డావు" అందామె.

"ఆరోజుకంటే ఈరోజు ఎక్కువ కంగారుగా వుంది. ఎందుకంటే వాడు రెండవసారి రావడం అంటే గౌసియాని తీసుకువెళ్ళే సమయం దగ్గరపడిందనే అర్థం"

# రచయితలకు మనవి



★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**

★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టలోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ **ప్రతి నవలకు అందజేసే రు: 3000/– పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.**

**ఎడిటర్:**

# చతుర

**'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.**




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

మే చతుర నవల ఏడురోజులు

..........................................................

**సమీక్షకుని పేరు :** ..........................................................

**చిరునామా :** ..........................................................

..........................................................

..........................................................

..........................................................

"పడనీయ్! ఈ జుమ్మాకి మీరు వెళ్ళిపో తారు కదా"

"అంతలోపే వాడికి గౌసియాను తీసుకెళ్ళే ఆలోచనవుంటే? "

"ఆ! అదీ ఆలోచించాల్సిన విషయమే"

"అందుకే ఆపా! తొందరగా వెళ్ళి గౌసి యాతో మాట్లాడు"

"సాయంకాలం వరకు నీకు ఏవిషయం చెప్పేస్తాను. తొందర పడవద్దు"

"సరే" అన్నట్లుగా తలపంకించాడు భవా నీశంకర్. అయినప్పటికీ అతడికి మనసులో మనసులేదు. తనకు మంత్రాలు, మాయలు, వచ్చివుండివుంటే అదృశ్యంగా వెళ్ళి గౌసి యాతో మాట్లాడేవాడ్ని కదా అనిపిస్తుంది. అంతేకాదు, తక్షణమే గౌసియాను తీసు కుని ఎటైనా పారిపోవాలనిపిస్తోంది. ఆమెను తన ఒడిలో దాచుకుని ప్రపంచాన్ని మరిచి జీవించాలనిపిస్తోంది.

అందుకే పర్వీనా వాళ్ళ ఇంటినుండి తన ఇంటికి వచ్చేసాక, కనీసం ఇంట్లోకి కూడా వెళ్ళకుండా ఇంటిముందు అరుగుమీద కూర్చున్నాడు.

లోపలి ఇంట్లో తల్లి లక్ష్మీదేవమ్మ జొన్నలు జల్లెడ తిప్పుతోంది. కొడుకురాకను ఆమె గ్రహించలేదు.

అలాగే ఒక అర్ధగంట కూర్చున్నాడు భవానీశంకర్. అంతసేపటివరకు గౌసియా వాళ్ళ ఇంట్లోంచి ఎవ్వరూ బయటకి రాలేదు. పరదా చాటునుండి అస్పష్టంగా ఆమె చెల్లెళ్ళు అటూ ఇటూ తిరుగాడుతూ కనబడుతున్నారు. కనీసం తన గౌసియా అలాగైనా కనబడుతుందేమోనని ఆత్రంగా చూస్తున్న భవానీశంకర్‌కి, మరో అర్ధగంట తర్వాత కూడా నిరాశే ఎదురయ్యింది.

అప్పటికి ఎండకూడా బాగా ఆరంభమ య్యింది. అందుకే ఇక నెమ్మదిగా లేచి ఇంట్లోకి నడవబోయాడు భవానీశంకర్.

కాసింత దూరంగా ముదురురంగు బుర ఖాధరించి వస్తూ కనబడింది పర్వీనా.

"ఇంతగా మాకు సహాయం చేస్తున్నం దుకు, నీకు చేతులెత్తి దణ్ణం పెడతాం ఆపా" ఆమెనే చూస్తూ మనసులో అనుకు న్నాడు అతడు.

అతడెవరో తనకు పరిచయం లేనట్లుగానే, తన దారిన తను వచ్చి గౌసియా వాళ్ళ ఇంట్లోకి వెళ్ళింది పర్వీనా.

తృప్తిగా ఇంట్లోకి నడిచాడు భవానీశం కర్.

"ఏరా ఇంతసేపు ఎక్కడికి వెళ్ళావు? " కొడుకును చూడగానే అడిగింది లక్ష్మీదే వమ్మ.

"టైమ్‌పాస్‌గా వుంటుందని అలా బజా రుకి వెళ్ళొచ్చా. ఇంతకూ నాస్తాకు ఏం వండావు? " వెళ్ళి గిన్నెలు తెరిచిచూస్తూ అడిగాడు.

"గోధుమ పులకాలు చేసాను" చెప్పిం దామె.

"కూర? "

"ఏమీలేదు. మిరప్పొడిలో నూనె కలు పుకో"

"ప్చ్" విసుగ్గా పెదవులు చిట్లించాడు అతడు.

"ఇట్లాంటివాడివి సంపాయించి పైసలు తీసుకురావాలి. అప్పుడు కమ్మగా కావాల్సిన వన్నీ వండిపెడతాను" కొడుకు విసుగును గ్రహించి విసురుగా అంది లక్ష్మీదేవమ్మ.

ముందే గౌసియా గురించిన తొందర అతడ్ని పీడిస్తోంది. పైగా ఇంట్లో కూర లేదు. దానికి తోడుగా తల్లి విసుర్లు. కోపం వచ్చింది అతడికి. అందుకే చేతిలోకి తీసు కున్న కంచాన్ని అక్కడే గూట్లోకి విసిరేస్తూ బయటకి నడిచాడు.

"మూతిమీద మీసం మొలవగానే మొన గాడివైపోయావు" వెళ్తున్న కొడుకును చూస్తూ అంది లక్ష్మీదేవమ్మ.

అతడు మారుమాట్లాడలేదు. వెళ్ళి అరు గుమీద కూర్చున్నాడు. ఎండ తీవ్రంగా

వున్నందున వీపు చుర్రుమంటోంది. అయిన ప్పటికీ ఖాతరు చేయకుండా గౌసియావాళ్ళ ఇంటివైపు చూస్తూ కూర్చున్నాడు.

అర్ధగంట తర్వాత బయటకి వచ్చిన పర్వీనా, ఈమారు కూడా భవానీశంకర్‌ని చూసీ చూడనట్లుగానే తన ఇంటివైపు నడిచివెళ్ళింది.

లేచి వెనకే నెమ్మదిగా వెళ్ళబోయాడు భవానీశంకర్.

"రేయ్... శంకరూ" అంతలోనే లోపల్నుంచి తల్లి పిలుపు.

"ఆ!" పలికాడు భవానీశంకర్.

"ఎండలో ఎందుకు కూర్చున్నావు? వచ్చి పులకాలు తిందువుగానీ రా" పిల్చింది.

"నాకేంవద్దు" రోషంగా అన్నాడు.

"చింతకాయ చట్నీ నూరి, తాలింపు పెట్టిస్తానుగానీ రారా" ప్రేమగా పిలిచింది.

"ఇప్పుడే వస్తాను" అంటూ ఆకలికూడా మరిచి పర్వీనావాళ్ళ ఇంటికి వెళ్ళాడు భవానీశంకర్.

"వాళ్ళు చెప్పలేదుగానీ, ఈరోజో రేపో ఆ పిల్లకు నిఖా జరగబోతున్నట్టు నాకు అనుమానం వచ్చింది" వెళ్ళగానే చెప్పింది పర్వీనా.

"ఆ...ఆ..." భయంగా చూశాడు భవానీశంకర్.

"మా ఆయన ద్వారా వాళ్ళకీ నాకూ మంచి పరిచయం వుంది కదా! ఆ పరిచయం నుండే గౌసియాను నావెంట బయటకు పంపించారు. గౌసియాను తీసుకుని బయటకి వెళ్ళాక, ఆ పిల్ల నీకోసం రావడం... నేను మా బంధువుల ఇంటికి వెళ్ళడం... ఆ సాయంకాలానికి తిరిగి ఇద్దరం కలిసి బయలుదేరి రావడం... అంతా ఎలాంటి అనుమానం రాకుండా జరిగిపోయింది.

"కాని ఇప్పుడెందుకో వాళ్ళెవ్వరూ నాతో సరిగ్గా మాట్లాడలేదు. ఆ పిల్లలు మంచి వాళ్ళే. అయితే మాట్లాడవద్దని తల్లిదండ్రులు చెప్పివుంటారు. అందుకే నేను వెళ్తే కనీసం బయటకి కూడా రాలేదు గౌసియా.

"అయినప్పటికీ గౌసియా గురించి అడిగాను. అడగడం ఏదో పెద్ద తప్పయినట్టు "మా పిల్ల గురించి ఇంక అడగవద్దు. దాన్ని ఇంకెక్కడికీ తీసుకువెళ్ళవద్దు" అని ముఖం మైనే చెప్పేసింది వాళ్ళ అమ్మ. అయినా కూడా "ఎందుకు?" అని అడిగాను. హమ్మో! ఇందుకు ఆ ఖతీజాబీ ఏమందో తెల్సా?

"మా పిల్లకు శని చీడ వుందంట. కాబట్టి ఎవ్వరితో మాట్లాడించొద్దు, బయటకి పంపించొద్దు... అని ముస్నీపు చెప్పిండు" అని నమ్మకంగా చెప్తోంది. నాకు అన్నీ తెల్సుకాబట్టి, నేను ఇంకేం మాట్లాడకుండా వచ్చేశాను" చెప్పుకుపోయింది పర్వీనా.

"అయ్యో ఆపా... ఇప్పుడెలా?" ముచ్చెమటలు పట్టేసాయి భవానీశంకర్‌కి.

"అదే ఆలోచిస్తున్నాను" అంది పర్వీనా.

"ప్చ్ మొన్న ఆదివారమే అట్నుంచి అటే ఎక్కడికైనా వెళ్ళిపోయి వుంటే బాగుండేది" చేజారిన అవకాశానికై బాధపడ్డాడు భవానీశంకర్.

"మీరు అలా వెళ్ళి వుంటే నేను చిక్కుల్లో పడిపోయేదాన్ని. అయినా 'మధ్యలోనే నాకళ్ళుగప్పి వెళ్ళిపోయిందనో, ఇంటికి వెళ్తున్నానని చెప్పి మధ్యలోనే తిరిగివచ్చిందనో' ఏదో ఒకటి చెప్పుకునేదాన్ని. అయినా ఈ జుమ్మా రోజు మిమ్మల్ని చాలా జాగ్రత్తగా పంపించివేయాలి అనుకున్నాను. ఎలా అంటే... ఆ పిల్లకోసం నేను వెళ్ళడంకాకుండా, ఆ పిల్లనే మా ఇంటికి రప్పించి పంపించాలి అనుకున్నాను. ఇలాంటపుడు 'ఆ పిల్లను నేను తీసుకువెళ్ళాను' అన్న బాధ్యత వుండదు. ఆ పిల్లే మా ఇంటికి వస్తానని చెప్పిపోయి వెళ్ళిపోయినట్లుగా వుంటుంది! ప్చ్... కాని ఏం చేస్తాం? ఆలోచన ఆచరణలోకి రాకముందే పరిస్థితులు ఇలా తయారయ్యాయి" నిట్టూర్చింది పర్వీనా.

"దేవుడా" తల పట్టుకున్నాడు భవానీశంకర్.

"ఒక పని చేస్తావా? " అంది పర్వీనా.

ఏంటన్నట్లుగా ఆత్రంగా తల ఎత్తిచూసాడు అతడు.

"పోలీస్ స్టేషన్‌కి వెళ్ళి గౌసియా పెళ్ళి గురించి ఫిర్యాదు చేయి. నీ పేరు బయట పెట్టవద్దని పోలీసువాళ్ళకు ముందే చెప్పు. వాళ్ళు ఇక సాయిబు ఇంటిమీద ఓ కన్నేసి వుంచుతారు. అప్పుడు గౌసియా క్షేమంగా వుండగలుగుతుంది. ఎప్పటికైనా నీకోసం రాగలుగుతుంది" సూచించింది పర్వీనా.

"పోలీసువాళ్ల' దగ్గరకి వెళ్ళాలంటే నాకు భయం ఆపా" భయపడ్డాడు అతడు.

"ధైర్యం తెచ్చుకోవాలి" అంది పర్వీనా.

"మీరే ఫిర్యాదు చేయండి" అన్నాడు.

"హమ్మో!" గుండెలపై చేయివేసుకుని, "నీకు వేరే ఎలాంటి సహాయం చేయమన్నా చేస్తాను కాని, ఇట్లాంటి సహాయం మాత్రం చేయలేను. అయినా నీకు తెలియంది ఏముంది? మీ ప్రేమగురించి నాకూ, సిరాజ్‌కి మాత్రమే తెలుసు. ఆయనకు తెలియకుండా మేము ఇద్దరం నీకు సహాయం చేస్తున్నాం. ఇట్లాంటపుడు నేను గాని, సిరాజ్‌గాని పోలీస్ స్టేషన్‌కి వెళ్తే ఇంకేమైనా వుందా?

"ఒకవేళ ధైర్యంచేసి సిరాజ్ వెళ్ళినా, అది ఒకవేళ బయటపడ్తే వాడి పరిస్థితి ఏంకావాలి? చదువుకోరా అని అక్క ఇంట్లో పెడ్తే నువ్వు ఇట్లాంటి రాచకార్యాలు నిర్వహిస్తున్నావా అని వాడ్ని మా అమ్మావాళ్ళు తన్ని ఊరికి తీసుకెళ్లిపోతారు. ఇక నాకు ఆయన నుండి తలాఖ్ తప్పదు. అందుకే నేను నీకు ధైర్యాన్ని మాత్రం అందిస్తున్నాను. వెళ్ళి పోలీస్‌స్టేషన్‌లో ఫిర్యాదు చేయి. అంతకన్నా గత్యంతరంలేదు" చెప్పింది పర్వీనా.

కాసేపు మౌనంగా వుండిపోయి, ఆ తర్వాత నెమ్మదిగా పెదవులు విప్పాడు భవానీశంకర్.

"ఆపా! పోలీస్ స్టేషన్‌కి వెళ్ళాలంటే మీదొక భయం. నాదొక భయం! గౌసియా గురించి నేను ఫిర్యాదుచేసాను అన్న విషయం ఒకవేళ బయటపడ్తే హిందూ, ముస్లీం గొడవలు తప్పవు. అప్పుడు మా ఇద్దరికోసం మరెందరో చావాల్సి వుంటుంది"

"ఇదీ నిజమే. ఇలాగని వెనకడుగువేస్తే నీవు గౌసియాను మర్చిపోవాల్సి వుంటుంది" అంది పర్వీనా.

"నేను గౌసియాను మర్చిపోలేను. అస్సలు ఆమె లేకుండా బతకలేను" అంటుంటేనే భవానీశంకర్ గొంతు గద్గదమయ్యింది.

"నేను మీ హిందువుల్లో వుంటే ధైర్యంగా ఇప్పుడు పోలీస్‌స్టేషన్‌కి వెళ్ళేదాన్ని. కాని మా మిల్లత్ (ముస్లీం సమాజం)లో స్త్రీలు అట్లాంటి ప్రదేశాలకి వెళ్ళడం అంటే, అది అనంగీకార విషయం!

"మా సమాజం స్త్రీలను మసీదుకే వెళ్ళనివ్వదు. అట్లాంటిది పోలీస్‌స్టేషన్‌కి వెళ్ళడమా? అందునా సంబంధంలేని విషయంలో జోక్యం చేసుకోవడం. పైగా తోటి ముసల్‌మాన్ విషయంలో!?

"ఇంతకంటే చెప్పలేను. నన్ను అర్థం చేసుకో శంకర్!" అంది పర్వీనా.

భవానీశంకర్‌కు తను ఒంటరివాడైపోయిన భావన కలిగింది.

భారంగా పర్వీనా వైపుచూస్తూ, "నీవు చెప్పినట్లుగానే చేస్తాను ఆపా" అంటూనే లేచి నిల్చున్నాడు.

"నీలో భయంగాని, బాధగానీ వుండకూడదు" తను కూడా లేచి నిల్చుంది పర్వీనా.

"సరే ఆపా" అంటూ బయటకి నడిచాడు అతడు.

ఆమె లోపలికి వెళ్ళిపోయింది.

ఇంటికి వచ్చాక గౌసియావాళ్ళ ఇంటివైపు చూస్తుంటే బాధకి తోడుగా ఆవేశం పుట్టుకొచ్చింది అతడికి. నేరుగా వాళ్ళ ఇంట్లోకి

చొచ్చుకుపోయి, అందర్నీ చెడమడా తిట్టీ కొట్టీ, గౌసియాను తెచ్చుకోవాలన్పించింది.

ఊహల్ని, కలల్ని అనుకున్న తక్షణమే నిజం చేసుకోడానికి అల్లావుద్దీన్ అద్భుత దీపం అక్కడలేదు కాబట్టి, అసహాయంగా ఇంట్లోకి నడిచాడు.

అప్పటికి చింతకాయ చెట్నీ తయారుగా పెట్టివుంచింది తల్లి లక్ష్మీదేవమ్మ. పులకాలు తిన్నాడు అతడు.

"ఏంట్రా అదోలా వున్నావు?" అడిగింది లక్ష్మీదేవమ్మ.

"ఏంలేదు" అన్నాడు శంకర్.

"సరేగాని, నేను గిర్నీకి వెళ్ళొస్తాను. ఇల్లు జాగ్రత్త" చెప్పి జొన్నల డబ్బాని నడుముకి ఎత్తుకుని బయటకి నడిచింది లక్ష్మీదేవమ్మ.

"పోలీస్‌స్టేషన్‌కి ధైర్యం చేసుకుని ఎలా వెళ్ళాలి?" ఆలోచిస్తూ ఇంట్లోనే అటూ ఇటూ తిరగసాగాడు భవానీశంకర్.

కాసేపటి తర్వాత అతడి మిత్రుడు గోపాల్ వచ్చాడు. మిత్రుడ్ని చూడగానే తనకేదో అండ దొరికినట్లుగా తోచింది అతడికి. వెంటనే సమస్య గురించి మిత్రుడితో చెప్పుకున్నాడు.

"నేను నీకు మొదట్నుండీ చెప్తూనే వున్నాను. ఆ ముస్లీం పిల్లతో ప్రేమాదోమా అనీ తిరగవద్దురా అని! ఇప్పుడు చూడూ... ఎంత పెద్ద సమస్య ఎదురయ్యిందో?" అంతా విన్నాక అన్నాడు గోపాల్.

"మొత్తానికి ఏం చేద్దామంటావురా?"

"నీకు ఆ సిరాజ్ తప్ప, మన ఫ్రెండ్స్ ఎవ్వరూ సహాయం చేయరు. ఇప్పుడా సిరాజ్ కూడా సహాయం చేయడు అంటున్నావు. కాబట్టి ఆ పిల్లను మర్చిపో"

"అదేంట్రా?"

"లేకపోతే ఏంట్రా? ప్రేమించడానికి నీకు ఆ పిల్లే దొరికిందా? మేము వద్దన్న పనిచేశావు కాబట్టి, నీకు మంచి శాస్తి జరిగింది. జరిగిందేదో జరిగిపోయిందిగాని మనం కృష్ణానగర్ వెళ్దాంరారా. మనిద్దరమే కాదు మన ఫ్రెండ్స్ అందరూ వస్తున్నారు" అన్నాడు గోపాల్.

"కృష్ణానగర్ ఎందుకు?" అడిగాడు భవానీశంకర్.

"రజనీకాంత్ షూటింగ్ జరుగుతుందంట. మన అభిమాన హీరోని చూడబోతున్నాం. లక్ అంటే మనదే" సంబర పడిపోయాడు గోపాల్.

"నేను రాలేను" అన్నాడు భవానీశంకర్.

"రారా" గట్టిగా పిలిచాడు గోపాల్

"నన్ను అర్థం చేసుకో"

"అర్థం చేసుకున్నాను, అందుకే రమ్మంటున్నాను"

అర్థం కానట్లుగా చూశాడు భవానీశంకర్.

"ఎంతయినా స్నేహితుడివి కాబట్టి, వద్దన్న పని చేసినా సహాయం చేయక తప్పదు. పోతే రెండ్రోజులు ఆగాలి. ఎందుకంటే మా పోలీస్ మామ ఎల్లుండి వరంగల్ నుండి వస్తున్నాడు. మా మామకి ధైర్యం బాగా ఎక్కువ. నక్సలైట్ ఏరియాలో వున్నాడు కాబట్టి ధైర్యాన్ని కూడగట్టుకుని కూడగట్టుకుని కరడుగట్టిన సింహంలా మారిపోయాడు. ఎవ్వరికీ భయపడడు. ఆయనతో నీ సమస్య చెప్పుకుంటే తప్పకుండా నీకు మేలు జరుగుతుంది" చెప్పాడు గోపాల్.

"అంతలోపే..." భవానీశంకర్ మాట్లాడబోయాడు.

"ఇంకేం మాట్లాడవద్దురా! నువ్వు ఆగాల్సింది రెండు నెలలు కాదు రెండ్రోజులు. ఆ రెండ్రోజుల్లో కొంపలేం అంటుకుపోవుగాని, మా వెంట కృష్ణానగర్ వచ్చేసేయ్"

అయిష్టంగా నిలబడిపోయాడు భవానీశంకర్.

"నువ్వు రాకపోతే నేను సహాయం చేయను" అన్నాడు గోపాల్.

"వస్తాలేరా" అన్నాడు భవానీశంకర్. అన్నాడేగాని వెళ్లడం అతడికి ఏమాత్రం ఇష్టంలేదు.

గిర్నీ నుండి తల్లివచ్చాక చెప్పేసి గోపాల్ వెంట బయలుదేరి కృష్ణానగర్ వెళ్లాడు భవానీశంకర్. షిరాజ్ తప్ప మిగతా ఫ్రెండ్స్ అంతా వచ్చారు. షిరాజ్ కూడా వచ్చేవాడే కానీ తమ అమ్మానాన్నలు వచ్చినందుకు రాలేదు. అందుకే అమ్మకూచిగాడు అంటూ అందరూ వెక్కిరించి నవ్వారు.

భవానీశంకర్ మాత్రం స్తబ్దుగా వుండిపోయాడు. అభిమాన నటుడ్ని చూస్తూనే అభిమాన బాంధవి గురించి ఆలోచిస్తున్నాడు. కాబట్టే స్నేహితులతో కలిసి ఎప్పట్లా ఆనందాన్ని పంచుకోలేకపోతున్నాడు.

చూస్తుండగానే చీకటయింది. ఇంటికి రావాలనుకున్నాడు భవానీశంకర్. కానీ ఫ్రెండ్స్ అంతా అక్కడే వుండిపోతూ అతడ్ని కూడా కదలనివ్వలేదు.

## బుధవారం

వేకువజామున ఐదుగంటలు కావొస్తోంది.

దూరంగా వున్న కేశవస్వామి గుడిలోంచి వెంకటేశ్వర సుప్రభాతం సుమధురంగా వినబడుతోంది.

పబ్లిక్‌పార్క్‌లో పచ్చిక తివాసీమీద పడుకుని వున్న భవానీశంకర్ ఆవులిస్తూ నిద్రలేచి కూర్చున్నాడు. మిత్రులు ఇంకా నిద్రలేవలేదు.

"లేవండ్రా" ఒళ్ళు విరుస్తూలేచి నిల్చున్నాడు భవానీశంకర్.

ఒక్కడూ పలకలేదు.

"మొద్దునాకొడుకులు" అనుకుంటూ ఫౌంటేన్ దగ్గరకి వెళ్ళి ముఖం కడుక్కుని వచ్చి, ఎక్సర్‌సైజ్ మొదలెట్టాడు.

పార్క్ పక్కగా వున్న రోడ్డువెంబడి కొంతమంది రన్నింగ్‌చేస్తూ వెళ్తున్నారు. మరికొంతమంది వాకింగ్ చేస్తున్నారు.

"వున్న మహారాజులు కాసేపు వ్యాయామం చేస్తారు. ఆ తర్వాత కార్లల్లో వెళ్ళిపోతారు. వాళ్ళనే చూస్తూ మనసులో అనుకుని, ఆ తర్వాత చుట్టూ వున్న బంగళాలవైపు చూస్తూ భుజాలు ష్రగ్ చేస్కున్నాడు.

పదిహేను నిముషాల్లో వ్యాయామం పూర్తిచేసి మిత్రులవైపు చూశాడు భవానీశంకర్. వాళ్ళు ఇంకా నిద్రలేచినట్టు లేరు.

"రేయ్! లేవండ్రా! బిచ్చగాళ్ళమైపోయాం..." అంటూ మిత్రులవైపు నడిచాడు అతడు.

మిత్రుల్లో చలనం లేదు.

"ప్చ్! ఈ బంగళా మనుషులం కాకపోయినా ఈ పార్క్ మనుషులం మాత్రం కాదురా మనం! లేవండి... ఇంక వెళ్ళిపోదాం" అన్నాడు.

షరామామూలే ఒక్కడూ కదల్లేదు.

"మీ సినిమా పిచ్చి పాడుగానూ, నన్ను చంపుతున్నారేంట్రా?" విసుగ్గా అన్నాడు.

"హే... ఏంట్రా?"

"నీదో జోరీగ రొద అయ్యింది ఏంట్రా?"

"నీకంటే ఆ బాలస్వామి... సాయిబులు నయ్యం"

"వీడి దవడ పగలగొట్టండి"

మిత్రులు ఒకరితర్వాత ఒకరు విరుచుకుపడ్డారు. భవానీశంకర్‌కు చిర్రెత్తుకొచ్చింది.

"నిద్రను జయించండిరా! జీవితాన్నే జయిస్తారు" అన్నాడు.

"ఆ! ముందు నీ ప్రేమను మా ప్రమేయంలేకుండా జయించు" నిద్రమబ్బుతో అన్నాడు ఒక మిత్రుడు.

"ఎవడ్రా?" మిత్రులవైపు చూసాడు భవానీశంకర్.

అందుకు ఎవ్వరూ సమాధానం ఇవ్వలేదు. తమలోతామే గుణుక్కుంటూ అలాగే పడుకుండిపోయారు.

చేసేదిలేక భవానీశంకర్ మిత్రుల మధ్యగా కూర్చుని, పాలుపోక అటూఇటూ చూడసాగాడు.

తమకు కాసింత దూరంలో బిచ్చగాళ్ళు

ఐదారుగురు పడుకుని వున్నారు. ఎడంగా చూస్తే ఓ పిచ్చోడు నిద్రపోతూ నిద్రలోనే ఏదో గుణుక్కుంటున్నాడు.

"అయ్ బాబోయ్" అనుకుంటూ వెనక్కి చూస్తే, కాసింత దూరంలో ఒక బిచ్చెగత్తె నగ్నంగా పడుకుని వుంది.

"అబ్బా! ఈ సన్యాసి వెధవలు బతుకును ఫుట్‌పాత్ చేసేశారు" అనుకుంటూ తలపట్టుకున్నాడు భవానీశంకర్.

అలా ఎంతసేపు కూర్చున్నాడో తెలీదు కాని, మిత్రులు నిద్రలేచేసరికి భళ్ళున తెల్లారిపోయింది.

సూర్యుడి లేతకిరణాల జోరు నగరజీవనాన్ని ఎప్పట్లా ఉరుకుల పరుగులకి ఉసిగొల్పింది. ఫలితంగా అప్పటికే రోడ్డువెంబడి వాహనాలు క్రమంగా పరుగెట్టడం మొదలెట్టాయి.

పదిహేను నిముషాల తర్వాత మిత్రులతో కలిసి పార్కునుండి బయటపడ్డాడు భవానీశంకర్. అందరూ షూటింగ్ గురించిన ముచ్చట్లలో మునిగి తేలసాగారు.

"బిచ్చగాళ్ళలా పబ్లిక్‌పార్క్‌లో ఇంతసేపు పడుకోడానికి మీకు సిగ్గులేదట్రా?" మధ్యలో కల్పించుకున్నాడు భవానీశంకర్.

"వున్నట్టుండి వీడికి ఉన్మాదమా?" అని ఒక మిత్రుడు అనగానే "పబ్లిక్‌పార్క్‌ల్ని తక్కువగా అంచనావేయొద్దు. నేటి పబ్లిక్ పార్కు పర్సనే రేపటి పబ్లిక్ పర్సన్ కావొచ్చు" మరో మిత్రుడి గొంతులో వ్యంగ్యం.

"ఏదోగాని, త్వరగా ఇంటికి వెళ్దాం" అన్నాడు భవానీశంకర్.

"పోరా" చేయి విదిల్చారు మిత్రులు.

మనసంతా గౌసియావైపుగా వుండి, ఎద లోతుల్లో ఏ కలవరాన్నో సృష్టిస్తున్న శతకోటి భావనలు అతడికి కోపం తెప్పించాయి.

"మీరు రాకపోయినా నేను వెళ్తాను" మొండిగా అన్నాడు.

మిత్రులంతా అతడ్ని పిచ్చివాడిలా చూశారు.

"గౌసియా కోసం" కోపాన్ని చల్లార్చుకుని శాంతంగా అన్నాడు.

"ఈ ప్రపంచం మొత్తంలో గౌసియా, నువ్వూ, ఇద్దరే ప్రేమికులు వున్నట్టున్నారు"

"తనకు గాళ్‌ఫ్రెండ్ వుందని ఆ బిల్డప్! కదట్రా?"

"నీ గౌసియా ఎక్కడికీ వెళ్ళదుగాని, కూచి మాటలు మాని కాస్త ఓపికపట్టు"

తన మిత్రులు ఎవ్వడు ఏమాట మాట్లాడాడో కూడా పట్టించుకోలేదు భవానీశంకర్.

"నా బాధ మీకు తెలీదురా" అని మాత్రం అనగలిగాడు.

"సర్లేగాని కాసేపు బాధ మరిచిపో" అంటూ భవానీశంకర్ భుజంపై చేయివేసాడు ఒకడు.

"ప్చ్..." పెదవులు చిట్లించాడు భవానీశంకర్.

"నాస్తాచేసి పోదాం లేరా" ఇంకో మిత్రుడు అన్నాడు.

"టీ తాగి వెళ్ళిపోదాం" అన్నాడు భవానీశంకర్.

"నువ్వు ఇట్లా మాట్లాడితే మధ్యాహ్నం లంచ్‌చేసి వెళ్ళాల్సివుంటుంది" ఇంకో మిత్రుడు భయపెట్టాడు.

"రండిరా" భవానీశంకర్ గొంతులో అభ్యర్థన.

"వెళ్దాంగాని, గౌసియా గురించి ఆశువుగా ఒక కవిత చెప్పరా?" మరోమిత్రుడు అడిగాడు.

"నేను సి.నా.రే కాదు" అన్నాడు భవానీశంకర్.

"కవిత్వం చెప్పడానికి సి.నా.రే మాత్రమే కావాలా? నేనూ చెప్పగలను" అన్నాడు వనస్థలిపురంనుండి వచ్చి షూటింగ్ దగ్గర కల్సిన ఓ మిత్రుడు జోసెఫ్.

"ఏదీ చెప్పరా?" అన్నాడు భవానీశంకర్.

"చెట్టుకు పువ్వులు అందం...

మనిషికి మాటలు అందం...

తారలకు మేకప్పు అందం" జోసెఫ్ చెప్పుకుపోతుంటేనే

"వొద్దురా" భవానీశంకర్‌తోపాటుగా అందరూ చెవులు మూసుకున్నారు.

"ఏంట్రా? " చిన్నబుచ్చుకున్నాడు జోసెఫ్.

ముందే నాకు పిచ్చిగా వుంది. ఈ పిచ్చి కవిత్వాలు చెప్పి నా మతి మరింత చెడగొట్టొద్దు" అన్నాడు భవానీశంకర్.

"చూస్తూ వుండండ్రా... నేను ఈ కవితను ఏ పత్రికకో పంపిస్తాను. అది అచ్చు కాకపోతే నా పేరు జోసెఫ్ కాదు" అన్నాడు జోసెఫ్.

అందరూ కిసుక్కున నవ్వారు. జోసెఫ్ రుసరుసగా చూశాడు.

అదే సమయంలో సమీపంగా కూర్చుని వున్న ఓ బిచ్చగాడు మిత్రబృందాన్ని చూస్తూ పాటందుకున్నాడు.

"నరుడా... ఓ మానవుడా..."

రాగయుక్తంగా పాడుతూ డొక్కుడబ్బాను ఆడిస్తున్నాడు అతడు.

"వాడు అన్‌ఎడ్యుకేటెడ్ అయినప్పటికీ ఎంత బాగా పాడుతున్నాడు చూడూ? పదాల్ని కూడా బాగా ఉచ్చరిస్తున్నాడు? " బిచ్చగాడ్ని చూస్తూ మెచ్చుకోలుగా అన్నాడు జోసెఫ్.

"ఏం బాబూ..." మాట్లాడేది తన గురించే అని అర్థంకాగానే చప్పున వాళ్ళకు సమీపంగా వచ్చాడు బిచ్చగాడు.

"మా దగ్గర డబ్బుల్లేవు. వుంటే ఇచ్చి వెళ్ళు... నీ పేరు చెప్పుకుని టీ తాగుతాం" చమత్కరించాడు ఒక మిత్రుడు.

"ఊరుకోరా" అంటూ వాడ్ని వారించి "ఏ వూరు మనది? " బిచ్చగాడ్ని అడిగాడు జోసెఫ్.

"కోటప్పకొండ బాబూ" చెప్పాడు బిచ్చగాడు.

"అక్కడ భిక్షం దొరకడం కష్టమైందా? " అడిగాడు జోసెఫ్.

బిచ్చగాడు ఏమనుకున్నాడో ఏమో... జోసెఫ్‌వైపు ఐదారు క్షణాలు అర్థంకానట్టుగా చూసి ఆ తర్వాత, "జాతకాలు సెప్పుకోడానికి వొచ్చాను బాబూ! నా జాతకం నూటికి నూరుపాల్లు కరెకుటు..." అన్నాడు బిచ్చగాడు.

"నీ జాతకం కరెకుటా? నీవు సెప్పే జాతకం కరెకుటా? " అతడ్ని తమాషాగా అనుసరించాడు జోసెఫ్.

"నేను సెప్పే జాతకం" అన్నాడు బిచ్చగాడు.

"అట్లాగా! అయితే ఒకసారి మావాడి జాతకం చెప్పు" అంటూ భవానీశంకర్‌ని చూపించాడు జోసెఫ్.

"రూపాయిబిల్ల ఏస్కోవాలి" అన్నాడు బిచ్చగాడు.

"ముందు నీవు జాతకం చెప్పు? " అన్నాడు జోసెఫ్.

"మాద్యావర ఒప్పుకోదు" అన్నాడు బిచ్చగాడు.

"అట్లాగా? ఆహా!" అంటూ రాగం తీసి, "సర్లే... ఇదిగో రూపాయి" అంటూ తన జేబులోంచి రూపాయిబిళ్ళ తీసి బిచ్చగాడికి ఇచ్చాడు జోసెఫ్.

"తమరి పేరేందన్నావు? " రూపాయి బిళ్లను కళ్ళకు అద్దుకుంటూ భవానీశంకర్‌ను అడిగాడు బిచ్చగాడు.

"ఇంకా అనలేదు. వాడి పేరు భవానీశంకర్" చెప్పాడు జోసెఫ్.

"తమరికి పెండ్లి అయ్యిందా? " అడిగాడు బిచ్చగాడు.

"అయ్యింది. నలుగురు పిల్లలు కూడా" జోసెఫ్ సమాధానం చెప్పాడు.

మిత్రులంతా తమలోతామే నవ్వుకుంటూ ఆసక్తిగా చూస్తున్నారు. భవానీశంకర్ మాత్రం నిశ్శబ్దంగా బిచ్చగాడినే చూస్తున్నాడు.

బిచ్చగాడు కాసేపు కళ్ళుమూసుకుని, ఆ తర్వాత ఆకాశంకేసి చూసి, "బాబూ! నీకు

శానా కట్టాలు వున్నాయి. వాటిని నీవు పడగొట్టాలంటే ఒక్కటే మార్గం!

నేను సిరిసైలం కొండల్ల తెచ్చిన ఒక సెక్క ఇస్తాను. దాన్ని నీ మొలతాడుకు కట్టుకో! అంతే నీ కట్టాలు పిట్టలు ఎగిరిపోయినట్లుగా ఎగిరిపోతాయి. ఈ సెక్కకు యాభై రూపాయలు మాత్రమే ఇచ్చుకో... అదే వేరే వాళ్ళకు అయితే నూర్రూపాయలు"

"అట్లాగా! పూర్వజన్మంలో మేము మీకు బంధువులం అయ్యివుంటాం" వెటకారంగా అన్నాడు జోసెఫ్.

"గట్లని గాదు బాబూ! మీరు పిల్లల లెక్కన వుండరు అందుకే" అన్నాడు బిచ్చగాడు.

"ఆ... నీ పాటను మెచ్చుకోవడం మేము ఇప్పుడు చేసిన పొరపాటు కావొచ్చు" ఆ వెంటనే అన్నాడు జోసెఫ్.

బిచ్చగాడు బేలగా చూశాడు జోసెఫ్‌వైపు.

"ముట్టుకుంటే అంటుకొచ్చావ్! ఆ... చెప్పు చెప్పు? " అన్నాడు జోసెఫ్.

"చూడు బాబూ! మేము పొట్టసేతిలో పట్టుకుని వచ్చినోల్లం. మాతో తమరు ఇట్ల మాట్టాడం మంచిదికాదు" అన్నాడు బిచ్చగాడు.

"ఓకే!" అన్నాడు జోసెఫ్.

"అంటే? " అర్థంకాలేదు బిచ్చగాడికి.

"ఓకే అంటే తప్పయ్యింది నన్ను క్షమించు అని అర్థం"

"అయ్యో! అంతమాట ఎందుకు బాబూ!" అంటూ ఇంకొంచెముందుకు జరిగి "సెక్క గావాల్నా బాబూ? ఆ సెక్క ఒక్కటి తీసుకుంటే సాలు. మల్ల తమరు జాతకం సెప్పించుకోనవసరంలేదు. ఆ మరుసటి దినం నుండే మీ జాతకం బ్రెమ్మాండంగా మారిపోతుంది" అన్నాడు బిచ్చగాడు.

"తప్పకుండా చెక్క కొనుక్కుంటాం" అన్నాడు జోసెఫ్.

ఆశగా వెంటనే తన జోలెలోంచి చెక్క తీయబోయాడు బిచ్చగాడు.

"ఇప్పుడు వద్దు రేపు తీసుకుంటాం. రేపు ఇదే సమయానికి మమ్మల్ని ఇక్కడే కలువు" అన్నాడు జోసెఫ్.

"సర్లే మీ ఇట్టం" అంటూ అక్కడ్నుంచి లేచి వెళ్ళాడు బిచ్చగాడు.

"బతకనేర్చిన వాడికి మాటలు తక్కువ కాదు!" వెళ్ళిపోతున్న బిచ్చగాడివైపే చూస్తూ అని, "ఏదోలే పాపం!" అంతలోనే జాలికురిపించాడు జోసెఫ్.

బిచ్చగాడు పార్క్ దాటుకుని వెళ్ళిపోసాగాడు. ఇంకా అతడ్నే చూస్తున్న జోసెఫ్ మళ్ళీ అన్నాడు.

"బిచ్చగాళ్ళు అందరూ బికార్లు కాదురా! అప్పులు కూడా ఇస్తూ అడుక్కుతినేవాళ్ళు వుంటారు"

అవును అన్నట్టుగా చిన్నగా నవ్వారు మిత్రులు.

"ఒరే అరవిందస్వామీ! మనీషాకొయిరాల నీ స్వంతం కావాలంటే ఒక్కటే ఒక్క మార్గం" వెంటనే టాపిక్ మార్చాడు జోసెఫ్.

"ఏంట్రా? " జోసెఫ్‌కు దగ్గరగా జరిగాడు భవానీశంకర్.

"నేను చెప్పిన మార్గాన్ని నువ్వు అనుసరించాలి అంటే నీకు హీరో లెవెల్లో గట్స్ వుండాలి"

"ముందు మార్గం చెప్పరా? "

"ఒరి పిచ్చోడా! నేను చెప్పబోయేది అల్లాఉద్దీన్ ఉపాయదీపం"

"టెన్షన్ పెట్టొద్దు. వెంటనే చెప్పేసెయ్" అని భవానీశంకర్ అనగానే,

"చెప్పరా వెధవా" మిగతా ఫ్రెండ్స్ తొందరపెట్టారు.

జోసెఫ్ మిత్రులు అందరివైపూ ఒక మారు బిల్డప్ ఇస్తూ చూసి,

"మరేం లేదురా! మన అరవిందస్వామి, మనీషాకొయిరాలను పెళ్లి చేసుకుంటే అటు గొడవలు రాకూడదు, ఇటు మనస్పర్థలు

పెరగకూడదు. అందరూ ఏకాభిప్రాయంతో వుండాలంటే..." అని కాసేపాగి, "ఆ... ఏం చేయాలంటే గౌసియాను రంగరంగ వైభవంగా పెళ్లి చేసుకో! ఆ పెళ్లి ఎక్కడ జరగాలో తెల్సా? క...ల...లో" తాపీగా అన్నాడు.

మిత్రులంతా జోసెఫ్ మాటలకు హాయిగా నవ్వారు. భవానీశంకర్ మాత్రం జోసెఫ్ వైపు కొరకొరా చూశాడు.

అంతలో అటుగా ఒకావిడ వచ్చింది. ఓ చంకలో పిల్లాడ్ని ఎత్తుకుని, మరో చంకలో జోలె తగిలించుకుని, మాసిన బట్టలతో తైల సంస్కారం లేని జుట్టుతో దీనంగా వుందామె.

"జాతకం బాపతే కావొచ్చు" ఆమె రాగానే అన్నాడు జోసెఫ్.

"తమరిది ఏ ఊరు? " నమ్రతగా అడిగాడు జోసెఫ్.

"సిత్తూరు"

"పచ్చబొట్టు పొడవడంలో బాగా ప్రాక్టీస్ ఉందా? "

"బాగా పేక్టీసు వుంది. ఇది మాకు కూడు బెట్టే యిద్య గదా బాబూ! చిన్నప్పుడే ఈ యిద్య నేర్సుకున్నాను"

"అయితే నువ్వు వెంటనే అమెరికా వెళ్ళిపో"

"ఎందుకు బాబూ? "

"అక్కడివాళ్ళకు పచ్చబొట్లు పొడిపించుకోవాలంటే మహా వెర్రి! అక్కడయితే నువ్వు లక్షలకి లక్షలు సంపాయించుకోవచ్చు"

"అక్కడికి ఎళ్ళడానికి సార్జి ఎంతవుతుంది? "

ఆ మాటకు అందరికి నవ్వొచ్చింది.

"నూర్రూపాయలు" నవ్వుతూనే చెప్పాడు జోసెఫ్.

"గా నూర్రూపాయలు వుంటే మా తాగుబోతోడు వుండనివ్వడు" విచారంగా అని, "పచ్చబొట్టు తమరు పొడిపించుకోరా బాబూ? " అందర్నీ చూస్తూ అడిగింది.

"వద్దు పోమ్మా" అందరి తరుపునా తనే సమాధానం చెప్పాడు జోసెఫ్.

"అగ్గువకు కొడతాను బాబూ" ఆమె గొంతులో అభ్యర్థన.

"అగ్గువ అంటే పదిపైసలకా? "

"ఆ దుడ్లు సెల్లవుబాబూ"

"మావద్ద అంతకంటే ఎక్కువలేవు"

"వున్న మారాజులు అట్ల మాట్టాడగూడదు బాబూ"

"మరి ఎంత అడుగుతావు? "

"పేరుకు ఐద్రూపాయలు"

"రూపాయి ఇస్తాం"

"అన్నేయం బాబూ! సంటిపిల్లోడికి ఆకలైంది. రేత్రినుండి ఏం లేదు" ఆమె గొంతులోనే కాదు, ముఖంలోనూ దీనత్వం.

బిచ్చగాళ్ళ గురించి సరదాగా హాస్యం చేస్తున్నాడు కాని, ఆమె ఆ మాట మాట్లాడగానే జోసెఫ్ మనసు నిజంగానే కరిగింది. అందుకుతోడుగా ఆమె చంకలో కూర్చున్న పిల్లాడు, ఆమె కొంగు పట్టిలాగుతూ ఆమె రొమ్ముకోసం వెదుకుతున్నాడు.

"శంకర్! నువ్వు పొడిపించుకోరా" చెప్పాడు జోసెఫ్.

"నాకు భయం"

"భయం దేనికి? నీకు వున్న సీన్ మాకే వుండివుంటే ఈపాటికి పచ్చబొట్లతో నిలువునా మునిగిపోయేవాళ్ళం" జోసెఫ్ అంటుంటేనే తన ప్రాణసఖి గౌసియా పేరును తన చేతిమీద శాశ్వతంగా ముద్రించుకోవాలన్న తలంపు వచ్చింది భవానీశంకర్‌కు.

"పచ్చబొట్టు పొడిపించుకోవాలనే వుంది. కాని ఇంట్లో వాళ్ళు చూస్తే ఇంకేమైనా వుందా? " వచ్చి ఆమె ముందు కూర్చుంటూనే అన్నాడు భవానీశంకర్.

"ఆ భయం వుంది కాబట్టి సింపుల్‌గా 'జి' అని పొడిపించుకో చాలు" చెప్పాడు జోసెఫ్.

"సరే" అన్నాడు భవానీశంకర్.

మరో మిత్రుడు భవానీశంకర్ మణికట్టు మీద పెన్నుతో 'జి' అని రాసాడు.

"కాస్త మెల్లగా పొడవాలి" ఆమెకు ముందుగానే చెప్పాడు జోసెఫ్.

"అట్లాగే బాబూ" అంటూ తీరిగ్గా బాసింపట్టు వేస్కుని కూర్చుని, పిల్లాడిని తన వీపుకి తగిలించుకుని వున్న మరో జోలెలో కూర్చోబెట్టుకుని, ఇంకో జోలెలో వున్న పచ్చబొట్టు తాలూకు సామాగ్రిని వెలుపలికి తీసింది.

మొనదేలివున్న ఆ సామాగ్రిని చూడగానే భవానీశంకర్ కాళ్ళూ, చేతులు వణకనారంభించాయి. అయినప్పటికీ గౌసియా పేరును పొడిపించుకోబోతున్నాను అనే ఆనందం, తృప్తి అతడి భయాన్ని డామినేట్ చేస్తున్నాయి.

"బాబూ కళ్ళుమూసుకో" భవానీశంకర్‌కు చెప్పిందామె.

"ఓ దేవుడా! నొప్పి కాకుండా చూడు తండ్రీ!" మనసులో అనుకుంటూ గట్టిగా కళ్ళు మూసుకున్నాడు భవానీశంకర్.

ఆమె తమ కొండదేవరలకు ఒకసారి పేరుపేరున దండంపెట్టుకుని, ఆ తర్వాత నెమ్మదిగా భవానీశంకర్ చేతిమీద పచ్చబొట్టు పొడవనారంభించింది.

"అ...మ్మా..." మొదటి పొడుపుకే అతడి బాధ వర్ణనాతీతం అయిపోయింది.

అతడి బాధ తమక్కూడా బాధే అన్నట్టుగా మిత్రుల ముఖాల్లోనూ బాధావీచికలు ప్రస్ఫుటం అవ్వసాగాయి. ప్రతి పొడుపుకీ భవానీశంకర్ కుదించుకుపోతుంటే, అతడి చేయి పట్టుకుంటూ, అతడి భుజాల్ని పట్టుకుంటూ "అయిపోతుంది లేరా" అంటూ అనునయిస్తున్నారు మిత్రులు.

పచ్చబొట్టు పొడవడం పూర్తయ్యేసరికి భవానీశంకర్ చేయి రక్తసిక్తం అయిపోయింది. పొడవడం పూర్తయినప్పటికీ ఇంకా పొడుస్తున్న బాధే గుండెను పిండసాగింది.

"గాయం ఎన్నిరోజుల్లో తగ్గుతుంది" తన షర్టుజేబులోంచి ఐదురూపాయలనోటు తీసి ఆమెకు అందివ్వబోతూ అడిగాడు జోసెఫ్.

"వారం పదిరోజుల్లో మానిపోతుంది" అంటూ తనే గాయానికి కట్టుకడుతూ, ఐదు రూపాయల నోటును అందుకోబోయిందామె.

"వద్దు, నేనే ఇస్తాను" అంటూ జోసెఫ్‌ను వారించి, తన స్వంత డబ్బుల్ని ఆమెకు ఇచ్చాడు భవానీశంకర్.

"ఏం? నేనివ్వకూడదా?" అడిగాడు జోసెఫ్.

"ఇట్లాంటివాటిని స్వంత ఖర్చుతో గావించాలి" అన్నాడు భవానీశంకర్.

"సెంటిమెంటా?" అన్నాడు జోసెఫ్.

"అఫ్‌కోర్స్" అన్నట్టుగా చిన్నగా నవ్వాడు భవానీశంకర్.

అతడి మనసునిండా ఇప్పుడు ఏ ఆతృతో నిండిపోయివుంది. తన పచ్చబొట్లను గౌసియాకు చూపించాలని, అప్పుడు ఆమె కళ్ళల్లో కదలాడే అపురూప భావాల్ని మౌనంగా ఆస్వాదించాలని, ఎంతో ఆరాటంగా వుంది. అందుకే బాధలోనూ నవ్వగలుగుతున్నాడు.

"ఇంకెవరైనా పొడిపించుకుంటారా బాబూ?" అడిగిందామె.

"ఎవ్వరికీ వద్దు" చెప్పాడు జోసెఫ్.

"సల్లంగ బతకండయ్యా" అందర్నీ ఒకమారు చూసి అని, ఐదురూపాయల్ని కళ్ళకు అద్దుకుంటూ అక్కడ్నుండి లేచి వెళ్ళిపోయిందామె.

"అమరప్రేమికుడివి అయిపోయావు" భవానీశంకర్ గాయాన్ని మృదువుగా స్పృశిస్తూ అన్నాడు జోసెఫ్.

అందుకు చిన్నగా నవ్వి "పచ్చబొట్టు చెదిరిపోనట్టే మా ప్రేమ కూడా చెదరకూడదు" అన్నాడు భవానీశంకర్.

కాసేపటి తర్వాత అందరూ కలిసి సమీపంగా వున్న చాయ్ బండి దగ్గరకు వెళ్లారు. అక్కడ చాయ్ మాత్రమే కాకుండా ఇతర

వంటకాల్ని కూడా తయారుచేస్తున్నారు.

"చాయ్ బండీ చపాతీ

జర జూడరా జిలేబీ..."

అలవాటుగా ఎప్పుడూ పాడే సిరాజ్‌కు బదులుగా జోసెఫ్ అందుకున్నాడు ఆ పాటను.

పాట వింటూ అందరూ తమలో తామే నవ్వుకోసాగారు. "నవ్వారు లేరా" అంటూనే తనూ నవ్వాడు భవానీశంకర్.

"ఏందన్నా గట్ల నగుతుండరు" కాసేపు చూసి తర్వాత అడిగాడు చాయ్ బండి అమ్ముతున్న వ్యక్తి.

"ఏం లేదన్నా! మా వాడి అత్తవారికి కూడా నీలాగే చాయ్‌బండి వుంది. కట్నం అదే అనుకో! కాని మా వాడేమో అమ్ముకోడానికి నామోషీగా ఫీలౌతున్నాడు" భవానీశంకర్ భుజం చరుస్తూ చెప్పాడు జోసెఫ్.

"గట్ల అనుకుంటే ఎట్ల తమ్ముడు. కట్టపడాలా.. కట్టపడితేనే రెండు దుడ్లు ఒస్తయి" భవానీశంకర్‌వైపు చూస్తూ అన్నాడు చాయ్ బండి వ్యక్తి.

మిత్రులంతా జోసెఫ్‌కే వంతపాడారు. దీంతో అందరివైపు ఉక్రోషంగా చూస్తూ "వచ్చే నెల నుండి అమ్ముతుంటాను. తప్పేముంది?" అన్నాడు.

"గదీ మాట" అన్నాడు చాయ్ బండి వ్యక్తి.

"నోర్మూయ్యరా" మనసులో అనుకుని "ఏందిబై చాయ్ ఇట్ల జేసినవు?" అడిగాడు భవానీశంకర్.

"ఇస్పెషల్ టీ" అన్నాడు చాయ్ బండి వ్యక్తి.

"సర్లేగాని పంచదార తక్కువైనా ఫర్వాలేదుగాని టీ పొడి కాస్త ఎక్కువెయ్యి" చెప్పాడు భవానీశంకర్.

అంతలో ఆ రోడ్డెంబడి జనాలు గుంపులు గుంపులుగా పరుగెట్టసాగారు. చూస్తున్న మిత్రబృందానికి ఏమీ అర్థం కాలేదు. పరుగెడుతున్న జనాలవైపు కంగారుగా చూడసాగారు.

చాయ్‌బండి వ్యక్తి మాత్రం అదేం పట్టనట్టుగా తన పనేదో తను చేసుకుపోతున్నాడు.

"ఏందన్నా ఈ జనాలు?" జోసెఫ్ అడిగాడు.

"గీ జనాలు ఎర్ర బస్సునా కొడుకులు. సూటింగులు సూడ్డానికి వచ్చి గిట్ల అందర్నీ పరేషాన్ జేస్తుంటరు" అంటూ బర్నాల్ స్టౌకి గాలికొట్టి "గవతలగా గుట్టకాడ మోహన్‌బాబుగాడి సూటింగ్ వుంది. గది సూడ్డానికే ఈ ఎర్రి జనాలు గిట్ల ఉర్కుతుండరు" చెప్పాడు చాయ్ బండి వ్యక్తి.

"ఓర్నీ" ఆశ్చర్యంగా పరుగెడుతున్న జనాలవైపు చూశారు మిత్రులంతా.

"ఏం నాష్టగావాలన్నా?" అడిగాడు చాయ్‌బండి వ్యక్తి.

"దమాక్‌గాని కరాబ్ అయ్యిందా బై? చాయ్‌తాగి నాష్ట చేస్తాడా ఎవ్వడైనా?" అంటూ ఖాళీ గ్లాసును అక్కడున్న ఓ కుర్రాడికి అందించి "షూటింగ్‌కి మనం కూడా వెళ్దాం" మిత్రుల్ని ఉద్దేశించి చెప్పాడు జోసెఫ్. తర్వాత అందరి తరపునా తనే డబ్బు చెల్లించాడు.

భవానీశంకర్ గుండెలో రాయిపడింది. ఎట్లాగయినా సరే షూటింగ్‌కి వెళ్లడం క్యాన్సిల్ చేసి ఇంటికి వెళ్లి తీరాలి అని గట్టిగా నిర్ణయించుకుంటూ "దయచేసి నన్ను వదిలిపెట్టండిరా నేను వెళ్లిపోతాను" అన్నాడు.

"మోహన్‌బాబును చూసి వెళ్లిపోదాం" అన్నాడు జోసెఫ్.

"ప్చ్... వద్దురా" అన్నాడు భవానీశంకర్.

విన్పించుకోలేదు మిత్రులు. అందరూ కల్సి షూటింగ్‌కి బయలుదేరబోయారు.

"వద్దురా!" గట్టిగా అన్నాడు భవానీశంకర్.

"నువ్వు ఇట్లా చేస్తే మేము నీకు హెల్ప్ చేసేదిలేదు"

"అవును హెల్ప్ చేయం"

"అందుకే షూటింగ్‌కి వచ్చేయ్"

"షూటింగ్‌కి రావల్సిందే. వస్తేనే లవ్వులో నీవు సక్సెస్"

"ఆపంఢ్రా" మిత్రుల్ని ఇంకేం మాట్లాడనీయకుండా వాళ్ల వెంటే చేసేది లేదు అన్నట్లుగా బయలుదేరి వెళ్లాడు భవానీశంకర్.

వాళ్లు వెళ్లేసరికి షూటింగ్‌కి ఏర్పాట్లు జరగసాగాయి. ఎంతో దూరం నుండి వచ్చిన అభిమానులు, తాము చూడబోయేది మహా సంఘటనని అన్నట్లుగా కనబడుతున్నారు.

"వాళ్లకంటే మనం తీసిపోలేదు. అచ్చు అదే క్యాటగిరీ" తనలో తనే అనుకుంటూ మిత్రులతోపాటుగా అక్కడున్న ఒక చింత చెట్టు నీడన రాళ్లకుప్పమీద కూర్చున్నాడు భవానీశంకర్.

మనిషి ఒక చోట, మనసు ఒక చోట అన్నట్లుగా వుంది అతడి పరిస్థితి. అందుకే అక్కడ వుండటం ఇష్టంలేని వాడిగా వున్నట్టుండి మోకాళ్లలో తల పెట్టుకుని నేలని దీర్ఘంగా చూడసాగాడు.

కొన్నాళ్లక్రితం సంఘటన అనుకోకుండా గుర్తొచ్చింది. ఒక రోజు తను అమ్మమీద అలిగి చార్మినార్ దగ్గరకి వెళ్లాడు. అనూహ్యంగా అక్కడికి గౌసియా వాళ్లు కూడా వచ్చారు.

చార్మినార్ నీడలో కూర్చుని వాళ్లు క్యారియర్ తీసుకు తింటున్నారు. తనేమో ఉదయం నుండి తినలేదు. అందుకే వాళ్లు తింటుంటే లాక్కొని తినాలనిపిస్తోంది.

వాళ్లకు సమీపంగా కూర్చుని వున్నాడు తను. గౌసియా తనను మధ్యమధ్యలో గమనిస్తోంది. తను కూడా గౌసియాను చూస్తున్నాడు.

అప్పట్లో ఆమెకూ తనకూ మధ్య ప్రేమ లేదు. కాని తనకు మాత్రం ఆమెపట్ల ఆకర్షణ మొదలయ్యి కొంతకాలం అయ్యింది. ఆ ఆకర్షణ ప్రేమ అన్న సంగతి తనకు ఇంకా తెలీదు.

"ఈ అమ్మాయి బాగుంది" అనుకుంటున్నాడు తను.

కాసేపటి తర్వాత భోజనం పూర్తిచేశారు వాళ్లు. అంతలో మరెవరో ముస్లీం కుటుంబం అక్కడికి వచ్చింది. గౌసియా వాళ్లకు ఆ కుటుంబం పరిచయం వున్నట్లుగా వుంది. రాగానే "సలాం వాలేకుం" చెప్పుకుంటూ మాటలు కలిపారు.

అందరూ కలిసి మాట్లాడుతూనే చార్మినార్ నుండి మక్కా మసీదువైపు వెళ్లారు.

వెళ్తున్న వాళ్లవైపు చూస్తుంటే తనక్కోపం ముంచుకు వచ్చింది. ఇంటిముందు కుర్రాడ్ని అని కూడా చూసి పలకరించని వాళ్లమీద ఎంత కోపం వచ్చిందో! ఆ కోపం తన పిడికిళ్లలోనే నలిగిపోయింది.

"పలకరించి నాక్కాస్త కడుపు చల్లగ చేసివుంటే మీ అల్లా మెచ్చేవాడు. మీరు ఇప్పుడు మసీదుకు వెళ్లి కూడా దండగే, మీ అల్లా మెచ్చడు" మనసులోనే శపించుకుంటూ తను కూడా చార్మినార్ వెలుపలికి వచ్చాడు.

అంతలో ట్రాఫిక్ జామ్ అయ్యింది. అర్ధ గంట గడిచినా వాహనాలకి విముక్తి లేనట్లుగా కనబడింది.

"ఎందుకు ఇంతగా జామ్ అయ్యింది? " ట్రాఫిక్‌ను చూస్తూ అనుకుంటూ ముందుకు నడిచాడు తను.

కొంతదూరం వాహనాల్ని తప్పించుకుంటూ ముందుకు నడిచాక అనుకోని పరిస్థితి ఎదురయ్యింది.

"జరుగుబే" అంటూ ఎవ్వరో యువకులు తనను నెట్టేస్తూ ముందుకు వేగంగా కదిలారు.

"ఏంట్రా ఇదంతా? " భయంగా అనుకుంటూ మరికొంత ముందుకు నడిస్తే అక్కడ రోడ్డుమీద రక్తపు మడుగులో పడి వుంది ఎవరో వ్యక్తిశవం.

అతడు హిందువో ముస్లీమో అర్ధంకాని పరిస్థితి. అందుకే ఇంకా గొడవలు జరగలేదు. ముఖ్యంగా శవం దగ్గరికి ఎవ్వరినీ

రానివ్వలేదు ట్రాఫిక్ పోలీసులు. కాబట్టే అక్కడ ప్రశాంతత ఇంకా సడలలేదు.

ఆ విషయం అక్కడున్న కొందరి మాటల ద్వారా తెలిసింది. తనకు భయమేసింది. అక్కడ్నుండి వీలైనంత త్వరగా వెళ్లాలని అటూ ఇటూ చూశాడు.

జామ్ అయిన ట్రాఫిక్ కూడా పక్కనున్న సందుల్లోంచి తప్పుకుంటోంది. అలా వెళ్లడానికి కూడా కదిలే వీలులేని వాహనాలు మాత్రం హారన్ మోతలతో అలాగే నిలబడిపోయాయి.

భయంతో తను వెనుతిరిగి కొంతముందుకు నడిచాడో లేదో గౌసియా ఒంటరిగా కనబడింది.

ఆమె కళ్లల్లో భయం... కంగారు... ప్రస్ఫుటంగా కనబడుతున్నాయి. ఎటు వెళ్లాలో తెలియని పరిస్థితిలో అటూ ఇటూ చూస్తోంది.

"గౌ...సి...యా" దగ్గరగా వెళ్లి పిలిచాడు తను.

అంతకు క్రితం దాక కళ్లను మాత్రమే తెరిచి వుంచిన ఆమె బురఖా ఇప్పుడు ఆమె ముఖాన్ని స్పష్టంగా చూపెడుతోంది.

"ఆ... ఆ" తనని చూసి ఆమె ఏమీ మాట్లాడలేక పోయింది.

"తప్పిపోయావా? " తెలుగులోనే అడిగాడు.

అవును అన్నట్లుగా తలాడించింది తను.

"నేను ఇంటికే వెళ్తున్నాను వెళ్దాం పదా" అన్నాడు.

ఆమె తల అడ్డంగా ఊపింది.

"తప్పిపోయావుకదా! ఈ జనాల్లో మీ వాళ్లు కనబడ్డం చాలా కష్టం. అందుకే వెళ్దాంపదా"

"వద్దు మా అబ్బా తిడతాడు"

"ఇట్లాంటి పరిస్థితిలో కూడా మీ అబ్బాకు భయపడతావేం? అక్కడ ఏం జరిగిందో తెల్సా? ఎవర్నో కత్తులతో పొడిచి చంపేశారు" చెప్పాడు.

"హా!" హడలిపోయిందామె.

"నాకు కూడా వెళ్లిచూసేవరకు ఆ సంగతి తెలియదు" అన్నాడు.

"చంపేసారా? నేను ఏదో మామూలు గొడవ అనుకున్నాను" ఆమె గొంతు వణికి పోయింది.

"అందుకే నా వెంట వచ్చేయ్"

ఆమె అటూ ఇటూ చూసి సందేహించింది.

తను ఆమెతో మాట్లాడ్డం అది తొలిసారి కాదు. చిన్నప్పటినుండి ఏదో ఒకటి మాట్లాడుతూనే వున్నాడు. కాని గౌసియా పెద్దపిల్ల అయ్యాక ఆమెతో తను ఎప్పుడూ మాట్లాడలేదు. అదే తొలిసారి.

"నువ్వు వెళ్లు. నేను తర్వాత వస్తాను" అందామె.

"నీ ఇష్టం" అంటూ అక్కడ్నుండి తప్పుకున్నాడు తను. కాని తన మనసు అందుకు ఒప్పుకోలేదు. అందుకే ముందుకు వెళ్లినట్టే వెళ్లి తిరిగి వెనక్కి వచ్చాడు.

అప్పుడు ఎవరో మోటార్‌బైక్ కుర్రాడు గౌసియాను లిఫ్ట్ అంటూ వేధిస్తున్నాడు. ఆ కుర్రాడి ముఖకవళికలు చూడగానే ముస్లీం అని అర్థమౌతున్నాడు.

"గౌసియా" పిలిచాడు తను.

తనను చూడగానే ఆ కుర్రాడు చప్పున మౌనంగా వాహనాల మధ్యవున్న ఇరుకు మార్గం గుండా తన బండిని కాసింత ముందుకు పోనిచ్చాడు.

"వేధిస్తున్నాడా? " అడిగాడు.

"అవును" అన్నట్టుగా తలాడించిందామె.

"హిందువుల్లోకంటే ముస్లీం మతంలో ఐక్యత ఎక్కువ అని చాలామంది అనుకుంటారు. కానీ ఆ ఐక్యతను పాడుచేసే ఇట్లాంటి వెధవలు కూడా వుంటారు" తనలో తను అనుకుంటూ ఆ కుర్రాడివైపు కోపంగా చూసి, మరి ఇప్పుడైనా నా వెంట వస్తావా? " అని అడిగాడు.

"వస్తాను" అన్నట్టుగా తలాడించిందామె.

తర్వాత ఇద్దరూ కలిసి వాహనాల్ని తప్పించుకుంటూ జాగ్రత్తగా ముందుకు నడవసాగారు. అదే సమయంలో వాహనాల్ని దారి మళ్లించారు బందోబస్తుగా వచ్చిన పోలీసులు.

"నేను నీ వెంట వస్తున్నానుగానీ మా అబ్బాకు తెలిస్తే నన్ను కొడతాడేమో అని భయంగా వుంది" వెళ్తుంటే భయపడింది గౌసియా.

"తిడతాడా? కొడతాడా?" అడిగాడు తను.

"రెండూ చేయచ్చు" చెప్పింది.

"అయితే ఒక్కతినే వచ్చాను అని చెప్పేయ్..." చెప్పాడు.

"ఏమో!" భయంగా తనలో తనే అనుకుంది.

తను మాత్రం ఇంకేం మాట్లాడలేదు. కొంతదూరం వెళ్లాక తనే మళ్లీ అంది.

"మా అబ్బా సంగతి మన గల్లీ జనాలకు తెలియందికాదు. నేను ఈ వెళ్లడం మా ముస్లీం అబ్బాయితో అయితే పెద్దగా ఇబ్బంది వుండదు. కానీ నువ్వు హిందువువుకదా!"

అప్పుడు తెలిసింది తనకు. ఆమెలో మతభేదం లేదని. సామరస్యాన్ని ఆమె ఇష్టపడుతోందని. అందుకే అన్నాడు

"నీకు ఈ మతాలమీద విసుగు పుట్టినట్టుంది"

"మతాల మీద విసుగు పుట్టలేదు. ఈ మనుషుల మీదే విసుగు" అంది.

"అయితే నీ మనస్సూ నా మనస్సూ ఒక్కటే" అన్నాడు.

"అంటే?"

"నాక్కూడా నీకు మల్లే ఈ మనుషుల్ని చూస్తే విసుగు. మతం పేరుతో మానవతను మరిచే ఈ రాతి హృదయాల మీద విసుగు"

ఆమె చిన్నగా నవ్వింది.

"ఎందుకు నవ్వుతున్నావు?" అడిగాడు.

"మీ హిందువుల్లో కూడా మంచివాళ్లు వుంటారా? అని!"

"అయ్యో అదేంటి?"

"మా అబ్బా మాకు చిన్నప్పటి నుండి హిందువులంతా మంచివాళ్లుకాదని చెప్పాడు. మంచిగా మాట్లాడినా లోపల విషం వుంటుందని చెప్పాడు. ఆ అభిప్రాయమే మాలో బలంగా నాటుకుపోయింది"

"మీలాంటివాళ్లకు మా హిందువులమీద ఎలాంటి అభిప్రాయం వుందో మా హిందువుల్లో కూడా కొందరికి ముస్లీంల మీద అదే అభిప్రాయం వుంది"

"అలాగా!?"

"అవును మరి"

"మా ఇంట్లో మా అబ్బా ఒక్కడికే మతపిచ్చి నాకూ, మా అమ్మకు, మా చెల్లెళ్లకు అందరితో మాట్లాడాలి అని వుంటుంది"

"అయినాగాని మాట్లాడే అవకాశంలేదు. కాని ఒక్క విషయంలో మాత్రం నాకు ఆశ్చర్యం అన్పిస్తోంది"

"ఏ విషయం?"

"నీవు తెలుగు స్పష్టంగా మాట్లాడుతున్నావు"

"నీకు ఉర్దు రాదా?"

"వచ్చు"

"నాకూ అలాగే తెలుగు వచ్చు"

"అలా అని కాదు, మా హిందువుల్లో చాలామందికి ఉర్దూ వస్తుంది. కాని మీ ముస్లీంల్లో చాలామందికి తెలుగురాదు"

"అదీ నిజమే"

అది మొదలు ఆమెమీద తనకు మరింత అభిమానం పెరిగింది. ఆమెకూడా తన స్నేహాన్ని కోరుకుంది. కాబట్టే ఎప్పుడైనా కలుసుకున్నప్పుడల్లా మాటలు కలిపింది. అలా మొదలైన తమ తియ్యని స్నేహం తననుండే ప్రేమగా మారింది. ఆమెతో తన మాటలు కలవకపోయి వుండుంటే ఆకర్షణగానే ఆమె మీది తన అభిమానం మాసిపోయి వుండేది. కాని కలిసిన మాటలు

తమ మధ్య ప్రేమాంకురాన్ని ఇంత బలంగా నాటుతాయని అప్పట్లో తను అనుకోలేదు.

చార్మినార్ సంఘటన తర్వాత కొన్ని రోజులకు సిరాజ్ వాళ్లింట్లో దావత్ జరిగింది. పర్వీన్ ఆపా కొడుక్కి సున్తీ చేసి ఆ దావత్‌ను ఏర్పాటు చేశారు. అది రాత్రి సమయం.

తను, తన ఫ్రెండ్స్ అందరూ ఆ దావత్‌కు వెళ్లారు. సాయిబు ఏదో పనిమీద వూరెళ్లినందున గౌసియా వచ్చింది. అక్కడ మళ్లీ తమ మాటలు కలిశాయి. ఆమె ఎవ్వరికంట పడకుండా భయపడుతూ చాటుగా తనతో మాట్లాడింది.

"నాకేమో నీతో మాట్లాడాలి అన్పిస్తుంటుంది. కాని ఏదో భయం" అంది.

"మాట్లాడ్తేనే అంత భయమా? "

"పరిస్థితులు అట్లా వున్నాయి మరి"

"సరేగాని నీతో ఒక మాట"

"ఏంటీ? "

"నీకు తెలుగు చదవడం వచ్చా? "

"తెలుగూ రాదూ, ఉర్దూరాదు"

"నిజమా? "

"నిజం"

"అ అలాగా" అంటూ ప్రేమలేఖని పిడికిట్లోనే నలుపుకోసాగాడు తను.

"ఏంటీ? " తనే అడిగింది.

"ఏం లేదు" అన్నాడు.

"ఏదో చెప్పాలనుకుంటున్నావు? "

"పోనీ నీకు ఎవ్వరైనా తెలుగు చదవగల ఫ్రెండ్స్ వున్నారా? "

"వున్నారు"

"అయితే వాళ్లతో ఈ లెటర్ చదివించుకో" చెప్తూనే లెటర్‌ను ఆమెకు అందివ్వబోయాడు అతడు.

"ఏం రాసావు? " కనుబొమలు ముడిచింది.

"చదివించుకో నీకే తెలుస్తుంది" చెప్పాడు.

"అట్లాంటి ఇట్లాంటి రాతలు కావుకదా? " అనుమానంగా అంది.

"ఏమీ లేవు"

"ఎందుకంటే నీవు ఏదైనా రాయకూడనిది రాస్తే ఆ పిల్ల మా ఇంట్లో చెప్పేస్తుంది. ఆ పిల్ల నోట్లో మాట దాగదు"

ఆమె ఆ మాట మాట్లాడగానే తన చేతిని చప్పున వెనక్కి తీసుకున్నాడు తను.

"ఏం రాశావు? " అడిగిందామె మళ్లీ.

కాసేపు మౌనం వహించి తర్వాత అటూ ఇటూ చూసి నెమ్మదిగా చెప్పాడు తను.

"రాశాను"

"ఏందీ? "

"నువ్వు ఏమీ అనుకోవుకదా? "

"ఏమీ అనుకోను"

"ఒట్టు"

"అల్లామీద ఒట్టు"

"ఆ... ఆ లవ్... లెటర్"

ఆమె విస్మయంగా చూసింది.

"నేనంటే నీకు ఇష్టం లేకపోతే ఈ విషయం గురించి మీ ఇంట్లో చెప్పవద్దు" భయపడ్డాడు తను.

"..."

"బయటకు చెప్పొద్దు ప్లీజ్"

"..."

"ఏదో రాశాను పొరపాటు అయింది"

"..."

"చెప్పొద్దు" అంటూనే ప్రేమలేఖను ముక్కలు చేయబోయాడు.

"సునో" వారిస్తూ అంది.

ఏంటన్నట్లుగా చూశాడు తను.

"నువ్వే ఈ విషయం గురించి ఎవ్వరితో చెప్పొద్దు" చూపులు వాల్చి అంది.

ఆమె మనసు తనకు అర్థమయ్యింది. ఆశ్చర్యంగా చూస్తూ చప్పున ఆమె చేయి పట్టుకున్నాడు.

ఆమె చిరునవ్వు నవ్వింది. తనూ నవ్వాడు. అంతలోనే సిరాజ్ గొంతు క్రింది నుండి వినబడింది.

"రేయ్... శంకర్"

"వెళ్లిపోదాం" వెంటనే అన్నాడు.

"హూ..." అంగీకారంగా తల ఊపింది.

"ముందు నువ్వు వెళ్లు" చెప్పాడు.

ఆమె ఆ వెంటనే డాబా దిగి క్రిందికి వెళ్లింది. ఆమె వెళ్లిన తర్వాత తను నెమ్మదిగా మెట్లు దిగసాగాడు.

ఆమె ఒడియాల కోసమని డాబామీదకు వచ్చింది. తను అదే సమయంలో బల్బుల్ని గోడవారగా సరిచేయడం కోసం డాబామీదకు వచ్చాడు. కాని ఇద్దరూ వచ్చిన పని చేసుకోలేదు.

"ఏంట్రా? మిద్దెమీదకు ఎందుకు వెళ్లావు? ఏం చేసి వస్తున్నావు?" క్రిందికి వెళ్లగానే అడిగాడు సిరాజ్.

"అరెరే..." తలను చిన్నగా కొట్టుకున్నాడు తను.

"వెళ్లు" అన్నాడు సిరాజ్.

తను మళ్లీ డాబా మీదకు వెళ్లాడు. గౌసియా కూడా మళ్లీ వచ్చింది. పరిస్థితికి ఇద్దరూ నవ్వుకున్నారు.

ఆ రోజు తన జీవితంలో అపురూపమైన రోజు. ఆ గడియలు తన జీవిత పుస్తకంలో మధుర జ్ఞాపకాలుగా మిగిలిపోయాయి.

అనుకోని ఆనందం ఎదురైతే అందరూ ఎలావుంటారో తెలీదు కాని తను మాత్రం లోకాన్ని మరిచిపోయాడు. అందుకే ఒక పని చేయాల్సింది పోయి మరోపని చేయడం, ఒక మాట మాట్లాడాల్సింది పోయి మరొక మాట మాట్లాడ్డం చేశాడు. తన ప్రవర్తనకు మిత్రులంతా నవ్వుకున్నారు. తనూ నవ్వాడు. కాని తమ ప్రేమ గురించి ఆ రోజే తన మిత్రులతో చెప్పుకోలేకపోయాడు.

అదే సమయంలో గౌసియా వాళ్ల చెల్లెళ్లు ఇద్దరు ఇంటినుండి వచ్చారు.

వాళ్లను చూడగానే సిరాజ్‌గాడు అలవాటుగా తన పాట 'చాయ్ బండి చపాతీ' అంటూ సన్నగా ఈల వేస్తూ పాడటం మొదలెట్టాడు.

"ఊరుకోరా" వారించాడు తను.

"ఏంట్రా? ఏ రోజూ లేందీ ఈ రోజు సపోర్ట్ ఇస్తున్నావు?" ఆశ్చర్యంగా చూశాడు సిరాజ్.

"ఒకర్ని వెక్కిరించడం దేనికి? వాళ్ల బతుకేదో వాళ్లు బతుకుతున్నారు" అన్నాడు తను.

"ఇది వెక్కిరించడం కాదు. జస్ట్ కామెడీ.. సో టేకిట్ ఈజీ?" అంటూ కూర్చున్న చెయిర్‌లోంచి ముందుకు వంగి, "నాకేదో అనుమానంగా వుంది" అన్నాడు సిరాజ్.

"అనుమానం దేనికి?" గుమ్మడికాయల దొంగలా అడిగాడు తను.

"సపోర్ట్ ఎందుకు ఇస్తున్నావు?"

"సపోర్ట్ అని కాదు"

"మరి?"

"ఏదో... అన్నాను అంతే!"

అంటూ అప్పుడు విషయాన్ని దాటవేశాడే గాని, నిజానికి తమ ప్రేమ గురించి మిత్రులతో చెప్పుకోవాలని తనకు ఆరాటంగా వుంది. కాని ఏదో భయం. అందుకే కొన్ని రోజులవరకు మౌనంగా వుండిపోయాడు.

అయితే ఆరోజు దావత్ తర్వాత ఇంటికి వెళ్తుంటే గౌసియా గురించి ఆలోచనలు తనను వివశుడ్ని చేశాయి. అందుకే తనలో తనే నవ్వుకుంటూ ఇంటివైపు నడవసాగాడు.

"ఏయ్ పిల్లగా... శంకర్" కొంతదూరం వెళ్ళాక బాలస్వామి గొంతు వినబడింది.

"వోర్నీ! వీడు చూశాడా? క్లాసు తప్పదు" అనుకుంటూ ఆగి వెనక్కు చూశాడు.

"నీకు మొలతాడు లేదా?" అనుకుంటూ దగ్గరగా వచ్చాడు బాలస్వామి.

"ఆ..." తడబడ్డాడు తను.

"మొలతాడు లేని ఆ తుర్కనాకొడుకులు మనిషికి రెండు ముక్కలు అంటూ లెక్కగట్టి కూర వేస్తారు. అట్లాంటివాళ్ళ దావత్‌కు నువ్వు వెళ్తావా? అస్సలు నీకు ఎన్నిమార్లు చెప్పాలి? ఆ తుర్కోళ్ళ పిల్లగా

డితో దోస్తానం చేయొద్దని?" అధికారం చలాయించాడు బాలస్వామి.

"ఆ..." తడబాటే తన సమాధానం అయింది.

"ప్చ్! మన హిందువులు బాగుపడరు" అంతకంటే ఎక్కువ మాట్లాడకుండా అక్కణ్ణుండి విసుగ్గా వెళ్ళిపోయాడు బాలస్వామి.

"హమ్మయ్య" అతడు వెళ్ళిపోగానే ఊపిరి పీల్చుకున్నట్టయింది తనకు.

"రేయ్... రేయ్..."

మిత్రుల కంఠం వున్నట్టుండి వినబడింది.

ఉలిక్కిపడి చూశాడు భవానీశంకర్.

"కలలోకి వెళ్ళావేమిరా?"

"కలలో ఎక్కడెక్కడ విహరించావు?"

మిత్రులు టీజింగ్‌గా అడుగుతుంటే "లేదురా... లేదురా..." జుత్తు సరిచేసుకుంటూ దాటవేశాడు భవానీశంకర్.

అప్పటికి సమయం ఏడున్నర కావొచ్చింది. షూటింగ్ ఏర్పాట్లు ఇంకా గావిస్తున్నారు.

భవానీశంకర్‌కు విసుగ్గా వుంది. "ఈ ఏర్పాట్లకు అంతం ఎప్పుడో" హడావిడి పడుతున్న వర్కర్స్‌ని చూస్తూ అన్నాడు.

"ఆ తొందర ఎందుకు?" అన్నాడు జోసెఫ్.

అందుకు ఏం మాట్లాడలేదు భవానీశంకర్. మనసును కుదుటపర్చుకునేందుకు గానూ తనకు వచ్చిన పాటను హమ్ చేయసాగాడు.

"హింద్ దేశ్ కే నివాసీ సబ్ జనో ఏక్ హై..."

అంతలో మూడు పోలీస్‌వ్యాన్లు సత్వరన అక్కడికి దూసుకువచ్చాయి.

"షూటింగ్‌కి ఇంత బందోబస్తా?" ఆశ్చర్యపోయారు. పోలీసులు వ్యాన్లలోంచి దిగి హుటాహుటిగా అక్కడికి సమీపంగా వున్న గుడిసెలవైపు నడిచారు.

ఎవ్వరికీ ఏమీ అర్థం కావడంలేదు. అక్కడున్న జూనియర్ ఆర్టిస్టుల గుడిసెల్ని తొలగించడానికి పోలీసులు సంసిద్ధులు అయ్యారని కాసేపటి తర్వాత అందరికీ అర్థం అయింది.

జూనియర్ ఆర్టిస్టులు గగ్గోలు పెడుతున్నారు. పోలీసులు వాళ్ళ ఆక్రందనల్ని, ప్రతిఘటనల్ని, అరుపుల్ని, ఎంతమాత్రం లెక్కచేయడంలేదు. విచక్షణారహితంగా గుడిసెల్ని కూలగొడుతున్నారు.

షూటింగ్ చూడ్డానికి వచ్చినవాళ్ళంతా అటుకేసి పరుగెట్టసాగారు. భవానీశంకర్, అతడి మిత్రులు అక్కడే నిలబడిపోయి చేష్టలుడిగి చూస్తుండిపోయారు.

"మనం ఇక్కడ్నుండి వెళ్ళిపోదాం. ఇక్కడేదో పెద్ద గొడవలు జరిగేట్టువున్నాయి" కాసేపటి తర్వాత అన్నాడు భవానీశంకర్.

"వద్దు" అన్నాడు జోసెఫ్.

"గొడవలు జరిగితే కష్టంరా" అన్నాడు భవానీశంకర్.

"గొడవలు ఏం జరగవు" మరో మిత్రుడు అన్నాడు.

"గొడవలు జరగవుగానీ కాసేపయ్యాక సినిమా ప్రముఖులు వస్తార్రా ఇక్కడికి! వాళ్ళను దగ్గర్నుండి చూడొచ్చు" అన్నాడు జోసెఫ్.

"ఏంట్రా? గొడ్డోడు గొడ్డుకి ఏడిస్తే మాలోడు కొవ్వుకు ఏడ్చాడంట" అన్నాడు భవానీశంకర్ (తెలంగాణ సామెత).

"ఎవ్వడికి ఏమైతే మనకేంట్రా? మనం చూడాల్సింది ఫిల్మ్‌స్టార్లను. ఆ కోరిక పెద్ద ఎత్తున తీరబోతోంది" ఖుషీగా అన్నాడు జోసెఫ్.

"ఛ! రాస్కెల్" కోప్పడ్డాడు భవానీశంకర్.

అతడితో మిత్రులు ఎవ్వరూ ఏం మాట్లాడలేదు. పోలీసుజులుం గురించి మాట్లాడుకోసాగారు.

"గొడవలు జరిగినా ఈ వెధవలు కదిలేట్టులేరు" తనలోతను అనుకోబోయి పైకే

అనేశాడు భవానీశంకర్.

"విసిగించొద్దురా. నువ్వెళ్ళు" భవానీశంకర్‌వైపు చూడకుండానే చేయి విదిల్చాడు జోసెఫ్.

"వెళ్తానురా" రోషంగా అన్నాడు భవానీశంకర్.

అతడి మిత్రుడు ఆ రోషాన్ని కించిత్ కూడా లక్ష్యపెట్టలేదు. కాసేపటి తర్వాత అక్కడికి ఐదారు కార్లు వచ్చీరాగానే, అతడి మిత్రులంతా వడివడిగా కార్ల వెనక పరుగెట్టినట్టుగా వెళ్ళారు.

భవానీశంకర్ వెళ్ళలేదు. వెనక్కితిరిగి బస్టాండ్‌వైపు అడుగులు వేశాడు.

బస్టాండ్ దగ్గరికి వెళ్ళాక అక్కడ కూడా కలకలమే కనబడింది. జూనియర్ ఆర్టిస్టులు కొందరు అక్కడికి చేరి గొడవ సృష్టిస్తున్నారు.

"మాకు జరిగిన అన్యాయాన్ని మేం సహించం"

"మాకు న్యాయం జరగాలి"

"అందరూ కుమ్మక్కై మా బతుకుల్ని నాశనం చేస్తున్నారు"

"మాకు ఫిలింనగర్‌లోనే ఇళ్ళు కావాలి"

"ఇది కావాలని జరిగిన కుట్ర"

"ఈ ఊబిలో మేం ఇరుక్కోం. కష్టపడైనా మేం అనుకున్నది సాధిస్తాం"

"అవసరమైతే బస్సుల్ని, ఆటోల్ని ఆపేస్తాం. అసలు ఈ రోడ్డెంబడి వాహనాలే తిరగకుండా చేస్తాం"

జూనియర్ ఆర్టిస్టులు ఒకరితర్వాత ఒకరు ఆవేశంగా మాట్లాడుతూ ఎగిసెగిసిపడుతున్నారు.

"కొంపదీసి బస్సులు, ఆటోలు, బంద్ అయిపోతే ఇంటికి వెళ్ళడం కష్టమైపోతుంది" వాళ్ళనే చూస్తూ భయంగా అనుకున్నాడు భవానీశంకర్.

అతడి భయాన్ని, కంగారుని, పరీక్ష పెట్టినట్టుగా అర్ధగంట గడిచినా ఒక్క బస్సు రాలేదు.

"శంకర్..." దూరంనుండి జోసెఫ్ గొంతు వినబడింది. తిరిగి చూశాడు భవానీశంకర్.

"ఏంట్రా? చెప్పాపెట్టకుండా వచ్చేస్తే మేం ఏం అనుకోవాలి?" దూరంనుండే కోప్పడుతూ దగ్గరగా వచ్చాడు జోసెఫ్.

"మరేం చేయాలి? మీరు కదిలేట్టు లేరు" అన్నాడు భవానీశంకర్.

"నీకు ఇంత తొందర అవసరం లేదురా! మేం వుండగా నువ్వు ఏ విషయం గురించి కూడా బాధపడకూడదు. మా స్నేహితుడు బాధపడితే మాకూ బాధేకదా! వెళ్దాంరా" దగ్గరగా వస్తూనే అన్నాడు.

"...."

"రారా" భవానీశంకర్ భుజంపై చేయివేశాడు జోసెఫ్.

"నా మనసు ఎందుకో శంకిస్తోంది. నేను వీలైనంత త్వరగా ఇంటికి వెళ్ళాలి. గౌసియాను చూడాలి" స్నేహితుడి వెంట నెమ్మదిగా అడుగులు ముందుకు వేస్తూ అన్నాడు భవానీశంకర్.

"నీవు ఇందాకట్నుంచి బాధపడుతుంటే, అర్థం చేసుకోకుండా వుండేందుకు మేం చిన్నపిల్లలం కాదు. గౌసియాతో నీ పెళ్ళిని జరిపించే బాధ్యత మాది. ఆ బాధ్యతను మేం ఎప్పుడు మర్చిపోయాం. కాబట్టి అనవసరంగా టెన్షన్ పడొద్దు" అన్నాడు జోసెఫ్.

"అది కాదురా" తన భయాన్ని చెప్పుకోబోయాడు భవానీశంకర్.

"నువ్వు ఇంకేం మాట్లాడొద్దు" అన్నాడు జోసెఫ్.

"నా మాట వినరా..." అన్నాడు భవానీశంకర్.

"ఏంమాట?"

"మీ ధైర్యం నన్ను ముందుకు నడిపిస్తోంది. అయితే అనుకోకుండా నిన్న రాత్రి కిరాత్రే గౌసియా పెళ్ళి జరిగింది అనుకో. అప్పుడేం చేస్తారు?"

"ఆ తాళిని తెంపి పడేస్తాం"

"ఆ అవకాశం లేకుండాపోతే? "

"ఎలా పోతుంది? ఐమీన్ అమ్మాయి చేసుకున్నవాడి వెంట వెళ్ళిపోవడమా? లేక చేసుకున్నవాడికి అంకితం కావడమా? " అని అడిగి ఆ వెంటనే "ఇఫ్ యూ డోంట్ మైండ్‌రా! ఆ ఏసు ప్రమాణంగా నీ ప్రేమ గొప్పది అని నాకు తెల్సు. అయినప్పటికీ అడిగాను..." అన్నాడు జోసెఫ్.

కొన్ని క్షణాలవరకు భవానీశంకర్ ఏం మాట్లాడలేదు. స్నేహితుడివైపు కళ్ళింత చేసి చూశాడు.

"ఊ... చెప్పరా? " అన్నాడు జోసెఫ్.

"ఆమె లేకుండా నేను బతకలేను" అని మాత్రం అనగలిగాడు భవానీశంకర్.

జోసెఫ్ ఇంకేం అడగలేదు. స్నేహితుడి మనసు తెరిచిన పుస్తకంలా అర్థమైంది అన్నట్టుగా భవానీశంకర్ భుజాన్ని మృదువుగా తట్టాడు.

ఇద్దరూ కలిసి మౌనంగా ముందుకు నడుస్తున్నారు. షూటింగ్ ఏర్పాట్లు ఆగిపోయాయి. వాతావరణం కలవరంగా తయారైవుంది.

"తమ్మారెడ్డి భరద్వాజ, దాసరినారాయణ రావు, నరేష్, ఇంకా చాలామంది వచ్చారు" మరికొంత ముందుకు వెళ్ళాక చెప్పాడు జోసెఫ్.

"అలాగా" అన్నట్టుగా తలపంకించాడు భవానీశంకర్.

"రేపట్నుండి ఈ జూనియర్ ఆర్టిస్టులు ఇందిరాపార్క్ దగ్గర ధర్నా కొనసాగిస్తారట"

"...."

"ఏదోలేరా! కాసేపు వుండి వెళ్ళిపోదాం"

పదిహేను నిమిషాల్లో వివాదస్థలికి చేరుకున్నారు ఇద్దరూ. అక్కడ వున్న మిగతా మిత్రులు భవానీశంకర్‌ని చీవాట్లు వేశారు. కిమ్మనలేదు భవానీశంకర్. నిశ్శబ్దంగా నిలబడి అందర్నీ పరికించసాగాడు.

పత్రికలవాళ్లు, టీవీ ఛానెల్స్‌వాళ్లు, హడావిడి పడుతున్నారు. "చచ్చేవాడు చస్తే బతికున్నోడికి పండుగ" అన్నట్లుగా టీవీ కెమేరాల్లో బంధింపబడాలని చాలామంది ప్రయత్నిస్తూ కెమేరాలు ఎటుతిరిగితే అటు తిరుగుతున్నారు.

వాళ్ళవైపు వెటకారంగా చూశాడు భవానీశంకర్. ఇప్పుడే కాదు, ఒకసారి కర్నూల్‌లో కూడా ఇట్లాంటి సంఘటనే జరిగింది.

"తను బంధువుల పెళ్ళికోసం కర్నూల్ వెళ్ళాడు. పెళ్ళి మధ్యలో ఆగిపోయింది. కట్నం కోసం పీటల మీద పెళ్ళి ఆగిపోవడంతో పెళ్ళికూతురు తరఫువాళ్ళ వేదన అంతా ఇంతా కాదు. తను పెళ్ళికొడుకు తరఫు అయినప్పటికీ, పెళ్ళికూతురి తరఫు వాళ్ళమీద జాలి కనబర్చాడు.

పెళ్లికూతురి తల్లితండ్రులు బాగా ముసలివాళ్ళు. పైగా పేదవాళ్ళు. వాళ్ళను చూస్తుంటే తనక్కూడా ఏడుపు ముంచుకొచ్చింది. కఠినంగా వ్యవహరిస్తున్న పెళ్ళికొడుకువైపు వాళ్ళను శక్తిమాన్‌లా మారి కొట్టాలనిపించింది కూడా!

ఇట్లాంటి విపత్కర పరిస్థితిలో పెళ్లికూతురు ఆత్మహత్య చేసుకోబోయింది. సమయానికి అందరూ వున్నారు కాబట్టి ఆమెను ఆదుకోగలిగారు.

పెళ్లిపెద్దలు ఇరువురి మధ్య ఏకీభావానికి ప్రయత్నిస్తున్నారు. అదే సమయంలో అక్కడికి సమీపంగా వున్న ఒక హాస్పిటల్‌లో షూటింగ్ నిమిత్తం చిరంజీవి వచ్చాడు. అంతే! ఇక్కడ వీళ్ళ బాధ ఏమైతే మాకెందుకు అన్నట్టుగా సగానికి పైగా బంధుజనాలు చిరంజీవిని చూడ్డానికి పరుగో పరుగు!

ఇప్పుడు ఇక్కడ కూడా అట్లాంటి పరిస్థితే కనపడుతోంది. ఏంటో వెర్రిజనాలు!"

"జోసెఫ్" కాసేపటి తర్వాత పిలిచాడు భవానీశంకర్.

"ఊ..." చూడకుండానే పలికాడు జోసెఫ్.

"ఇంకా ఇక్కడ నిల్చుని ఏం చేస్తారు?" అన్నాడు భవానీశంకర్.

"సరేలేరా! ఇంక నువ్వు బతకనిచ్చేట్టు లేదు" అని మిగతా మిత్రులవైపు చూస్తూ, "రేయ్! నాష్టచేసి ఇంక వెళ్దాం రండి" అన్నాడు జోసెఫ్.

మిత్రులందరూ అక్కడ్నుంచి బయలుదేరారు. వెళ్తుంటే జోసెఫ్ అన్నాడు.

"రజనీకాంత్‌తో మాట్లాడి, ఫొటో తీయించుకుని, నా గుర్తుగా ఆయనకి ఏదైనా గొప్ప కానుకను ఇవ్వాలని వుందిరా"

"అభిమానం వుండాలి. కాని నీలా వెర్రి అభిమానం వుండకూడదు. ఒకసారి గొప్ప కానుక అంటావు, మరోసారి రక్తతిలకం అంటావు, ఇంకోసారి సినిమా హిట్టయితే ఫ్రెండ్స్ అందరికీ చికెన్ బిరియాని డిన్నర్ అంటావు. ఈ పిచ్చి కాస్త వదిలించుకోరా" అన్నాడు భవానీశంకర్.

"వెర్రిగా వుండకూడనిది అభిమానం ఒక్కటే కాదు, ప్రేమ కూడా" అన్నాడు జోసెఫ్.

"అంటే?"

"నీది వెర్రిప్రేమ"

"నా ప్రేమ వెర్రిది కాదు, ప్రేమకోసం వెర్రివాడినయ్యాను"

"మాటలు నేర్చాడు మన హీరో" అంటూ భవానీశంకర్‌ను చుట్టేశాడు జోసెఫ్.

మిగతా మిత్రులు అందుకు వంతపాడుతూ "మామూలు హీరో కాదు, మెగా స్టార్ మనవాడు" అన్నారు.

★ ★ ★

ఉదయం పదకొండు గంటలు కావొస్తోందనగా ఇంటికి వచ్చాడు భవానీశంకర్.

"నువ్వేదో ఆ పిల్లను ఉద్ధరిస్తాను అన్నావుకదా! నువ్వు ఉద్ధరించక మునుపే ఆ పిల్ల వెళ్లిపోయింది" రాగానే అంది లక్ష్మీదేవమ్మ. ఆ గొంతులో కాసింత వ్యంగ్యం

ఉలిక్కిపడి చూశాడు భవానీశంకర్.

నవ్వింది లక్ష్మీదేవమ్మ. "ఏంట్రా అలా చూస్తావు? రాత్రి పన్నెండు గంటలకు మీసాలు లేని గడ్డపాయన కార్లో వచ్చాడు. ఒంటిగంటకల్లా ఆ పిల్లను తీసుకుని వెళ్లిపోయాడు" నవ్వాక అంది.

ఒక్కసారి అగ్నిపర్వతం కూలి తన మీద పడుతున్న భావన కలుగుతుంటే అప్రయత్నంగా చేతిలోని పాకెట్ రేడియోని జారవిడిచాడు భవానీశంకర్.

"కానీ ఒక్క విషయంలో జాలివేస్తోంది. చేసుకునేవాడు ఎవ్వడైనప్పటికీ పడుచువాడై వుంటే బాగుండేది. కాని ఆ వచ్చినవాడు సాయిబుకే తండ్రిలా వున్నాడు" లక్ష్మీదేవమ్మ గొంతులో కొద్దిగా సానుభూతి.

అప్పటికి భవానీశంకర్ పరిస్థితి అరణ్యరోదనలా తయారయ్యింది. సత్తువ లేనివాడిలా అడుగులో అడుగు వేస్తూ గుమ్మం దాకా వెళ్లి గౌసియా వాళ్ల ఇంటివైపు చూశాడు.

దేవతలేని గుడిలా కనిపించింది ఆ ఇల్లు. కాని అదేమీ పట్టనట్లుగా ఆమె చిన్న చెల్లెళ్లు ముగ్గురు ఇంటిముందు తాడు ఆట ఆడుకుంటున్నారు. పెద్ద చెల్లెళ్లు ఇద్దరు కూలిన బాతుల గూడును తిరిగి కడుతున్నారు. ఇంకో చిన్న పిల్ల గడప సందుల్లో కూర్చుని వుంది. అందరికంటే చిన్నదాన్ని ఎత్తుకుని వున్న ఖతీజాబీ మాత్రం కొత్త చీరలు అమ్మేవాడిని ఇంటిముందు నిల్చోబెట్టుకుని ఏదో మాట్లాడుతోంది.

ఎప్పుడూ పాత చీరలు బేరం చేసే ఖతీజాబీని అలా చూడగానే భవానీశంకర్ సహించలేకపోయాడు. అలాగని ఆమెను ఏమీ అనలేదు కాబట్టి పగిలిన గుండె

గుప్పెడు వేదనను పంచి ఇస్తుంటే అప్రయత్నంగా కళ్లనీళ్లు తుడుచుకున్నాడు.



విమానంలో షేక్ పక్కన కూర్చుని వుంది గౌసియాబేగం. బాగా ఏడ్చినందున ఆమె కళ్లూ, ముఖం ఉబ్బిపోయి వున్నాయి. అవేమీ బయటకి కనిపించకుండా ధరించిన బురఖా అడ్డుకుంటోంది. అప్పటికే బాగా అలసిపోయింది కాబట్టి ప్రస్తుతం ఆమె ఏడవడంలేదు. నిశ్శబ్దంగా కూర్చుని ప్రియుడి గురించి ఆలోచిస్తోంది. సన్నగా వెక్కుతోంది కూడా. కాని ఆమెను ఎవ్వరూ గమనించడంలేదు.

ముంబాయిలో విమానం దిగాక ఆమెను ఒక పెద్ద హోటల్లోకి తీసుకెళ్లాడు షేకు. అక్కడ గదుల్లో షేకులాంటి వ్యక్తులు దాదాపు పదిమంది వరకు కనిపించారు. వాళ్లల్లో కొందరి గదుల్లో అమ్మాయిలు కనిపించారు. ఆ అమ్మాయిలు తనలా బాధపడకుండా ఎంతో ఆనందంగా కనిపించడంతో గౌసియాబేగం ఆశ్చర్యపోయింది.

కేవలం అందమైన స్త్రీలను అనుభవించడంకోసం పనిగట్టుకుని గల్ఫ్ దేశాలనుండి షేకులు వస్తారని, నెలల వారిగా తిష్టవేస్తారని, వాళ్లకి కావాల్సినంత సుఖాన్ని అందిస్తూ భారతీయ వేశ్యలు దండిగా డబ్బు సంపాయించుకుంటున్నారని గౌసియా బేగానికి తెలియదు. అందుకే తను కూడా వాళ్లలా ఆనందంగా కనబడాలి కాబోలు అనుకుంది.

"చూశావా? ఆ అమ్మాయిలు ఎంత చక్కగా సహకరిస్తున్నారో? " తమ గదిలోకి వెళ్లాక తలుపులు దగ్గరగా వేస్తూ అన్నాడు షేకు.

"... "

"నువ్వుకూడా అలాగే వుండాలి. ఇలా ఏడుస్తూ వుంటే నేను ఒప్పుకోను" అంటూ వచ్చి ఆమెను తన మీదకు లాక్కున్నాడు.

తన ప్రియుడు కూడా ఎప్పుడూ అలా చేయలేదు. తమ మధ్యన కొనసాగింది స్నేహబంధంలాంటి ప్రేమ! అందుకే పురుషుడి తాలూకు బలమైన తొలి స్పర్శకు ఆమె దాదాపుగా అదిరిపడింది.

కిటికీలోంచి బయట అంతా స్పష్టంగా కనబడుతోంది. కిటికీకి చేరువగా వున్న వేపచెట్ల కొమ్మలమీద బుల్‌బుల్‌పిట్టలు స్వేచ్ఛగా కూర్చుని వున్నాయి. వాటిని చూసిన ఆమె మనసు 'మరి నాకెందుకు ఈ పంజర జీవితం? వాటిలా స్వేచ్ఛగా నేనెందుకు ఉండలేకపోతున్నాను? నా శరీరం నా అనుమతి లేకుండా ఎవ్వరికో సమో ఎందుకు అంకితమైపోతోంది? వద్దు బలవంతంగా నేను బలికావద్దు' అంటూ ఆక్రోసించింది. ఆ తర్వాత ఆవేశపడింది.

తనను ముద్దాడబోయిన అతడి మొరటు పెదాలు ఆమెలో జుగుప్సని కలిగిస్తుంటే వెల్లువెత్తిన ఆవేశంతో అతడిని చప్పున నెట్టేసింది.

ఆమె తన బలాన్నంతా ఉపయోగించడం వల్ల అతడు ఎగిరి బెడ్‌మీద పడ్డాడు. తక్షణమే తమాయించుకుని ఆమెవైపు దెబ్బతిన్న పాములా చూశాడు.

ఆమె గజగజా వణికిపోయింది.

"నిన్ను సుల్తానీ చేయాలనుకున్న నన్నే

నెట్టేస్తావా? నీకెంత పొగరు?" పళ్లబిగువున అంటూ లేచి ఆమెవైపు వచ్చాడు.

ఆమె అప్రయత్నంగా అడుగులు వెనక్కి వేసింది.

"రాత్రే నిన్ను అనుభవించాలనుకున్నాను. ఖుషీఖుషీగా నీ శరీరాన్ని నలిపివేయాలనుకున్నాను. కాని మా షేకులకి మందు పార్టీ ఇచ్చేసరికే తెల్లవారిపోయింది. అప్పటికే నేను నీరుగారిపోయాను. అందుకే ఇప్పుడు నన్ను కాదని నాకు కోపాన్ని తెప్పించవద్దు" అంటూ ఆశగా కళ్లు పెద్దవిచేసి ఉన్మాదిలా ఆమెవైపు నడిచాడు అతడు.

ఆమె అలాగే అడుగులు వెనక్కి వేస్తోంది. తన మీద అతడు పళ్లు నూరగానే తనని కొడ్తాడేమో అనుకుంది. కాని అంతలోనే అతడిలో తన మీద కోరిక కనబడగానే మరింత భయపడిపోయింది.

"నన్నేం చేయొద్దు" చేతుల్ని అడ్డం పెట్టుకుంది.

అతడు కోరలు చాచిన పాములా ఆమె వైపుకు వస్తున్నాడు. ఆమెకు ముచ్చెమటలు పట్టేశాయి. ఆమె ప్రమేయం లేకుండానే కళ్లల్లో నీళ్లు ఆమె చెక్కిళ్లమీదుగా కిందికి ప్రవహించసాగాయి.

"నీవు నాకు తాతలా వున్నావు. నన్నేం చేయొద్దు" అంటూ అలాగే అడుగుల్ని వెనక్కి వేస్తూండగా అనూహ్యంగా అక్కడ వున్న టీపాయ్‌ని తాకింది. ఆమె బలంగా తగలడంతో టీపాయ్ కదిలి దానిమీద వున్న ఫ్లవర్‌వేజ్ కిందపడి భళ్లున పగిలిపోయింది.

తత్తరపాటుగా పగిలిన ఫ్లవర్‌వేజ్‌వైపు చూసిన గౌసియాబేగానికి చటుక్కున ఒక ఆలోచన మెదిలింది. ఆమె ఇక ఆలస్యం చేయలేదు. వెంటనే వంగి పగిలిన గాజు ముక్కను చేతిలోకి తీసుకుని అతడివైపు భయంగా చూస్తూ, "నావైపు రావొద్దు" అంది గట్టిగా.

ఈ అనూహ్య పరిణామానికి అతడు బిత్తరపోతూ ఆగిపోయాడు. ఆమె గాజు ముక్కను అలాగే పట్టుకుని గుమ్మంవైపు అడుగులు వేస్తూ "నా దగ్గరకి వస్తే నిన్ను పొడిచి చంపేస్తాను" అంది.

అతడు కొన్ని క్షణాలు ఆమెవైపు విస్మయంగా చూసి ఆ తర్వాత చప్పున తన కుర్తాజేబులోంచి పిస్టల్ బయటికి తీసి "ఆ గాజుముక్కను పక్కకు పెట్టేయ్. లేదంటే కాల్చేస్తాను" అంటూనే పిస్టల్ని ఆమెకు గురిపెట్టాడు.

ఆమె భయపడిపోయింది. అతడివైపు భీతిల్లిన నేత్రాలతో చూస్తూ నెమ్మదిగా వెళ్లి గాజుముక్కను టీపాయ్‌పై పెట్టేసింది.

"శహభాష్" నవ్వుతూ అని పిస్టల్ని తిరిగి తన కుర్తా జేబులో పెట్టుకుంటూ "రా బేగం రా! నా కోసంరా" పిలుస్తూ ఆమెవైపు వచ్చాడు.

ఆమె అక్కడే నిలబడిపోయి వుంది.

"నీవు చిన్నపిల్లవి. నీకు సుఖం గురించి తెలీదు. అందుకే అనవసరపు వేషాలు వేసి నన్ను విసిగిస్తున్నావు. ఒక్కసారి సుఖాన్ని రుచిచూస్తే ఇలాంటి వేషాలు ఇక వేయకుండా బుద్ధిగా వుంటావు" అంటూ ఆమె వైపు వచ్చి ఆమె భుజాలపై చేయివేసి బిగించి పట్టుకున్నాడు.

ఆమె అతడి కళ్లల్లోకి సూటిగా చూసింది. అతడు కూడా ఆమె కళ్లల్లోకే చూస్తున్నాడు. కాకపోతే ఆమె కళ్లల్లో భయం, అతడి కళ్లలో కామం.

అతడు ఆమె ముఖంమీదకు తన ముఖాన్ని పోనిచ్చి ఆమె పెదవుల్ని ఆబగా అందుకోబోయాడు.

సరిగ్గా అదే క్షణంలో తన చేయిని వెనక్కిపోనిచ్చి టీపాయ్‌మీద గాజుముక్కను అందుకుని వెనకాముందు ఆలోచించకుండా అతడి కడుపులోకి బలంగా పొడిచింది గౌసియాబేగం.

"మా" అతడు బిగ్గరగా అరుస్తూ వెనక్కి

తుళ్లాడు. అతడు తమాయించుకునే లోపు అదే గాజు ముక్కతో మరోసారి కసిగా గుచ్చింది. ఈసారి అతడు లుంగలు చుట్టుకుపోయాడు. ఆమె ఇక ఆగలేదు. ఇష్టం వచ్చినట్టుగా అతడిని పొడవసాగింది. అతడు భీకరంగా అరుస్తూనే తన కుర్తాజేబులోని తుపాకీని బయటకి తీయబోయాడు. కాని అది అతడివల్ల కాలేదు. తుపాకిని అందుకోబోయేలోపే అతడి చేతుల్లో శక్తి క్షీణించింది.

ఆమెవైపు భయంకరంగా చూస్తూ "బేగం" అంటూ గర్జించాడు. ఎగజిమ్మిన రక్తపు మరకలతో తడిసిపోయిన గౌసియా బేగానికి తను చేసింది ఏమిటో అర్థం కాగానే కాళ్లూ చేతులు వణకనారంభించాయి.

ఏడుస్తూ అతడివైపు చూస్తూ గాజుముక్కని చేతుల్లోంచి వదిలేసింది.

అతడు కిందపడి మెలికలు తిరిగిపోతూ క్రమంగా తన చైతన్యాన్ని కోల్పోతున్నాడు. ఫలితంగా అతడిలో కదలికలు నెమ్మదిగా ఆగిపోతున్నాయి.

ఆమెకు అర్థంకాలేదు. అటూ ఇటూ చూసింది "అల్లా" అంటూ ఏడుస్తూ గుమ్మంవైపు పరుగెట్టి అతడివైపు ఒకసారి తిరిగి చూసింది.

అతడు రక్తపు మడుగులో గింజుకుంటున్నాడు. అతడిని అలా చూడగానే ఆమెకు మరింత భయంవేసింది.

"అల్లా అల్లా" గుండెలు బాదుకుంటూ గిరుక్కున వెనుతిరిగి తలుపు తీసుకుని వేగంగా బయటకి నడిచింది.

అటూఇటూ వరసగా వున్న గదులన్నీ మూసుకుని వున్నాయి. బయట ఒక్కరు కూడా కనబడ్డంలేదు. ఆమె ఎటూ చూడకుండా పరుగున ముందుకు నడుస్తూ తల మీదనుండి తొలగిన బురఖాని సరిచేసుకుంది.

ఆమె వున్నది నాల్గవ అంతస్థు. అయినప్పటికీ లిఫ్టు ఉపయోగించడం తెలియదు కాబట్టి వడివడిగా మెట్లు దిగసాగింది.

కిందికి వెళ్లాక రిసెప్షన్‌లో నలుగురు ఉద్యోగస్థులు కూర్చుని వున్నారు. వాళ్ల కౌంటర్‌ముందు ఐదారుగురు వ్యక్తులు నిలబడి ఏదో మాట్లాడుతున్నారు. వాళ్లెవ్వరూ గౌసియాబేగాన్ని పట్టించుకోలేదు. కాంపౌండ్‌లోకి వెళ్లాక కూడా ఎదురైన వాళ్లెవ్వరూ ఆమెను పట్టించుకోలేదు.

ఆమె ధరించిన బురఖా నలుపురంగులో వున్నందున ఆమె మీదకు ఎగజిమ్మిన రక్తం ఆ రంగులో కల్సిపోయింది. ముఖాన్ని, చేతుల్ని తడిపేసిన రక్తాన్ని బురఖా ముసుగు కప్పివేసింది.

ఏమాత్రం పరిచయంలేని మహానగరం, కాంపౌండ్ గేటు దాటి ముందుకు వెళ్లీవెళ్లగానే ఆమెను హడలగొట్టింది. తనకు పరిచయం వున్న హైదరాబాదే మహారణ్యంలా కనబడేది. అలాంటిది అంతకు ఐదురెట్లుగా కనబడుతున్న ముంబాయి నగరం ఆమెకు అగమ్య గోచరంగా కనబడుతుంటే గమ్యం తెలియని పక్షిలా అడుగులు ముందుకు వేయసాగింది.

కొంతదూరం వెళ్లాక పబ్లిక్ పార్క్ ఒకటి కనిపించింది. ఆకుపచ్చని తివాసిలా పార్క్ అంతా పరుచుకున్న గడ్డిపరకల్లో భిక్షగాళ్లు సేదతీరుతున్నారు. వెళ్లి పోకచెట్టు నీడలో కూర్చుంది గౌసియాబేగం.

అప్పటికి ఒంటిని, బట్టల్ని అంటుకున్న రక్తం ఎండిపోయి వాసన వస్తోంది. దానికి తోడు దాహంతో నాలుక పిడచకట్టుకుపోతోంది.

ఎక్కడైనా పబ్లిక్ కుళాయి కనబడుతుందేమోనని అటూ ఇటూ చూసింది గౌసియా.

కాసింత దూరాన ఫౌంటేన్ ఎగజిమ్ముతూ కనబడింది. వెంటనే లేచి అటువైపు నడిచిందామె.

అవి నిలవవుండిపోయిన మురికి నీరు అని ఆమెకు తెలీదు. వెళ్లి ఫౌంటేన్ కట్టపై

కూర్చుని నీళ్లనంతా ఒకసారి కలియజూ సింది. ఆకుపచ్చగా కనబడుతున్న నీళ్లల్లో నాచు బాగా పేరుకుపోయివుంది. కాకపోతే ఫౌంటేన్ కదలికలవల్ల నాచు అంతా పక్కలకు చేరిపోయి వుంది. శుభ్రమైన నీరు కాదు అని ఆమెకు అర్థమైపోయింది. అయినాగాని దాహం తీర్చుకోడానికి అంతకన్నా వేరేదారి దొరకలేదు ఆమెకు.

దోసిళ్లతో నీరు తీసుకుని తాగబోయింది. నీరు చాలాకాలంగా నిలవవుండడంవల్ల మురికివాసన ఆమె ముక్కుపుటాల్ని అదరగొట్టింది. అయినప్పటికీ ఒక్క దోసిలి నీరు తాగింది. ఎండిపోయిన గొంతులో తేమ వూరినట్లుగా తోచింది. అందుకే కళ్లు మూసుకుని ఐదారు దోసిళ్ల నీటిని గబగబా తాగి, హాయిగా వూపిరి పీల్చుకుంటూ ఫౌంటేన్ కట్టదిగి పోకచెట్లువైపు నడవబోయింది.

అంతలోనే ఆమె అడుగులు ఆగిపోయాయి. కాసింత దూరంలో నిలబడి వెకిలిగా తననే చూస్తున్నారు ముగ్గురు యువకులు.

"పోరికి దమాక్ ఖరాబ్ అయినట్టుంది" ఒక యువకుడు అన్నాడు.

"ఇంతకీ ఈ పోరి ఎవరు? " మరో యువకుడు అన్నాడు.

"లేచిపోయి వచ్చిన కేసులావుంది. లేకపోతే బురఖాలు పబ్లిక్ పార్కుల్లో కనబడ్డం, అందునా ఒంటరిగా కనబడ్డం అంటే అది ఆలోచించాల్సిందే" ఇంకో యువకుడు అనగానే,

"ఆలోచించడం కాదురా అనుమానించాల్సిందే" మొదటి యువకుడు అన్నాడు.

ఆ యువకులు మాట్లాడుతున్నది స్వచ్ఛమైన హిందీ అయినప్పటికీ తమ ఇంట్లో మాట్లాడేది నాటు ఉర్దూ అయినప్పటికీ వాళ్లు మాట్లాడే ప్రతిపదం ఆమెకు అర్థమవుతోంది.

వాళ్లు ఆమె కంటికి కబళించడానికి వచ్చిన రాబందుల్లా కనబడ్డారు. అందుకే వెంటనే అట్నుంచి ముందుకు కదిలి వాళ్లని దాటి వెళ్లబోయింది.

"ఏయ్ పోరీ" అంటూ ఒక యువకుడు ఆమె బురఖా పట్టుకు లాగాడు.

ఆ విసురుకు తలమీద ముసుగు తొలగి రక్తపు మరకలు అంటివున్న ఆమె ముఖం వాళ్లకు స్పష్టంగా కనబడింది.

"హా!? " ముగ్గురూ ఒకేసారి కళ్లింతచేశారు.

ఆమెకు ప్రాణం పోయినంత పనయ్యింది. నిలువెత్తున వణికిపోతూ చప్పున తొలగిన బురఖాని ఎప్పట్లా కప్పుకుని అక్కణ్ణుంచి పరుగెట్టబోయింది.

"ఏయ్" ఇంకో యువకుడు ఆమె చేయిని గట్టిగా పట్టుకున్నాడు.

ముసుగు చాటునుండి అతడివైపు భయంగా చూసిందామె.

"నిజం చెప్పు? ఎక్కడనుంచి వస్తున్నావు? ఏం చేసి వస్తున్నావు? " గద్దించినట్టు అడిగాడు ఆ యువకుడు.

"నన్ను వదులు" సమాధానం చెప్పలేకపోయిందామె.

"నిజం చెప్తే వదిలేస్తాము" అన్నాడు అతడు.

"నన్ను వదులు" మళ్లీ అదేమాట అంటూ అతడిని విడిపించుకోబోయిందామె.

"కిలాడి" మరో యువకుడు అన్నాడు.

"అవును కేడీరాణిలా వుంది" ఇంకో యువకుడు అన్నాడు.

"నిజం చెప్పకపోతే పోలీస్ స్టేషన్‌కి పట్టిద్దాం" ఆమె చేయి పట్టుకున్న యువకుడు అన్నాడు.

పోలీస్‌స్టేషన్ అనగానే ఆమెకు ఏడుపు ముంచుకువచ్చింది.

"నేను ఎవ్వర్నీ ఏం చేయలేదు. నన్ను వదిలిపెట్టు" ఏడవసాగింది.

"మోసగాళ్ల వేషాలు ఇలాగే వుంటాయి. పదరా పోలీస్ స్టేషన్‌కి" ఇంకో యువకుడు

అతడిని ప్రేరేపించాడు.

"వద్దు... వద్దు" ఏడుస్తూనే అంది.

"మరి ఎవ్వర్ని ఏం చేశావో చెప్పు?" ఆమె చేతిని బిగ్గరగా నొక్కాడు అతడు.

ఆమె ఐదారు క్షణాలు మౌనంగా వుండిపోయి ఆ తర్వాత ఏడుస్తూనే నెమ్మదిగా చెప్పుకుపోయింది.

"నన్ను కొనుక్కున్న అరబ్బు షేకును చంపేసి వస్తున్నాను. అతడు నన్ను ఏదో చేయబోయాడు. అందుకే చంపేశాను. అదిగో ఆ దూరంగా కనబడుతుందే పెద్ద హోటలు.. అందులోనే చంపేశాను"

యువకులు ఆమెవైపు విస్మయంగానూ, అపనమ్మకంగానూ చూస్తుండిపోయారు.

"మాది హైదరాబాదు. మేము గరీబు వాళ్లం. అందుకే మా అబ్బు నన్ను అరబ్బు షేకుకు అమ్మేశాడు. దయచేసి నన్ను హైదరాబాద్ పంపించండి" అభ్యర్థనగా అందామె.

"సరే! నిన్ను తప్పకుండా హైదరాబాద్ పంపిస్తాం. మరి మా వెంట వస్తావా?" ఆమె చేయి వదిలేస్తూ అడిగాడు యువకుడు.

"మీ వెంట ఎక్కడికి రావాలి?" అడిగిందామె.

"మేము తీసుకెళ్లిన చోటికి"

"మీరు నన్నేం చేయరుకదా?"

"నీలాంటి వాళ్లని ఏదో చేసేంత మూర్ఖులం కాదు. మాకూ మానవత్వం ఉంది"

"సరే" ఒప్పుకుందామె. కాని ఆమె లోపల ఏదో అలజడి చెలరేగుతూ వాళ్లపట్ల అపనమ్మకాన్ని కలిగిస్తోంది.

ఆమె చదువుకోలేదు. పైగా సంఘంలో తిరగలేదు. అందుకే ఆత్మరక్షణ కోసం తను చేసిన హత్యను ఘోరమైన నేరంగా భావించుకుంటూ భయపడుతోంది.

మదమెక్కి... కొవ్వుబలిసి పరాయి దేశానికి చెందిన ఒక పురుషుడు, ఒక భారతీయ స్త్రీని కేవలం తన కోరికల కోసం కొనుగోలు చేయడం అనేది క్షమించరాని నేరమని ఆమెకు తెలీదు ఈ నేపథ్యంలో తను చేసిన హత్యకు శిక్ష వుండదని, సమాజంతో పాటుగా ప్రభుత్వం కూడా తనని హర్షిస్తుందని అంతకన్నా తెలీదు. కాబట్టి పోలీసువాళ్లు అంటేనే భయపడి ఆ యువకుల వెంట వెళ్లిపోయింది.

వాళ్లు ఆమెను ఒక మురికివాడలోకి తీసుకువెళ్లారు. ఆమెకు ఆ ప్రాంతం హైదరాబాదులో తాముVుండే మురికివాడకంటే అన్యాయంగా తోచింది. యువకుల్ని చూస్తుంటే బాగా డబ్బుగలవాళ్లలా వున్నారు. అందుకే ఆమె వాళ్లవైపు ఆశ్చర్యంగా చూస్తూ అడిగింది.

"మీరు ఈ ప్రాంతంలో వుంటారా?"

"ఏం వుండకూడదా?" నవ్వాడు ఒక యువకుడు. మిగిలిన ఇద్దరు యువకులు శృతికలిపారు.

ఆ నవ్వు ఆమెకు నచ్చలేదు. ఎంతో మృదువుగా నవ్వే తన భవానీశంకర్ నవ్వు ముందు వాళ్ల నవ్వు ముళ్లపొద ఒంటికి రాసుకుపోయినట్టుగా తోచింది. అందుకే ఇంకేం మాట్లాడలేదు. వెళ్తున్న ఆటో రిక్షా లోంచి బయటకు చూస్తూ మౌనంగా కూర్చుండిపోయింది.

"నేరుగా వెళ్లి కనిపించే పెంకుటింటి ముందు ఆపేయ్" ఆటో డ్రైవర్‌కి సూచించాడు ఒక యువకుడు.

ఆటోరిక్షా అక్కడికి వెళ్లి ఆగింది. ముగ్గురూ కలిసి బిల్లు చెల్లించారు. ఆటో రిక్షా వెళ్లిపోయింది.

"వాసనగా వుంది. వెళ్లి స్నానం చేయి" తన పక్కన కూర్చున్న యువకుడు చెప్పాడు.

"ముందు ఇంట్లోకి వెళ్దాం రండి" అంటూ డ్రైవర్ పక్కగా కూర్చుని వచ్చిన యువకుడు ముందుకు నడిచి తలుపులు తెరుచుకుని

నేరుగా లోపలికి వెళ్లాడు.

మిగతా ఇద్దరు యువకులతో కలిసి లోపలికి నడిచిందామె. అది ఇరుకుగా ఉన్న ఒక గది మాత్రమే. బయటనుండి ఇల్లు ఎంత పాతగా వుందో లోపల అంతకన్నా పాతదిగా వుంది.

నిల్చుని గదంతా ఒకసారి పరికించి చూసిందామె. ఒక పక్కగా చిన్న చెయిర్‌లో కుప్పగా వేయబడిన బట్టలు, ప్యాంట్లు, చొక్కాలు, లుంగీలు, తగిలించివున్న హ్యాంగర్లు, ఒక కిరోసిన్ స్టవ్వు, ఐదారు వంటపాత్రలు, ఒక ప్లాస్టిక్ నీళ్లబిందె, ఒక చాప, రెండు దుప్పట్లు, రెండు సూట్‌కేసులు ఇంతకుమించి ఆ గదిలో ఇంకేమీ లేవు.

"బ్యాచిలర్స్ ఇల్లు ఇలాగే వుంటుంది. ఆలస్యం చేయకుండా నువ్వెళ్లి స్నానం చేసిరా" ఇందాకటి యువకుడే మళ్లీ చెప్పాడు.

"అదిగో అదే బాత్‌రూమ్" ఆ గదికి మరోపక్కవున్న తలుపులు తెరిచి చూపించాడు ఇంకో యువకుడు.

"నాకు బట్టలు లేవు" అందామె.

"మా బట్టలు వేసుకో" చెప్తూనే తెల్లని జుబ్బా పైజామా తెచ్చి ఇచ్చాడు మరో యువకుడు.

ఆ బట్టలు తీసుకుని వెళ్లి స్నానం చేసి అలాగే తన బట్టల్ని కూడా పిండి ఆరవేసుకుని ఇరవై నిముషాల్లో ఇంట్లోకి వచ్చింది గౌసియా. అప్పటికి ఆ యువకులు వంట మొదలెట్టారు.

ఆమెవెళ్లి ఒక పక్కగా కూర్చుంది. షేకు గుర్తొచ్చాడు. అందాకా స్థిరంగా వున్న ఆమె మనసు షేకు గుర్తుకు రాగానే భయంతో కంపించి పోయింది.

"భయపడుతున్నావెందుకు? " గమనించి ఒక యువకుడు అడిగాడు.

"షేకు గుర్తొచ్చాడు" చెప్పింది.

"వాడిని చంపేశావుకదా? ఇంకెందుకు భయపడాలి? "

"దెయ్యమై వస్తాడేమో అన్పిస్తోంది"

ఆమె ఆ మాట అనగానే ఆ ముగ్గురు పగలబడి నవ్వారు. ఆమె వాళ్లని అదోలా చూసింది.

'నా భయం నాది. నేను భయపడుతుంటే వాళ్లకు నవ్వువస్తుంది ఏమిటి? ' మనసులో అనుకుంది.

"వాడు దెయ్యమై వచ్చినా నిజంగానే బతికి వచ్చినా మేము వుండగా వాడు నిన్నేం చేయలేడు. నీవు నీ గురించి చెప్పుకోగానే మాకు జాలివేసింది. అందుకే మరేం అడగకుండా నేరుగా నిన్ను మా ఇంటికి తీసుకువచ్చాం. ధైర్యంగా వుండు" ఉల్లిపాయలు తరుగుతున్న యువకుడు చెప్పాడు.

వాళ్లు ఆమెకు ఒక సమయంలో మంచి వాళ్లుగా ఒక సమయంలో నమ్మదగని వాళ్లుగా తోస్తున్నారు. మొదట వాళ్లపై దురభిప్రాయం ఏర్పడింది కాబట్టి వాళ్లు మంచి మాటలు మాట్లాడుతున్నా ఆమెకు నమ్మకం కుదరడంలేదు.

వాళ్లు తనని భయపెట్టడంవల్లే వాళ్ల వెంట రాగలిగింది. అక్కడ వుండటం తనకు ససేమిరా ఇష్టంలేదు. కాని ఎటు వెళ్లాలో తెలియని పరిస్థితి.

"నీ పేరేంటి? " అడిగాడు ఒక యువకుడు.

"గౌసియాబేగం"

"నా పేరు నవీన్, వీడి పేరు గిరిధర్, వాడి పేరు రాజేష్" పరిచయం చేసుకున్నాడు.

"నీకు వంటపని వచ్చా? " అడిగాడు రాజేష్.

"వచ్చు" చెప్పిందామె.

"అయితే ఇంకేం? ఎప్పటికీ మాదగ్గరే వుండిపో..." అన్నాడు నవీన్.

'వుండలేను' అన్నట్లుగా తల అడ్డంగా వూపిందామె.

"పాపంరా! రేపు పొద్దునే హైద్రాబాద్



రైలు ఎక్కిద్దాం" అన్నాడు గిరిధర్.

"ఈ రాత్రికి ఇక్కడే వుంటుందా? " అదో రకంగా కనుబొమ్మలు ఎగరేస్తూ అడిగాడు రాజేష్.

"వుండాల్సిందే కదా" కన్నుగీటాడు నవీన్.

గమనించిన గౌసియాబేగానికి సిక్త్‌సెన్స్ శంకించింది.

"ఇక్కడ్నుంచి ఎలాగైనాసరే పారిపోవాల్సిందే" మనసులో నిర్ణయించుకుంది.

"మాలో ఎవరు అందంగా వున్నారు గౌసియాబేగం? " అడిగాడు గిరిధర్.

"ముగ్గురూ బాగున్నారు" చెప్పిందామె. ఆ మాట ఆమె మనస్ఫూర్తిగా చెప్పలేదు. ఏదో ఒకటి అన్నట్లుగా చెప్పేసింది.

"అందరూ మనల్ని ఇలాగే అంటారు. అద్దం కూడా ఇలాగే చెప్తోంది. ఫొటోలు కూడా ఇలాగే చెప్తున్నాయి. మరి మనం వచ్చి ఏడాది కాలమైనా సినిమాల్లో కాదు గదా, కనీసం టీవీలో కూడా మంచి వేషం ఒక్కటి కూడా రాదేంట్రా? " నిరాశపడిపోతూ అన్నాడు రాజేష్.

"మనకూ వుంటుంది గుడ్‌టైమ్" అన్నాడు గిరిధర్.

అందాకా వాళ్ళని చదువుకోడానికి వేరే ప్రాంతం నుండి వచ్చిన విద్యార్థులు అనుకుందామె. కాని వాళ్ళు ఎవరూ అనేది ఆమెకు అర్థమైపోగానే ఆమెకు మరింత భయంవేసింది. ఎందుకంటే... ఎప్పుడైనా సినిమా చూడాలనిపించి తెల్సినవాళ్ళ ఇంటికి టీవీకి వెళ్తామంటేనే, తమ అబ్బా వెళ్ళనిచ్చేవాడు కాదు. "సినిమావాళ్ళు మంచివాళ్ళు కాదు. వాళ్ళ సినిమాలు కూడా మంచివికాదు. చూస్తే చెడిపోతారు" అని చెప్పేవాడు.

ఆ మాట తనలోనే కాదు, తన చెల్లెళ్ళల్లోనూ బలంగా నాటుకుపోయింది. అయినప్పటికీ తమకు సినిమాలంటే ఇష్టమే. కాని సినిమావాళ్ళంటేనే ఇష్టంలేదు. 'వీళ్ళను చెడ్డగా చెప్పిన అబ్బానే మంచివాడు కాదు' అనుకుంటూ కాసేపటితర్వాత నెమ్మదిగా లేచి నిలబడింది గౌసియాబేగం

"ఎక్కడికి? " అడిగాడు రాజేష్.

"నా బట్టలు ఆరాయో లేదో చూసివస్తాను"

"వెళ్ళువెళ్ళు" అన్నాడు రాజేష్.

ఆమె రెండో గుమ్మంవైపు నడిచింది. వెళ్తున్న ఆమెవైపు పెదవి కొరుక్కుంటూ చూసాడు గిరిధర్.

"భలే దొరికిందిరా! రాత్రి సొంతం ఎంజాయ్ చేసుకోవచ్చు" ఆమె వెళ్ళిపోగానే మిత్రులకి మాత్రమే వినబడేలా అన్నాడు నవీన్.

"మనం ఎంజాయ్ చేసుకున్న తర్వాత పుష్పావతక్కకు అప్పజెప్పేస్తే, మనకు అంతో ఇంతో ముట్టజెప్తుంది" అన్నాడు గిరిధర్.

"రేయ్... నీ బుర్ర బాగా పనిచేస్తుందిరా" మెచ్చుకోలుగా అన్నాడు రాజేష్.

బయటికి వెళ్ళిన గౌసియాబేగం, గుమ్మానికి సమీపంగా తాడుపై ఆరవేసిన తన బట్టల్ని త్వరగా ఆరే ఉద్దేశ్యంతో దూరందూరంగా జరుపుతున్నదల్లా... లోపల్నుంచి వినబడిన మాటలకు ఉలిక్కిపడింది.

వాళ్ళు ఇంకా ఆమె గురించే మాట్లాడుతున్నారు. వాళ్ళు చిన్న స్వరంతోనే మాట్లాడుతున్నప్పటికీ బయటకి స్పష్టంగా వినబడుతున్నాయి మాటలు.

'అబ్బా ఒకసారి అమ్మేసాడు. మళ్ళీ వీళ్ళు కూడా నన్ను అమ్ముకుంటారు? అల్లా... నన్ను ఆడపిల్లగా ఎందుకు పుట్టించావు?' గుండెలపై చేయివేస్కుని దైన్యంగా ఆకాశంకేసి చూస్తూ అనుకుంది గౌసియా.

"ఆ పిల్ల నిజంగా హత్య చేసిందంటే నమ్మబుద్ధికావడంలేదురా! చూస్తుంటేనేమో అమాయకురాలే! తనకు అన్యాయం జరుగుతున్నా తెగించేంత సాహసం కనబడ్డంలేదు. కాని హత్యచేసినట్టు రక్తపుమరకల్ని చూసాం? ? " అన్నాడు రాజేష్.

"అవన్నీ మనకు అనవసరం. మనక్కావల్సింది ఆడపిల్ల. కోరిక పుట్టినప్పుడల్లా కొనుక్కోలేక చచ్చిపోతున్నాం. ఇప్పుడా బాధ తీరింది అంతే చాలు" అన్నాడు గిరిధర్.

"ఇప్పుడైతే పుష్పావతక్కకు అప్పజెప్పాలన్నావు? " తాలింపు వేసాడు నవీన్.

"డబ్బుకోసం అప్పజెప్పాల్సిందే. అలాగే అవసరమైనపుడు మనదగ్గరకి పంపించాలని మాట్లాడుకోవాలి కూడా" అంటుంటేనే గిరిధర్ గొంతులో అదోకైపు.

"అబ్బ! ఇన్నాళ్ళకు మన సమస్యకు మార్గం దొరికింది. అటు డబ్బుకి డబ్బూ వస్తుంది. ఇటు సుఖానికి సుఖమూ దొరుకుతుంది. అదృష్టవంతులమేరా మనం" నవీన్ గొంతులో సంతోషం.

అప్పటికి గౌసియాబేగం భయంతో బిర్రబిగుసుకుపోయింది. ఇంకొక్కక్షణంకూడా తను అక్కడ వుండటం మంచిదికాదని భావిస్తూ, అప్రయత్నంగా గుమ్మంవైపు చూసింది.

వాళ్ళ మాటల్లో వాళ్ళవున్నారు. ఇప్పట్లో

వాళ్ళు వెలుపలికి వచ్చే సూచనలు కనబడ్డం లేదు.

ఆమె ఇక ఏమాత్రం జాప్యం చేయలేదు.

అక్కడ్నుంచి పారిపోయేందుకు తనకు అనువైన మార్గం ఏమైనా దొరుకుతుందా అన్నట్లుగా అటూఇటూ చూసింది. తక్కువ వైశాల్యంలో వున్న ఖాళీ స్థలానికి ప్రహారి గోడ మాత్రం చాలా ఎత్తుగా వుంది. బాగా ప్రయత్నిస్తే ఎక్కిదుమకవచ్చు. కాని ఆ ప్రయత్నించే సమయం తనకు లేదు.

చేతులు నలుపుకుంటూ బాత్‌రూమ్‌వైపు తిరిగింది. అక్కడోచోట మూతవున్న నీళ్ళ డ్రమ్ము ఒకటి పెట్టబడివుంది. దానిమీదకు మెల్లగా ఎక్కి, ప్రహారిగోడమీదకు ఎక్క వచ్చు.

"అల్లా! నన్ను రక్షించు" మనసులో అనుకుంటూ, మరోసారి గుమ్మంవైపు చూసి వాళ్ళు ఎవ్వరూ తనని గమనించడం లేదని నిర్ధారించుకుని, వడివడిగా డ్రమ్ముదగ్గరకి వెళ్ళి, చప్పుడు చేయకుండా డ్రమ్ము మీదకి ఎక్కి, అట్నుంచి ప్రహారీగోడమీదకి జాగ్రత్తగా ఎక్కి, క్షణంకూడా ఆలస్యం చేయకుండా అవతలకి దూకింది.

ఆ విసురుకి శరీరమంతా ఒక్కసారిగా కదిలింది. తోడుగా అరికాళ్ళు పగిలినట్టుగా అన్పించడమే కాకుండా, మోకాళ్ళ చిప్పలు పగిలిపోయాయి.

"మా..." బాధగా అంటూనే లేచి దులుపుకుంటూ వేగంగా ముందుకు నడిచింది.

ఆ ప్రాంతంలో ఎక్కువగా వేశ్యలు వుంటారు. కాబట్టి సాయంకాలం కాగానే ఆ ప్రాంతం విటులతో నిండిపోతుంది. అదేమీ ఆమెకు తెలియదు. కేవలం తనను ఆ యువకులు గమనించి వెంబడిస్తున్నారేమో నన్న భయంతో, వుండుండీ వెనక్కి చూస్తూ ముందుకుసాగిపోతోంది.

కాని ఒకస్త్రీ ఆమెను గమనించి వెంబడిస్తోంది. అది కూడా గౌసియా పసిగట్ట లేదు. నేరుగా ముందుకు నడిచి అక్కడున్న ఒక దేవాలయంలోకి వెళ్ళిపోయింది.

దేవాలయంలో స్త్రీ పురుషులు ఇరువురూ చెరోవైపు గుంపులుగా కూర్చుని భజనచేస్తున్నారు. వెళ్ళి స్త్రీల గుంపులో కూర్చుంది గౌసియాబేగం. వెంబడించిన స్త్రీ కూడా వచ్చి గౌసియా పక్కనే కూర్చుంది.

"పాపా! నీ పేరేంటి?" కాసేపటి తర్వాత అడిగింది ఆ స్త్రీ.

"గౌ..." తన పేరు చెప్పబోతూ ఆగిపోయింది. ఎందుకంటే 'ముస్లింలు దేవాలయాల్లోకి రాకూడదు అనే నిబంధనగాని, ఆచారంగాని వుందేమో? అన్న ఆలోచన మనసులో మెదిలింది. అందుకే తడబడుతూనే మరో పేరు చెప్పుకుంది.

"గౌ...గౌతమి"

"మంచి పేరు. ఈ వీధిలోకి కొత్తగా వచ్చారా?"

"అవును"

"మీ ఇంట్లో ఎవరెవరు వుంటారు?" ఆరాతీస్తున్నట్టుగా అడిగింది.

"అందరమూ"

"అంటే... మీ నాన్నగారు కూడానా?"

"ఆ!" అవును అన్నట్టుగా తల ఊపింది గౌసియా.

నిజానికి ఆ ప్రాంతంలో సంసారకుటుంబాలు వందకు ఐదు మాత్రమే వున్నాయి. మిగతా అందరూ వేశ్యలు. అక్కడున్న సంసారకుటుంబాలు ఎంతో దీనస్థితిలో వున్నాయి. కాని గౌసియాబేగం ఆమె కంటికి కొద్దో గొప్పో వున్నదానిలా కనబడ్డమే కాదు, తనలాంటి "అక్కా" దగ్గర్నుండి పారిపోయి వస్తున్నదానిలా కనబడింది. అందుకే వెంబడించింది.

"మీ నాన్నగారు ఏం చేస్తుంటారు?" కావాలనే అడిగింది.

"చాయ్ బండి అమ్ముతాడు"

"ఎక్కడ?"

సమాధానం కోసం గౌసియా చిక్కులో పడిపోయింది.

"ఇ... ఇక్కడే"

"నిజమే చెప్తున్నావా?" గొంతు మరీ తగ్గించి ఆ వెంటనే సూటిగా అడిగిందామె.

భీతిల్లి చూసింది గౌసియా.

"భయపడొద్దు పాపా! నేను ఇక్కడ ఒక స్కూలు నడుపుతున్నాను. ఆ స్కూల్లో ఇళ్ళ నుండి పారిపోయివచ్చిన పిల్లలు, అనాథ పిల్లలు, బలవంతంగా అపహరింపబడి తప్పించుకున్న పిల్లలు చాలా మందే వుంటారు" చెప్పి గౌసియావైపు పరిశీలనగా చూసిందామె.

గౌసియాలో ఏదో ఆశ క్రమంగా కళ్ళల్లోంచి ప్రస్ఫుటం అవ్వసాగింది.

"ఇప్పుడు చెప్పు... మీ కుటుంబం ఎక్కడ వుంటుంది?" అడిగింది ఆమె.

"నేను మీ వెంట రావొచ్చా?" నెమ్మదిగా అడిగింది గౌసియా.

"తప్పకుండా" కళ్ళను ఒకసారి మృదువుగా ఆర్పి తీసిందామె.

అప్పటికి భజన పూర్తయ్యింది. భక్తులు లేచి వెళ్ళి గుడిలోపల కొలువైన మహిషాసురమర్దినికి దణ్ణం పెట్టుకుని, తీర్థప్రసాదాలు పుచ్చుకుంటున్నారు. ఆమెతోపాటుగా గౌసియా కూడా లేచివెళ్ళి దేవతకు దణ్ణంపెట్టుకుని తీర్థప్రసాదాలు తీసుకుంది.

"ఇక వెళ్దామా?" అడిగింది ఆమె.

"వెళ్దాం" అన్నట్టుగా తలాడించింది గౌసియా.

ఆమె గౌసియాని తీసుకుని వెంటనే ముందుకు నడిచింది. భక్తులు కూడా ఒక్కొక్కరుగా వెళ్ళిపోతున్నారు. వాళ్ళంతా వేరే ప్రాంతాలకి చెందినవాళ్ళు. మహిషాసురమర్దిని గుడి అక్కడ వున్నందున పవిత్రదినాల్లో మాత్రమే అక్కడికి వచ్చి భజనలు చేస్తుంటారు. అది వేశ్యలు వుండే ప్రాంతమైనందున చీకటిపడకమునుపే భజన కార్యక్రమాల్ని ముగించుకుని వెళ్ళిపోతుంటారు. అదేమీ గౌసియాబేగానికి తెలియదు. కాబట్టి వెళ్తూ ఆమెతో ఇలా అంది.

"మా దగ్గర చీకటిపడేవరకు భజనచేస్తారు"

"ఇక్కడ మాత్రం చీకటి పడకుండానే వెళ్ళిపోతారు" అందామె.

"రోజూ భజన చేస్తారా?" అడిగింది గౌసియ.

"కాదు. కొన్ని పుణ్యదినాల్లో మాత్రమే ఇక్కడ భజనచేస్తారు. ఈరోజు శ్రావణమాసపు మొదటిరోజు" ఆమె చెప్తుంటేనే కొంచెం దూరంలో వస్తూ కనిపించాడు రాజేష్.

అతడ్ని చూడగానే గౌసియా వణికిపోయింది. అతడి కంట్లోపడకూడదన్నట్లుగా ఆమెచాటుకి మెల్లగా నక్కబోయింది. అంతలోపే రాజేష్ దృష్టి గౌసియాను గమనించింది.

"ఎందుకు అలా భయపడుతున్నావు?" ఆమె కూడా గౌసియాను గమనించింది.

"వాడు...వాడు" అదురుతున్న పెదిమలతో రాజేష్‌ను చూపించింది.

"ఏంచేసాడు వాడు?" నవ్విందామె.

"వాడు నన్ను పట్టుకుపోతాడేమో..." భయంతో అక్కడే ఆగిపోతూ ఆమె చేతుల్ని బిగ్గరగా పట్టుకుంది గౌసియ.

"వాడు నిన్నేంచేయడు" గౌసియా భుజం చరిచిందామె.

"ఏంటక్కా? మా గౌసియాను నీవు తీసుకెళ్ళిపోతున్నావు?" వాళ్ళకు దగ్గరగా రాగానే అడిగాడు రాజేష్.

"గౌసియా?? గౌతమి??" గౌసియా వైపు ప్రశ్నార్థకంగా చూసిందామె.

"గౌతమి కాదు, గౌసియాబేగం! రాజ్‌బజార్ పబ్లిక్‌పార్క్‌లో ఏడుస్తూ కనబడితే జాలిపడి తీసుకువచ్చాం. పాపం... హైద్రాబాద్‌నుండి వచ్చిందట. ఇక్కడ ఎవ్వరూ కూడా లేరట" ఆమెకు చెప్పి, "మాకు తెలియకుండా పుష్పావతక్కను ఎలా కల్సుకున్నావు? అక్క దగ్గరకి రేపు వెళ్దువుగాని, ఇంటికి వెళ్దాంరా" ప్రేమగా పిలుస్తూ

గౌసియా చేయి పట్టుకోబోయాడు రాజేష్.

ఆమె ఎవరో తెలియగానే గౌసియాబేగానికి ఒక్కసారిగా తనని ఎవరో సమూలంగా కబళించివేసిన భావన కలిగింది.

"హా..." హడలిపోతూ ఆ ఇద్దర్నీ చూసింది.

"అదేంటి పాపా?" ఆమెలో కొండంత ప్రేమ.

పట్టించుకోలేదు గౌసియా. అదే తడవుగా వెనుతిరిగి వేగంగా పరుగెట్టసాగింది.

"అయ్యో... అయ్యో" పుష్పావతి గుండెలు బాదుకుంటుంటేనే- "ఏయ్... పోరీ" అంటూ వెనకే పరుగెట్టాడు రాజేష్.



సమయం రాత్రి పదిగంటలు!

హైద్రాబాద్‌లో గౌసియా వాళ్ళ వీధి భయంకరంగా వుంది. హిందూ, ముస్లీంలు ఒకర్ని ఒకరు కొట్టుకుంటున్నారు. కత్తిపోట్లు జరుగుతున్నాయి. అరుపులతో కేకలతో ఆ ప్రాంతం ఒకవైపు దద్దరిల్లిపోతుంటే, మరోవైపు నెత్తుటి చినుకులు ఆ నేలను తడిపేస్తున్నాయి.

కొందరు ఇళ్ళల్లోచేరి గడియలు వేసుకున్నారు. మరికొందరు ఇళ్ళు వదిలి పారిపోతున్నారు.

తలుపుల్ని విరగ్గొట్టి లోపల వున్నవాళ్ళను బయటికి లాగి స్త్రీలు, పసిపిల్లలు... తేడా లేకుండా చితకబాదడం, విచక్షణారహితంగా ప్రవర్తిస్తుండటం, వస్తువుల్ని ధ్వంసం చేయడం, అంతా ఒక యుద్ధభూమిని తలపించే వాతావరణం!

వున్నట్టుండి సైరన్ మోతలతో సర్రున దూసుకువచ్చాయి పోలీసు వ్యాన్లు. తుపాకీలు పట్టుకుని అప్రమత్తులౌతూ... వ్యాన్లు ఆగీ ఆగకుండానే కిందికి దూకారు పోలీసులు.

పోలీసుల్ని గమనించీ కూడా ఎవ్వరూ చెదిరిపోలేదు. ఎవ్వరూ బెదిరిపోలేదు.

"ఆగండి" మైకులోంచి ఐదారుసార్లు హెచ్చరికగా చెప్పారు పోలీసులు. కాని వాళ్ళను పట్టించుకునే నాథుడే కరువయ్యాడు అక్కడ!

పోలీసులు ఇక ఆలస్యం చేయలేదు. నీళ్ళ పైపుల్ని ఎక్కుపెట్టి, నీళ్ళని ఎగజిమ్ముతూ, జనాల్ని చెదరగొట్టే ప్రయత్నం చేసారు.

కొంతవరకు జనాలు చెదిరిపోయారు. మిగతా వాళ్ళు మాత్రం తొణకడంలేదు, బెణకడంలేదు. లాభం లేదనుకున్న పోలీసులు మరి కాసేపటికి గాలిలోకి కాల్పులు జరిపారు. ఊహు... అయినప్పటికీ విధ్వంసకారులు చెక్కుచెదరలేదు.

పోలీసులు ఈసార లాఠీచార్జీ జరిపారు. ఆ ప్రయత్నంలో కొందరు విధ్వంసకారులు పోలీసుల్నే ఎగబడికొట్టారు. దీంతో పోలీసు యంత్రాంగం మరింత అప్రమత్తమౌతూ నేరుగా కాల్పులు జరిపేందుకు తుపాకుల్ని ఎక్కుపెట్టింది.

"ఆగండీ. లేదంటే సూటిగా కాల్పులు జరుపుతాం. ప్రాణాలు పోతాయి" ఒకటి రెండుసార్లు హెచ్చరించారు పోలీసులు.

అప్పటికి విధ్వంసకారులు పూర్తిగా చెదిరిపోయారు. ఆ ప్రాంతం అంతా యుద్ధం తర్వాతి భయంకర నిశ్శబ్దంతో నిండిపో

యింది. ఒకవైపు తిరగబడుతున్న వస్తువులు, మరోవైపు చెల్లాచెదురుగా పడివున్న చెప్పులు... కర్రలు... వస్తువులు... అక్కడక్కడా పడివున్న కొన్ని శరీరాలు చూస్తుంటే బలహీనుల గుండె ఆగిపోతుందేమో అన్నట్టుగావుంది పరిస్థితి.

పోలీసులు అంతా కలియజూస్తున్నారు.

"సర్..." అంటూ నెమ్మదిగా ఒక ఇంటి చాటునుండి వచ్చారు కొందరు ముస్లీం యువకులు.

"మా సాయిబును హిందువుల కుర్రాడు అకారణంగా చంపేసాడు. చనిపోయిన సాయిబు బాధ్యతలుగల వ్యక్తి. ఇప్పుడా కుటుంబానికి దిక్కు ఎవ్వరూలేరు. ఇందుకు మీరేం చేస్తారో మీ ఇష్టం" రాగానే పొట్టిగా, లావుగా వున్న ఒక వ్యక్తి చెప్పాడు.

అదే సమయంలో మరో ఇంటి చాటు నుండి వచ్చింది, బాలస్వామి అతడి అనుచరబృందం.

"మా కుర్రాడు వాళ్ళ సాయిబును అందరూ చూస్తుండగా కత్తితో పొడిచి చంపేసిన మాట నిజమే! కాని అందుకు కారణం వుంది. చనిపోయిన సాయిబు తన పెద్దకూతురు గౌసియాను అరబ్బుషేకుకు మూడు లక్షల రూపాయలకు అమ్ముకున్నాడు. ఇది తెల్సి మానవత్వం వున్న మనిషిగా, మనసులేని ఆ మనిషిని చంపేసాడు. మతంతో సంబంధంలేని ఈ హత్య, మతకలహాలకి దారితీయడం నిజంగా దురదృష్టకరం" అన్నాడు బాలస్వామి.

నిజానికి అతడి మనసులో... సమయం దొరికింది కాబట్టి ముస్లింలను అందర్నీ చంపేయాలన్నంత కసివుంది.

పోలీసులు ఇరువర్గాల్ని పరిశీలించి చూసారు. ఇరువురూ గొడవలో పాలుపంచుకోవడం వల్ల రేగిపోయి కనబడుతున్నారు.

"హత్య చేసిన కుర్రాడు ఏడి? " అడిగేడు ఒక పోలీసు.

"భవానీశంకర్! పారిపోయాడు" చెప్పాడు బాలస్వామి.

అంతలోనే అక్కడ పడివున్న శరీరాలవద్దకు బిగ్గరగా రోదిస్తూ పరుగెట్టుకువచ్చారు హిందూ ముస్లీంలు. తమవాళ్ళ నిర్జీవ శరీరాల్ని చూసుకోగానే వాళ్ళ దుఃఖం మరింత పెరిగింది.

"ఆ కుర్రాడి ఇల్లు ఏది? " అడిగాడు ఇంకోపోలీసు.

"అదే" చూపించాడు బాలస్వామి.

కొందరు పోలీసులు అక్కడికి నడిచారు. లోపల మౌనంగా రోదిస్తూ కూర్చునివుంది లక్ష్మీదేవమ్మ. అక్కడే లేవలేని స్థితిలో పడుకుని, తను కూడా ఏడుస్తున్నాడు గోపాలయ్య.

పోలీసుల్ని చూడగానే అతడు లేచి కూర్చోబోయాడు. కాని అతడికి చేతకాలేదు. లక్ష్మీదేవమ్మ మాత్రం లేచి నిలబడి చేతులు జోడించింది. ఆమె కళ్ళ వెంబడి కన్నీళ్ళు ధారాపాతమౌతున్నాయి.

"సారూ... మా కొడుకు. కనబడ్డంలేదు. వాడు అసలు వున్నాడో లేక ఈ నా కొడుకులు చంపి ఎక్కడైనా పడవేసారో తెలీట్లేదు"

"ఏయ్..." బయటే నిలబడివున్న యువకులు, లక్ష్మీదేవమ్మ మాటలు వినగానే సహించలేనట్టుగా ఒక్కుమ్మడిగా అరిచారు.

వాళ్ళను వారిస్తున్నట్టుగా తన లాఠీని తలుపుకేసి బాదాడు ఒక పోలీసు.

"అవున్సార్! వాడి విషయంలో మాకు అనుమానంగా వుంది. వాడు మాకు ఒక్కగానొక్కకొడుకు. వాడు లేకపోతే మేము బతికి లాభంలేదు" గోపాలయ్య కళ్ళనీళ్ళు తుడ్చుకున్నాడు.

"మీరు వాడి విషయంలో ఏమాత్రం జాప్యం చేయకుండా, వెంటనే ఏ సంగతి తెల్పెయ్యాలి" పోలీసుల వెనకగా నిలబడివున్న బాలస్వామి అన్నాడు.

"నీవు నోర్మూసుకోవయ్యా" మరో పోలీసు బాలస్వామిని వారిస్తుంటేనే, బయటనుండి వెహికిల్స్ వస్తున్న శబ్దం వినబడింది.

అందరూ అటుకేసి చూసారు. ఓ రెండు అంబాసిడర్‌కార్లు వచ్చి ఒకపక్కగా ఆగగానే, అందులోంచి ముస్లీం నాయకులు దిగారు. ఆ వెంటనే వచ్చిన మరో రెండు టాటా సుమోల్లోంచి హిందూ నాయకులు దిగారు. వారు ఇరువురూ చుట్టూ మూగిన జనాల్ని పరామర్శించసాగారు.

పోలీసులు మాత్రం బయటకు వెళ్ళలేదు. ప్రశ్నలతో గోపాలయ్య దంపతుల్ని ఉక్కిరి బిక్కిరిచేయసాగారు.

"అంటే... మీ కొడుకు ముందుగానే ఆ అమ్మాయిని కాపాడే విషయమై మీతో చర్చించాడన్నమాట" వాళ్ళ సమాధానాల్ని అన్నీ విన్నాక అన్నాడు ఒక పోలీసు.

"అవున్సారు" అంది లక్ష్మీదేవమ్మ.

"అమ్మాయిని అమ్మే విషయం మీకు తెలియదు. కానీ మీకొడుక్కి తెల్సింది. ఎలా తెల్సిందంటారు" అదే పోలీసు అడిగాడు.

"తెలీదుసారూ" అంది లక్ష్మీదేవమ్మ.

పోలీసులు ఇంకేం అడగలేదు. బయటకి నడిచి... అట్నుంచి సాయిబు ఇంటివైపు అడుగులు వేసారు. పోలీసులు వెళ్ళేసరికి సాయిబు భార్య ఖతీజాబీ సొమ్మసిల్లిపడిపోయివుంది కొంచెం పెద్దగా కన్పిస్తున్న ముగ్గురు పిల్లలు తండ్రి శవంచుట్టూ కూర్చుని వున్నారు. బాగా ఏడ్చినందున వాళ్ళ కళ్ళు ఉబ్బిపోయివున్నాయి.

చంటిపాప నిద్రపోతోంది. ఇంకో పిల్ల ఆడుకుంటోంది. ఒక పక్కగా కూర్చునివున్న మరో ఇద్దరు పిల్లలు మాత్రం పోలీసుల్ని చూసి చటుక్కున లేచి నిలబడి,

"మా అమ్మ కూడా చచ్చిపోయింది"

"అవున్సారూ... అమ్మ కూడా చచ్చిపోయింది"

చావంటే ఏదో అబ్బురమైన విషయం అన్నట్లుగా కళ్ళింతచేసి ఒకరితర్వాత ఒకరు చెప్పారు ఆ పిల్లలు.

పోలీసులు సాయిబు శవాన్ని పరిశీలనగా చూసారు. తర్వాత ఆ ఇంటి పరిసరాల్ని అంతా ఒకసారి పరికించి చూసి, ఆ తర్వాత తండ్రి పక్కలో కూర్చున్న పిల్లల వైపు చూస్తూ అడిగారు.

"బేబీ... మీ అక్కను ఏంచేశారు? "

"మా అబ్బా అమ్మేసాడు" ఒక పిల్ల వెంటనే చెప్పింది.

"కాదుకాదు" అంటూ ఆ పిల్లను మెల్లగా గిల్లి, "మా ఆపా మాకు చెప్పకుండా ఎక్కడికో వెళ్ళిపోయింది" మరోపిల్ల తెలివిగా చెప్పింది.

"అది కూడా కాదు, మా ఆపాకు పెళ్ళయి వెళ్ళిపోయింది" ఇందాక వాళ్ళమ్మ గురించి మాట్లాడిన పిల్లల్లో ఒక పిల్ల అందుకుంది.

"ఎవ్వరితో పెళ్ళయ్యింది" ఆ పిల్ల దగ్గరకి వెళ్ళి, కాసింత వంగి మృదువుగా అడిగాడు ఓ పోలీసు.

"సైతాన్‌తో" ముఖం చిట్లించింది ఆ పిల్ల.

అప్పటికి ఖతీజాబీని ఎమర్జెన్సీ డాక్టరు పరిశీలిస్తున్నాడు.

"డాక్టర్... ఆమె త్వరగా కోలుకునేలా చూడండి" చెప్తూ పోలీసులు బయటకి నడిచారు.

## గురువారం

ఉదయం ఏడు గంటలు కావొస్తోంది. భానుడి లేత కిరణాలు ముంబాయి నగరాన్ని మృదువుగా తడుముతున్నాయి. పొద్దస్తమానం రద్దీగా వుండే రోడ్డు, ఉదయంవేళ కాబట్టి అరకొర వాహనాలతో బోసిగా కనబడుతోంది.

ఆ రోడ్డుకు ఒకపక్కగా వున్న కుప్పతొట్టిలో దగ్గరగా ఒదిగిపడుకుని వుంది గౌసియాబేగం. పైకి లేవాలంటేనే ఆమెకు భయంగా వుంది. తన కోసం ఆ దరిదాపు

ల్లోనే రాజేష్ మాటువేసుకుని వున్నాడేమో అన్న అనుమానం ఆమెను బలంగా పీడి స్తోంది.

వున్నట్టుండి గాలిదుమారం క్రమంగా ఆరంభమైంది. కుప్పతొట్టిలోని చెత్తాచె దారం గాలి విసురుకు పైకిలేచి గౌసియాపై చెల్లాచెదురుగా పడసాగింది. బిక్కుబిక్కు మంటూ పడుకునివున్న ఆమె మరింత దగ్గ రగా ముడుచుకుని, బిగ్గరగా కళ్ళు మూసు కుంది.

అదే సమయంలో ఎవరో స్త్రీ బుట్టతో చెత్తతీసుకువచ్చి తొట్టిలోకి ఎత్తిపోసింది. ఆ చెత్తలో అగ్గికణికలు కొన్ని వున్నందున, అవి గౌసియా శరీరంపై వచ్చి పడగానే... ఒక్కసారిగా ఉలిక్కిపడి... "మా" కెవ్వున అరుస్తూ లేచి కూర్చుంది.

చెత్త పోస్తున్న స్త్రీ కూడా ఉలికిపాటుగా గౌసియాను చూస్తూ అలాగే బుట్టను వది లేసింది.

ఆమెను బిక్కచచ్చినట్టుగా చూస్తూ, అలాగే కూర్చుండిపోయిన గౌసియాబేగం జుబ్బా ఒకవైపు క్రమంగా కాలిపోతోంది.

"ఎ...ఎవర్నువ్వు?" కసిరింపుగా అడి గింది ఆమె.

నిలువెత్తున చెత్తపడివున్న గౌసియా, అదేమీ పట్టించుకోకుండా ఆమెను అలాగే చూస్తోంది.

"ఏ జన్మలో ఏం పాపం చేసిందో? చిన్న వయసులో మతితప్పి తిరుగుతోంది" అను కుంటూ వెనుతిరిగి వెళ్ళిపోయిందామె.

"మంచి ఆలోచన! నన్ను అందరూ పిచ్చిది అనుకోవాలి" వెళ్ళిపోతున్న ఆమెనే చూస్తూ అనుకుంటూ, మెల్లగా కుప్పతొట్టి లోంచి కిందికిదిగి, ఎటువైపు వెళ్ళాలా అన్న ట్టుగా అటూఇటూ చూసింది.

ఎడంగా ఒక సందు కనబడింది. ఆ దారెంబడి క్రిస్టియన్ సన్యాసినులు గుంపు లుగా వెళ్తూ కనబడుతున్నారు. అటువైపు వెళ్ళడం ఉచితం అనుకుంటూ నెమ్మదిగా అటువైపు నడిచింది గౌసియా.

వుండుండీ వెళ్తున్న జనాలు ఎవ్వరూ ఆమెను పట్టించుకోవడంలేదు. గౌసియా మాత్రం అందర్నీ పరికించి చూస్తోంది. తనకోసం రాజేష్ వాళ్ళు ఎవరైనా వస్తారే మోనన్న భయం ఆమెను ఇంకా వదిలిపెట్ట నేలేదు.

నిన్న ఎప్పుడో అరబ్బుషేకు తినిపించిన తిండి. మళ్ళీ తిననేలేదు. కడుపులో ప్రేవులు ఆకలికోసం గోలచేస్తున్నాయి.

"అమ్మా..." తెలుగులో ఉచ్చరించు కుంటూ బాధగా కడుపు పట్టుకోబోయి, కాలుతున్న జుబ్బాను అప్పుడు చూసుకుంది గౌసియా.

వెంటనే కాలుతున్నచోటున గుడ్డను నులుముకుని, రోడ్డుదాటి సందువైపు నడి చింది. అక్కడ ఓ వేపచెట్టుకింద స్కూల్ బ్యాగులు తగిలించుకుని నిలబడివున్నారు ఐదారుగురు స్కూల్‌పిల్లలు. వాళ్ళు గౌసి యాను చూడగానే "ఏ...ఏ... హే... హే..." అని వెక్కిరిస్తూ వెంబడించసా గారు.

"ఏయ్" వెళ్ళేదల్లా నిల్చుని గదమాయిం చింది గౌసియా. ఆమె గదమాయింపు ఆ పిల్లలకు ఆటవిడుపులా అయ్యింది.

"హూహూ... హేహే..." ఈసారి అదోలా కావాలని నవ్వుతూ, గెంతులు వేస్తూ గౌసియాను చుట్టుముట్టారు.

"నా దగ్గరకి వస్తే కొడతాను" అంటూనే చెయ్యెత్తింది గౌసియా.

పిల్లలు వెంటనే దూరంగా పరుగెట్టి, అక్కడ కుప్పగా పోసివున్న కంకరరాళ్ళను తీసుకుని గౌసియామీదకు విసరసాగారు.

గౌసియా ఎందుకైనా మంచిది అన్న ట్టుగా అక్కడ్నుంచి ముందుకు పరుగుతీ సింది. ఆ పిల్లలు తరమసాగారు.

వేగంగా పరుగెట్టుకువెళ్ళిన గౌసియా తనకు తెలియకుండానే అక్కడున్న చర్చిలోకి దూసుకుపోయింది.

సన్యాసినులు అంతా వరుసలుగా నిల్చుని పవిత్రస్మరణ చేసుకుంటున్నారు. వెళ్ళి వాళ్ళ మధ్యగా నిల్చోవాలనుకుని, అంత లోనే తనను ఒకసారి పరికించి చూసుకుని, అడుగుల్ని వెనక్కి వేసింది గౌసియా.

ఆమె చర్చి లోపలికి వెళ్ళడంతో పిల్లలు అక్కడ్నుంచి వెళ్ళిపోయారు. అయినప్పటికీ ఆ పిల్లలు అక్కడెక్కడో వుండివుంటారన్న భయంతో గుండెలమీద చేయి వేసుకుని, మెల్లగా అడుగులో అడుగువేస్తూ బయటికి నడిచింది గౌసియా. కానీ ఆమెకు అక్క డ్నుంచి వెళ్ళాలనిపించలేదు. అక్కడి వాతా వరణం ప్రశాంతతని కలిగిస్తుంటే అక్కడే ఒకపక్కగా కూర్చుండిపోయింది.

కాసేపటి తర్వాత సన్యాసినులు ఒక్కొ క్కరూ బయటికి రాసాగారు. కొందరు అక్కడక్కడా గుంపులుగా నిలబడిపోతు న్నారు. మరికొందరు వెళ్ళిపోతున్నారు.

"నేను ఎట్లాగయినా హైద్రాబాదు వెళ్ళాలి. వీళ్ళల్లో ఎవ్వరైనా సహాయం చేస్తే బాగుణ్ణు" అనుకుంటూ ఒక గుంపు దగ్గరికి వెళ్ళింది గౌసియా.

వాళ్ళు గౌసియాను చూడగానే పిచ్చిది అన్నట్టుగా భయంగా దూరం జరిగారు.

"నేను పిచ్చిదాన్నికాదు" వెంటనే చెప్పు కుంది గౌసియా.

వాళ్ళు కనుబొమలు ముడిచి అర్థంకాన ట్టుగా చూశారు.

"నేను హైద్రాబాద్ వెళ్ళాలి. నన్ను రైలు ఎక్కించండి" అభ్యర్ధనగా అడిగింది.

వాళ్ళు గౌసియాను అలాగే చూస్తు న్నారు.

"నేను పిచ్చిదాన్ని కాదు. నన్ను నమ్మండి" అంటూ తనమీది చెత్తాచెదా రాన్ని వెంటనే దులుపుకోసాగింది గౌసియా.

ఆ చెత్త వాళ్ళమీదికి ఎగరడంతో వాళ్ళు ఆమెను అలాగే చూస్తూ దూరం జరిగారు.

"నాపేరు గౌసియాబేగం. నన్ను ముగ్గురు కుర్రాళ్ళు ఇక్కడికి బలవంతంగా తీసుకువచ్చారు. నేను వాళ్ళను తప్పించు కుని వచ్చాను" అన్న నిజాన్ని చెప్పలేకపో యింది గౌసియా.

అంతలో చర్చి ఫాదర్ వచ్చారు అక్కడికి.

"ఫాదర్... ఈ అమ్మాయి..." ఒక సన్యాసిని గౌసియావైపు చూపించింది.

ఫాదర్ గౌసియావైపు పరిశీలనగా చూసాడు.

"నాపేరు గౌసియాబేగం... నన్ను ముగ్గురు కుర్రాళ్ళు ఇక్కడికి తీసుకువ చ్చారు. వాళ్ళు చెడ్డవాళ్ళు. వాళ్ళను తప్పిం చుకుని వచ్చేసాను. నన్ను హైద్రాబాద్ పంపించండి" ఫాదర్‌తో తిరిగి తనగురించి చెప్పుకుంటూ చేతులు జోడించింది గౌసి యాబేగం.

"తప్పించుకుని ఎన్నిరోజులయ్యింది?" అడిగాడు ఫాదర్.

"రాత్రే... తప్పించుకుని అక్కడ చెత్తకుం డీలో దాక్కున్నాను"

"ఐ సీ" అంటూ గౌసియాను ఒకసారి ఆపాదమస్తకం పరిశీలించి, "హైద్రాబాద్‌లో మీ నాన్నగారి చిరునామా ఏంటి?" అడి గాడు ఫాదర్.

"వద్దు. మా అబ్బా దగ్గరికి పంపించొద్దు. మా అబ్బా దుర్మార్గుడు" భయంగా అంది గౌసియా.

ఫాదర్ ఐదారుక్షణాలు గౌసియావైపు చిత్రంగా చూసి ఆ తర్వాత సన్యాసి నులవైపు చూస్తూ... "ఈ అమ్మాయిని మీవెంట తీసుకెళ్ళండి" చెప్పాడు.

'సరే' అన్నట్టుగా తలాడించారు సన్యాసి నులు.

"నేను మధ్యాహ్న సమయానికి వస్తాను" సన్యాసినులకే చెప్పి వెళ్ళిపోయాడు ఫాదర్.

సన్యాసినుల వెంట మరియా ఆశ్రమానికి

వెళ్ళింది గౌసియా.

అక్కడ గౌసియాకు వాళ్ళు కొత్తబట్టలు ఇచ్చారు. స్నానంచేసి వాటిని ధరించివచ్చింది గౌసియా. తర్వాత వాళ్ళతో పాటుగా అల్పాహారం తీసుకుంది. అప్పుడు కడుపు చల్లబడడంతో క్రైస్తవ సన్యాసినులు ఆమెకంటికి దేవతల్లా కనబడ్డారు.

"శుక్రియా" ఎద లోతుల్లోంచి చెప్పుకుంది.

"ఫరవాలేదు... కూర్చో" ఒక సన్యాసిని గౌసియా చేయి పట్టుకుంది.

కూర్చుంది గౌసియా. సన్యాసిని గౌసియా ముఖంలోకి సూటిగా చూస్తూ... "నీవు నిజాయితీగా వున్నది వున్నట్టుగా చెప్పాలి. మేం నీకు తప్పకుండా సహాయం చేస్తాం. ఆ ప్రభువు కూడా నీపై తన చల్లని చూపు నిలుపుతాడు" అంది.

వింటూ తలాడించింది గౌసియా.

"ఊ... చెప్పు? నీవు ఎవరు? ఎక్కడ్నుంచి వచ్చావు... ఎలా వచ్చావు? " అడిగిందామె.

కొన్నిక్షణాల మౌనం తర్వాత తన గురించి అంతా విపులంగా చెప్పుకుంది గౌసియా.

ఆమె గురించి అంతా విన్నాక చుట్టూ మూగిన సన్యాసినులు ఆమెవైపు అపనమ్మకంగా చూశారు. ఆ తర్వాత జాలితల్చారు.

"నీవు భయపడవద్దు. ఆ ప్రభువు నిన్ను తప్పక రక్షిస్తాడు" అంది ఒక సన్యాసిని ధైర్యం చెబుతున్నట్టుగా.

"నీవు భవానిశంకర్ దగ్గరికి వెళ్ళాలీ అనుకుంటే వెళ్ళవచ్చు లేదా మాకుమల్లే ఇక్కడే వుండిపోవాలీ అనుకుంటే వుండిపోవచ్చు" మరొక సన్యాసిని అంది.

"నేను భవానీశంకర్ దగ్గరకే వెళ్ళిపోతాను" అంది గౌసియా.

"అలాగే" అంది ఇంకో సన్యాసిని.

★ ★ ★

మధ్యాహ్నం ఒంటిగంట కావొస్తుందనగా ఫాదర్ వచ్చాడు. సన్యాసినుల ద్వారా గౌసియా గురించి పూర్తిగా తెల్సుకున్నాడు. ఆరోజు దినపత్రికల్లో అరబ్బుషేక్ హత్య గురించిన సమాచారం... "హోటల్ హిందుస్థానీలో అరబ్బుషేక్ హత్య... హంతకులెవ్వరు? " అని వచ్చింది. ఆ హత్య చేసింది "గౌసియానే కావొచ్చు" అని అనుమానపడుతూ పేపర్‌లో వచ్చిన అరబ్బు షేక్ తాలూకు ఫొటో చూపిస్తూ అడిగాడు ఫాదర్.

"ఇదిగో... నువ్వు చంపేసింది ఇతడేనా? "

రక్తపుమడుగులో పడివున్న అరబ్బుషేక్ ఫొటోను చూడగానే, కళ్ళింత చేసి... "వీడే... వీడే" గట్టిగా అంది గౌసియా.

"మంచిపని చేశావు" అన్నాడు ఫాదర్.

"అంటే నేను ఆ హత్య చేసినందుకు నాకు శిక్ష పడదా? నన్ను పోలీసులు పట్టుకుపోరా? " గౌసియాలో పసిపిల్ల అమాయకత్వం.

"పోలీసులు తీసుకువెళ్తారు. కానీ శిక్షపడదు" చెప్పాడు ఫాదర్.

"అదెలా? " అడిగింది గౌసియా.

"అంతా నీకు తర్వాత తెల్సివస్తుంది" అన్నాడు ఫాదర్.

ఆ విషయం గురించి ఆమె ఇంకేం మాట్లాడలేదు. కాసేపు మౌనంగా వుండి ఆ తర్వాత "నన్ను భవానీశంకర్ దగ్గరికైనా పంపించండి. లేదంటే నా దగ్గరికైనా భవానీశంకర్‌ను తీసుకురండి" తల వంచుకుని చెప్పింది.

"ఆ ప్రభువు దయవల్ల నీకు తప్పకుండా న్యాయం జరుగుతుంది. ఆ ప్రభువుకు నీపై జాలి కలిగింది కాబట్టే మా దగ్గరకు తీసుకువచ్చాడు" ప్రశాంతంగా అన్నాడు ఫాదర్.

"అంటే... నేనూ భవానీశంకర్ తప్ప

కుండా కల్సుకుంటాం అన్నమాట" ఆనందం గానూ ఆశగానూ అంది గౌసియా.

'అవును' అన్నట్టుగా తలాడించాడు ఫాదర్.

"నాకు అంతకన్నా కావల్సింది లేదు. శుక్రియా బాబా" సలాం వాలేకుం అన్నట్టుగా చేత్తో నమస్కరిస్తూ అంది గౌసియా.

ఫాదర్ చిన్నగా నవ్వి "నన్ను ఫాదర్ అనాలి" చెప్పాడు ఫాదర్.

"సరే... సరే..." తలాడించింది గౌసియా.

★ ★ ★

భవానీశంకర్ అపనమ్మకంగా చూస్తూ నిల్చుని వున్నాడు. ఫాదర్ తోడురాగా చిరునవ్వుతో భవానీశంకర్ దగ్గరకి నడిచింది గౌసియా.

"గౌ... సి...యా? " ఆమె రాకను అతడు నమ్మలేకపోతున్నాడు.

"శం... క... ర్... ఈ ఫాదర్ దేవుడు. నన్ను నీకోసం తీసుకువచ్చాడు" ముంచుకొస్తున్న దుఃఖాన్ని బలవంతాన బిగువ పట్టుకుంటూ అందామె.

ఫాదర్‌వైపు చూశాడు భవానీశంకర్. ఫాదర్ చిరునవ్వుతోనే అతడ్ని పలకరించాడు. భవానీశంకర్ ఫాదర్‌కి చేతులు జోడించాడు. ఆ సమయంలో భవానీశంకర్ కళ్ళల్లో కృతజ్ఞతాపూర్వకమైన వెలుగు.

"ఫాదర్! మా ఇద్దర్నీ కలిపారు. ఇక మా కుటుంబాలనుండి గానీ, మా మతాలనుండి కానీ మాకు ఎలాంటి కష్టం రాకుండా మీరే కాపాడాలి" ఫాదర్ చేతుల్ని పట్టుకుంది గౌసియా.

"మిమ్మల్ని ఎవ్వరూ ఏమీ చేయలేరు" అన్నాడు ఫాదర్.

"ఎందుకైనా మంచిది. మేం ఈ సమాజానికి దూరంగా బతుకుతాం" అన్నాడు భవానీశంకర్.

"మేం ఏ మతానికీ సంబంధించిన వాళ్ళంకాదు. మేం కేవలం భారతీయులం! కాబట్టి, అటు హిందువులుగానీ, ఇటు ముస్లింలుగాని మమ్మల్ని ఏదైనా చెయ్యవచ్చు" భయంగా అన్నాడు భవానీశంకర్.

"అవును ఫాదర్! మతాల్ని వదిలేసుకుని భారతీయులుగా బతకాలి అనుకుంటున్నాం కాబట్టి, ఏ మతం వాళ్ళకైనా మాపై కోపం రావొచ్చు" అంది గౌసియా.

సరిగ్గా అదే సమయంలో అటువైపునుండి హిందువులు, ఇటువైపునుండి ముస్లింలు భయపెడుతూ అరుస్తూ... కర్రలు పట్టుకుని పరుగెట్టుకు రాసాగారు.

గౌసియా, భవానీశంకర్ ఆ ఇరువర్గాల్ని చూడగానే ఒకరిచేతుల్ని ఒకరు బిగ్గరగా పట్టుకుని భయంగా బిగుసుకుపోతూ ఒక పక్కకు జరిగారు.

ఫాదర్ మాత్రం భయపడలేదు. "ఆగండి" ఇరువర్గాలకి చేతులు చూపిస్తూ గట్టిగా అరిచాడు.

ఎవ్వరూ ఫాదర్‌ని లెక్కచేయలేదు. కట్టలు తెగుతున్న కసి, ద్వేషాలతో ఒకర్ని ఒకరు కొట్టుకోవడం ఆరంభించారు. కాసేపటిక్రితం ప్రశాంతంగా వున్న వాతావరణం ఒక్కసారిగా హాహాకారాలతో... అరుపులతో... రణభూమిలా మారిపోగానే, ఆ పరిస్థితిని తట్టుకోలేక ఆ ప్రేమికులు ఇద్దరూ అక్కడ్నుంచి తప్పించుకునే ఉద్దేశ్యంతో నెమ్మదిగా అడుగులు వెనక్కి వేయసాగారు.

"ప్రభూ! ఏమిటీ విపరీతం? " ఫాదర్ కూడా పరిస్థితిని తట్టుకోలేకపోతున్నాడు.

"ఫాదర్! వచ్చేయండి" తాము వెళ్తూనే మెల్లగా చెప్పింది గౌసియా. ఫాదర్ వెనక్కి తిరిగి చూశాడు.

సరిగ్గా అదే క్షణంలో ఐదారుగురు వ్యక్తులు ఒక్కుమ్మడిగా వచ్చి ఫాదర్‌ను విచక్షణారహితంగా కత్తులతో పొడవసాగారు.

"ఫాదర్" గట్టిగా అరుస్తూ లేచి కూర్చుంది గౌసియా. సమీపంగా కూర్చుని బైబిలు పుస్తకాలు చదువుకుంటున్న కొందరు సన్యాసినులు ఒక్కసారిగా గౌసియావైపు అర్థంకానట్లుగా చూశారు.

భయంగా చుట్టూచూసింది గౌసియా.

ఫాదర్ లేడూ, భవానీశంకర్‌లేడూ, అస్సలు ఏ గొడవాలేదు. అంతా నిర్మలమైన వాతావరణం నెలకొని వుంది.

"కలవచ్చింది" సన్యాసినులవైపు చూస్తూ భయంగా చెప్పింది గౌసియా. ఆమె ఇప్పుడు భయపడింది కలగురించి కాదు, వాళ్ళ పఠనానికి భంగం కలిగించినందుకు, వాళ్ళు తనను కోప్పడతారేమోనని మాత్రమే!

గౌసియాకు చేరువగా కూర్చునివున్న ఒక సన్యాసిని ఆమెను చూస్తూ చిరునవ్వు నవ్వింది. ఆ నవ్వును గమనించిన గౌసియా తన గుండెలపై చేయివేసుకుని... "హమ్మయ్య! వీళ్ళకు నాపై కోపం రాలేదు" అనుకుంది మనసులో.

"గౌసియా" అందరిమధ్యా కూర్చునివున్న ఒక సన్యాసిని పిల్చింది.

"ఆ..." పలికింది గౌసియా.

"లేచివెళ్ళి స్నానంచేసి తయారవ్వు. మళ్ళీ చర్చికి వెళ్దాం" చెప్పిందామె.

"సరే" అని లేచి నిల్చుంటూ ఎదురుగా వున్న గోడగడియారం వైపు చూపింది గౌసియా. గడియారాన్ని చూసిన వెంబడే సమయం తెల్సుకోవడం ఆమెవల్లకాదు. అందుకే అలవాటుగా గడియారం వైపు కొన్నిక్షణాలపాటు చూసి, గీతల్ని లెక్కించుకుని, సమయం సాయంత్రం ఐదుగంటలు కావస్తోందని తెల్సుకున్నాక... నెమ్మదిగా బాత్‌రూమ్‌వైపు నడిచింది.

ఆమె స్నానం చేసి వచ్చేసరికి చర్చికి వెళ్ళేందుకు సన్యాసినులు సిద్ధమౌతున్నారు.

"బైబిలు తీసుకో" ఒక సన్యాసిని డైరీ లాంటి పుస్తకాన్ని గౌసియాకు అందివ్వబోయింది.

"నాకు చదువురాదు" చెప్పింది గౌసియా.

కిసుక్కున నవ్వింది సన్యాసిని. నవ్వుతూనే... "చదువుకున్న అమ్మాయిలాగా కనబడుతున్నావే" అంది.

"చదువుకుంటాను" ఆమె నవ్వినందుకు గానూ ఇబ్బందిగా ముఖం పెట్టింది గౌసియా.

"నేను నిన్ను వెక్కిరించలేదు గౌసియా. నువ్వు ఆమాట అనగానే నాకు ఎందుకో నవ్వొచ్చింది" గౌసియా భుజంపై చేయి వేసిందామె.

గౌసియా చిరునవ్వుతో చూసింది.

"ఈ కాలంలో కూడా చదువురాని వాళ్ళు వున్నారంటే నాకు ఆశ్చర్యంగా వుంది. నువ్వు తప్పకుండా చదువుకోవాలి"

"మీరు నాకు అక్షరాలు నేర్పిస్తారా? "

"తప్పకుండా"

"ఈ రాత్రికే నాకు అక్షరాలు రాసివ్వండి. దిద్దుకుంటాను"

"ఇక్కడ్నుంచి వెళ్ళాక కూడా చదువును నిర్లక్ష్యం చేయొద్దు. నీవు బాగా చదువు నేర్చుకుని నీ స్వంత దస్తూరితో మాకు ఉత్తరం రాయాలి. సరేనా? "

"సరే..."

"నీవు ప్రభువును నమ్ముకుంటే నీకు త్వరగా చదువు అబ్బుతుంది. నాకు మొదట్లో ఇంగ్లీష్ మాట్లాడ్డం రాకపోయేది కానీ... "ప్రభూ! ఐ వాంట్ ఇంగ్లీష్" అని ప్రభువును మనస్ఫూర్తిగా నమ్మి ప్రతినిత్యం ధ్యానించుకున్నాక, విచిత్రం! కేవలం రెండు నెలల్లో ఇంగ్లీష్ మాట్లాడాలనుకున్న నా ప్రయత్నం గెలిచింది"

"అవునా? " ఆశ్చర్యపోయింది గౌసియా.

అదే సమయంలో అందరికీ పెద్దగా వ్యవహరించే మదర్ అందర్నీ ఉద్దేశిస్తూ, "ప్రార్థనకు వేళవుతోంది" అని గుర్తుచేసి, "గౌసియా..." పిలిచింది.

"మదర్? " అంటూ ఆమెకు దగ్గరగా

వెళ్ళింది గౌసియా.

"చర్చికి వెళ్దాంరా" గౌసియా చేయి పట్టు కుందామె.

ఆమె చాలా పెద్దావిడ. ఆ వయసు లోనూ ఆమె అన్నివిధాలా చలాకిగా వుంది. ఆమెతోపాటుగా ఇంకొందరు పెద్దవాళ్ళు వున్నారు. వాళ్ళు కూడా చలాకీగా వుంటు న్నారు.

గౌసియా వచ్చింది ఉదయమే అయినప్ప టికీ, ఆ పెద్దవాళ్ళతోపాటుగా మిగతా సన్యా సినులు అందరూ ఆమెతో ఎంతో దగ్గరిత నంగా మెలుగుతున్నారు. ఆ ఆశ్రమం చాలాచిన్నది. సన్యాసినులు మొత్తం యాభై మంది కంటే ఎక్కువలేరు. వాళ్ళల్లో అందరూ గౌసియాకు బాగా నచ్చారు. అదే మాటను మదర్‌తో అంది గౌసియా.

"మీరంతా చాలా స్నేహంగా మెలుగుతు న్నారు. మీరు నాకు బాగా నచ్చారు"

"ఎంత బాగా నచ్చాం? " గౌసియా చేయిని అలాగే పట్టుకుని ముందుకు నడుస్తూ అడిగింది మదర్.

"చాలా బాగా! కానీ... మీరు నాకేం అర్థం కావడంలేదు. ఎందుకంటే నాకు తెల్సి నంతవరకు మీలాంటి వాళ్ళంతా పెళ్ళిళ్ళు చేసుకోకుండా దేవుడిసేవకు అంకితమైపో తారు. కానీ మీవాళ్ళు ఒక్కొక్కరు ఒక్కోలా కనబడుతున్నారు" అమాయకంగా అంది గౌసియా.

చిన్నగా ఓమారు నవ్వి... "మేం దేవుడి సేవకేకాదు, మానవసేవకు కూడా అంకిత మైన వాళ్ళం. మా వాళ్ళల్లో కొందరు అమ్మాయిలు ప్రయివేటుగా చదువుకుంటు న్నారు. అంటే... పరీక్షలు రాయడానికి మాత్రమే హాజరౌతారు అన్నమాట! మిగతా సమయాల్లో మేం మా కర్తవ్యాన్ని నిర్వర్తి స్తుంటాం. ఇలా కొందరు చదువుకుంటూ, మరికొందరు మతప్రచారానికి వెళ్తూ, ఇంకొందరు మానవసేవ నిమిత్తం వెళ్తు న్నారు. అందుకే నీకు ఒక్కొక్కరు ఒక్కోలా కనబడుతున్నారు" అంది మదర్.

"అలాగా" అని, "నాకు మీ అందరిపేర్లు తెల్సుకోవాలని వుంది. కానీ మీపేర్లు నాకు గుర్తేవుండవు" అంది గౌసియా.

మళ్ళీ నవ్వింది మదర్. నవ్వి, "వచ్చిన కొన్ని గంటల్లోనే మా గురించి బాగా తెల్సు కున్నావు. అంటే నువ్వు చురుకైనదానివి అన్నమాట. మరి మా పేర్లు ఎందుకు గుర్తుండడంలేదు" అడిగింది మదర్.

తెలీదు అన్నట్టుగా చిన్నగా నవ్వింది గౌసియా.

"నీకేకాదు గౌసియా. చాలామంది హిందువులకు, క్రిస్టియన్‌లకు, కష్టంగా వున్న ముస్లిం పేర్లు కూడా గుర్తుండవు" అంది మదర్.

"అవునా? " తనేదో గొప్పనిజం తెల్సుకు న్నట్లుగా అంది గౌసియా.

వాళ్ళు అలాగే మాట్లాడుతూ పదిహేను నిముషాల్లో చర్చిదగ్గరకు చేరుకున్నారు. అక్కడికి వెళ్ళాక అందర్నీ ఒకసారి కలియ జూసింది గౌసియా. అనుకోకుండా రాజేష్ వాళ్ళు అక్కడికి వస్తారేమోనన్న అను మానం ఆమెను ఇంకా పీడిస్తోంది. కానీ వాళ్ళపట్ల ఆమెకు ఇప్పుడు మునుపటి భయంలేదు. కాకపోతే అందరికళ్ళూ కప్పి తనను వాళ్ళు ఎత్తుకు వెళ్తారేమోనన్న కొత్త భయం ఆమెలో చోటు చేసుకుంది.

ఆమె భయాన్ని హెచ్చిస్తూ చర్చి ఆవరణ లోకి నవీన్ వచ్చాడు. ఎవ్వర్నీ పట్టించుకో కుండా చర్చిలోపలికి నడిచాడు. అతడిగు రించి మదర్‌తో చెప్పాలనుకుని మదర్‌వైపు చూసింది గౌసియా. మదర్ ఎవ్వరితోనో మాట్లాడుతోంది.

అదేసమయంలో మరో సన్యాసిని వచ్చి గౌసియాను చర్చిలోపలకు తీసుకెళ్ళింది. లోపలికి వెళ్ళాక నవీన్‌కోసం చూసింది గౌసియా. అతడు మగవాళ్ళ ముందు వర సలో భక్తిపూర్వకంగా తలవంచుకుని నిలబ డివున్నాడు. కనీసం తనను తీసుకువచ్చిన

సన్యాసినికైనా అతడ్ని చూపించాలనుకుంది గౌసియా. కానీ అప్పటికి అందరూ ప్రార్థన కోసం సంసిద్ధులు అవుతున్నారు.

తన ప్రయత్నాన్ని విరమించుకుంటూ దగ్గరగా ఒదిగి నిలబడి నవీన్‌నే చూడసాగింది గౌసియా,

ప్రార్థన పూర్తయ్యేవరకూ అతడు ఎక్కడా చూళ్లేదు. ఎంతో ఏకాగ్రతగా ప్రభువును స్మరించుకున్నాడు. ప్రార్థన పూర్తయ్యాక సైతం అతడు ఎవ్వరితో మాట్లాడలేదు. ఎవ్వర్నీ పట్టించుకోకుండా నిశ్శబ్దంగా బయటికి నడిచాడు.

'అతడు అతడేనా?' అతడ్నే చూస్తూ ఆశ్చర్యంగా అనుకుంది గౌసియా.

"ఏం గౌసియా? ఎవర్ని అలా చూస్తున్నావు?" అడిగింది పక్కనే వున్న సన్యాసిని.

అప్పటికి తను చెప్పాలనుకున్న విషయం గుర్తుకురాగానే హడావిడి పడుతూ, "అతడే... అతడే" నవీన్‌వైపు చూపించింది గౌసియా.

"ఎవరు?" వెళ్ళిపోతున్న జనాల్లోకి చూసింది సన్యాసిని.

"అదిగో... అతడు" ఆత్రంగా చూపించింది గౌసియా.

"ఎవరు గౌసియా?" ఆమెకు అర్థం కావడంలేదు.

"అదిగో తెల్లచొక్కా వేసుకున్నాడే... అతడే నన్ను మోసం చేయాలనుకున్నవాళ్ళలో ఒకడు"

"అట్లాగా... ఎవరూ... ఎవరూ?" ఆమెలో కూడా ఆత్రం పెరిగింది.

నవీన్ జనాల్లో కలిసి వెళ్ళిపోతున్నాడు. అందరూ తెల్లచొక్కాలే ధరించి వున్నందున అతడ్ని గుర్తించడం సన్యాసినికి సాధ్యపడడంలేదు.

"అతడే..." గౌసియా నవీన్‌వైపు కళ్ళింత చేసి చూస్తోంది.

"ఎక్కడా?" ఆమె కంగారుపడిపోతూ జనాల్లోకి చూస్తోంది.

అప్పటికి బయటికి నడిచాడు నవీన్. గౌసియా కూడా బయటికి నడవబోయింది. వెళ్తున్న జనాలు ఆమెను త్వరగా బయటకు వెళ్ళనివ్వలేదు. జనాలు తొక్కిసలాటలా కాకుండా ఒక క్రమపద్ధతిలో బయటకు వెళ్తున్నారు. అయినప్పటికీ వాళ్ళందర్నీ దాటుకుని బయటికి వెళ్ళేసరికి కొద్దిసమయం పట్టింది. తీరా బయటకు వెళ్ళేసరికి నవీన్ కనబడలేదు.

"యా అల్లా..." అనుకుంటూ జనాల్లోకి కలియచూసింది గౌసియా.

"అతడు ఎక్కడా?" వెనకే వచ్చిన సన్యాసిని అడిగింది.

"కనబడ్డంలేదు..." కంగారుగా అని, "ఆ... అదిగో... అక్కడ..."

అటుతిరిగి గేటుదగ్గర నిల్చునివున్న ఓ వ్యక్తివైపు చూపించింది గౌసియా.

"నాకు అర్థంకావడంలేదు. వెళ్దాంరా" అంటూ గౌసియా చేయి పట్టుకుని ముందుకు నడిచింది సన్యాసిని.

"ఇదిగో ఇతడే" సమీపంగా వెళ్ళగానే చూపించింది గౌసియా.

అదేక్షణంలో అతడు ఇటుతిరిగాడు. అతడు నవీన్‌కాదు.

"మదర్?" సన్యాసిని వైపు ప్రశ్నగా చూశాడు అతడు.

"ఆ... ఆ... ఇతడుకాదు" పొరపాటుకు తడబడింది గౌసియా.

"మరి అతడెక్కడా?" అడిగింది సన్యాసిని.

"కనబడ్డంలేదు. వెళ్ళిపోయినట్టున్నాడు" జనాల్లోకి చూస్తూ అంది గౌసియా.

"సరే" అని, "సారీ మిస్టర్" తమవైపే అర్థం కానట్టుగా చూస్తున్న ఇందాకటి వ్యక్తికి చెప్పి, గౌసియా చేయి పట్టుకుని వెనక్కి నడుస్తూ, "నువ్వు అనవసరంగా పొరబడుతున్నావు" అంది సన్యాసిని.

తను ఖచ్చితంగా పొరబడలేదు. ఇలాగని తనను ఇప్పుడు నిరూపించుకోలేదు

గౌసియా. అందుకే మౌనంగా వుండిపోయింది

ఆశ్రమానికి వెళ్ళాక విషయం అందరికీ తెల్సిపోయింది.

"నేను నిజంగా అతడ్ని చూసాను" ఖచ్చితంగా అంది గౌసియా. ఆమెను ఎవ్వరూ నమ్మలేదు. ఆమె ఇక ఎక్కువసేపు ఎవ్వర్నీ నమ్మించే ప్రయత్నం చేయలేదు కూడా.

ఫాదర్‌కోసం ఎదురుచూస్తూ బయటి వరండా మెట్లమీదకు వెళ్ళికూర్చుంది.

★ ★ ★

ఫాదర్ పోలీస్‌స్టేషన్‌లో కూర్చుని ఇన్స్‌పెక్టరుతో సీరియస్‌గా మాట్లాడుతున్నారు.

"అమ్మాయి కేసు, దేశంమొత్తం మీద సంచలనం సృష్టించబోతోంది" అన్నాడు ఇన్స్‌పెక్టర్.

"ఒక చదువురాని పిల్ల... అందునా ఒక అమాయకురాలు... ఇంత సాహసం చేసింది అంటే ఇది సామాన్యమైన విషయంకాదు కదా? " అన్నాడు ఫాదర్.

"అప్పట్లో ఎయిర్‌హోస్టెస్ అమృతా అహ్లూవాలియా ద్వారా రక్షింపబడిన అమీనా సంఘటన కనీవినీ ఎరుగని సంచలనమైంది. అలాంటిది ఇప్పుడు ఏకంగా తనను కొనుగోలు చేసినవాడ్ని అమ్ముడుపోయిన అమ్మాయే చంపడమంటే నాట్ పాసిబుల్. కానీ సాధ్యమైంది. సో... అమ్మాయిని వెంటనే చూడాలనిపిస్తోంది. వెళ్దాం పదండి" తొందరపడ్డాడు ఇన్స్‌పెక్టర్.

"ఒకే" అంటూ లేచి నిల్చున్నాడు ఫాదర్.

కాసేపట్లో పోలీసుజీపు మరియా ఆశ్రమం ముందు ఆగింది. గౌసియాతోపాటుగా వరండాలో కూర్చునివున్న సన్యాసినులు అందరూ ఒక్కసారిగా తిరిగిచూశారు.

ఫాదర్‌తోపాటుగా పోలీసులు కిందికి దిగారు. వాళ్ళను చూడగానే గౌసియా భయంగా లేచి నిలబడింది.

"ఈ అమ్మాయే మన గౌసియాబేగం" దగ్గరగా రాగానే గౌసియాను పోలీసులకు చూపించాడు ఫాదర్.

"సలాం.... వాలేకుం" అలవాటుగా తల వంచి చెప్పింది గౌసియా.

ఆమె సలాంను స్వీకరిస్తున్నట్టుగా చిరునవ్వుతో గౌసియా భుజాన్ని తట్టాడు ఇన్స్‌పెక్టర్.

తర్వాత అందరూ కలిసి డాబామీదకు వెళ్ళారు. అప్పుడు సమయం రాత్రి ఏడు గంటలు కావస్తోంది. వాతావరణం చల్లగా హాయిగా వుంది. వెళ్ళి డాబామీద ఖాళీ ప్రదేశంలో వేసివున్న కుర్చీల్లో కూర్చున్నారు పోలీసులు, ఫాదర్. గౌసియా ఒకపక్కగా నిలబడి పోయింది.

ఇన్స్‌పెక్టర్ గౌసియాతో అన్ని విషయాల్ని ఓపికగానూ, క్షుణ్ణంగానూ మాట్లాడసాగాడు. ఆమె వున్నది వున్నట్టుగా చెప్పుకుపోసాగింది.

"అమ్మాయిని ఈ రాత్రికే డి.జి.పి దగ్గరకు తీసుకెళ్దాం" గౌసియాతో మాట్లాడాక ఫాదర్‌తో అన్నాడు ఇన్స్‌పెక్టర్.

"రేపు ఉదయాన్నే తీసుకువెళ్దాం. ఇప్పుడు చీకటయ్యింది కదా" అన్నాడు ఫాదర్.

"నోనో జాప్యం చేయడానికి ఇది సాధారణ విషయం కాదు. ఇలాంటి విషయాల్లో అర్ధరాత్రి పన్నెండయినా సరే, వెళ్లాల్సిన చోటుకు మేము వెళ్లితీరుతాం! ఆడామగా తేడా కూడా మాకు లేదు" అన్నాడు ఇన్స్‌పెక్టర్.

"సరే అట్లాగే కానివ్వండి" అన్నాడు ఫాదర్.

"ఆ... అమ్మాయీ! నిన్ను మోసం చేయాలనుకున్నారే ఆ కుర్రాళ్లు వుండే చోటుకు మమ్మల్ని తీసుకెళ్లగలవా? " అడిగాడు ఇన్స్‌పెక్టర్.

"తీసుకువెళ్లలేను. కాకపోతే అక్కడ ఒక దేవత గుడి వుంటుంది. వీధి కూడా పాడుబడినట్టుగా వుంది" చెప్పింది గౌసియా.

"సరే సరే వాళ్లను తరువాత చూసుకుందాం" అన్నాడు ఇన్స్‌పెక్టర్.

"ఈ సాయంత్రం వాళ్లల్లో ఒకడు చర్చికి వచ్చాడు. నేను కళ్లారా చూశాను. కాని అంతలోనే అతడు వెళ్లిపోయాడు. నేను ఈ విషయాన్ని చెప్తే కూడా నన్ను ఎవ్వరూ నమ్మలేదు. ఫాదర్‌కు చెబుదామన్నా ఫాదర్ ఈ సాయంత్రం చర్చికి రాలేదు" చెప్పింది గౌసియా.

"ఈ సాయంకాలం నుండి ఫాదర్ మా దగ్గరేవున్నారు" ఫాదర్‌ను చిరునవ్వుగా చూస్తూ చెప్పాడు ఇన్స్‌పెక్టర్.

తర్వాత గౌసియాను డి.జి.పి దగ్గరకు తీసుకెళ్లారు. ఫాదర్ వెంటే వున్నాడు. అక్కడికి వెళ్లాక పత్రికల వాళ్లకి, టీవీవాళ్లకి సమాచారం పంపడం, వాళ్లు వెనువెంటనే రావడం, న్యూస్ కవర్‌చేసుకోవడం గౌసియాకు అంతా కలలోలా తోచింది. అరబ్బు షేకులకు స్థావరం కల్పించిన హిందుస్థానీ హోటల్ మీదకు అప్పటికప్పుడు పోలీసులు దాడిచేయడం, హత్య అనంతరం కొందరు పారిపోగా మిగిలిన వాళ్లు కొందర్ని రెడ్ హ్యాండెడ్‌గా పట్టుకోవడం, హోటల్ యాజమాన్యాన్ని కూడా అదుపులోకి తీసుకోవడం అంతా ఆ రాత్రికి రాత్రే జరిగిపోయాయి.

గౌసియా అందించిన వివరాల ప్రకారం మొదట హైదారాబాద్ పోలీస్ కంట్రోల్ రూమ్‌కు ఫోన్‌చేసి అట్నుంచి గౌసియా వాళ్ల సంబంధిత పోలీస్ స్టేషన్‌కు ఫోన్ చేసి డి.జి.పియే స్వయంగా మాట్లాడాడు. అక్కడి సబ్ఇన్స్‌పెక్టర్ ఆఫ్ పోలీస్ చెప్పిన మాటలు డి.జి.పిని మొదట కలవరపెట్టాయి.

డి.జి.పిద్వారా విషయం తెలుసుకున్న ఫాదర్ కూడా కలవరపడి పోతూ "ఓ గాడ్! ఈ విషయాన్ని వెంటనే అమ్మాయికి చెప్పడం అంత మంచిదికాదు" అన్నాడు.

"జాగ్రత్తపడాల్సింది అమ్మాయి గురించే కాదు, దేశం గురించి కూడా! అరబ్బుషేకు హత్య గురించి ఏ పేపర్లూ పెద్దగా రాయలేదు. ముందు ఆలోచనగా గౌసియా తండ్రి హత్య గురించి కూడా పెద్దగా రాయలేదు. కాని రేపు ఈ వార్తలు మెయిన్ ఎడిషన్‌లో రాబోతున్నాయి. అంటే దేశం మొత్తం మీద మతకల్లోలాలు తలెత్తినా ఎత్తవచ్చు" అన్నాడు డి.జి.పి.

"కన్నతండ్రి విషయంలో అమ్మాయి విముఖతగా వుంది. సో... తండ్రి హత్య గురించి తెలిస్తే కాసేపు బాధపడి వూరుకుంటుందేమో కాని తన ప్రియుడు కనిపించకుండా వెళ్లిపోయాడంటే మాత్రం ఆ పిల్ల తట్టుకోలేదు" అన్నాడు ఫాదర్.

"ఆ అబ్బాయి నిజంగా పారిపోతే పొరపాటు చేసినవాడే అవుతాడు. ఎందుకంటే ఆ అబ్బాయి గౌసియా తండ్రిని ఎందుకు హత్య చేశాడు అన్న విషయాన్ని పేపర్లు స్పష్టంగా ప్రచురించలేదు. కాని అబ్బాయి అదే విషయాన్ని పోలీసులకు రిపోర్ట్ ఇచ్చి వుంటే ఎంత బాగుండేది? ఇప్పుడు ఆ హత్య ఎందుకు జరిగింది అన్న విషయం గురించి కరెక్టు సమాచారం లేదంటున్నారు. అయినా ఇప్పుడు అంతా తేటతెల్లమైపోయింది. కాని ఆ అబ్బాయే ఎక్కడవున్నాడో ఏమో పాపం" అన్నాడు డి.జి.పి.

"నేనూ అదే బాధపడుతున్నాను" అన్నాడు ఫాదర్.

"అసలు ఆ అబ్బాయి బతికే వున్నాడా లేదా అనేది నాకు అనుమానంగా వుంది. ఉదయం పేపర్లో ఓ చోట చిన్నగా వచ్చిన వార్తను చదివినప్పుడు ఆ విషయం గురించి పెద్దగా పట్టించుకోలేదు. కాని ఇప్పుడు అమ్మాయి అంతా చెప్పాక అక్కడికి ఫోన్ చేసి అక్కడి పరిస్థితి తెలుసుకున్నాక ఈ సంఘటన ఎంత తీవ్రమైనదో అర్థమౌతోంది" అని డి.జి.పి అనగానే

"మీరు ఆ వార్తను కనీసం చదివారు. నేను అసలు చదవలేదు. ఇలాంటి విధ్వంసాల గురించి చదివితే ఒకటి రెండు

రోజుల వరకు నాకు మనశ్శాంతి వుండదు. అందుకే దాదాపుగా నేను అట్లాంటి వార్తలు చదవను" అన్నాడు ఫాదర్.

డి.జి.పి మరేదో అనబోయాడు. అప్పుడే ఒక కానిస్టేబుల్ లోపలికి వచ్చాడు.

"సర్! ఆ అమ్మాయి మాకేం అర్థం కావడంలేదు" చెప్పాడు.

"నేను వస్తాను" అంటూ లేచి వెంటనే డి.జి.పి గదిలోంచి బయటకు వచ్చాడు ఫాదర్

బయట ఒకపక్కగా చెయిర్‌లో ఒదిగి కూర్చుని వుంది గౌసియా.

"గౌసియా..." ప్రేమగా పిలుస్తూ దగ్గరగా వెళ్లాడు ఫాదర్.

స్తబ్దుగా నేలను చూస్తూ కూర్చునివున్న గౌసియా కనీసం తలతిప్పి చూళ్లేకపోయింది.

"గౌసియా" ఆమె పక్క చెయిర్‌లో కూర్చున్నాడు ఫాదర్.

"నాకెందుకో భయంగా వుంది ఫాదర్" ఏడుపు ముఖంతో ఫాదర్ వైపు చూసింది గౌసియా.

"ఎందుకు భయపడుతున్నావు? " అడిగాడు ఫాదర్.

"నేను ఇప్పట్లో హైదరాబాదు వెళ్లలేనేమో అనిపిస్తోంది. ఎందుకంటే వీళ్లు నా గురించి ఏదేదో మాట్లాడుతున్నారు. నేను కొద్దికొద్దిగా విన్నాను" పక్కన నిల్చునివున్న కానిస్టేబుల్స్‌వైపు చూపిస్తూ అంది గౌసియా.

"మేము ఏం మాట్లాడాం? " అన్నట్లుగా చూశారు కానిస్టేబుల్స్.

"గౌసియాకు ఏం జరిగిందని మీరేం మాట్లాడుకున్నారు? తను రేపో ఎల్లుండో హైదరాబాద్ వెళ్తుంది. ఆమెను అనవసరంగా భయపెట్టవద్దు" కానిస్టేబుల్స్‌తో అన్నాడు ఫాదర్.

"మేము అసలు ఆమె గురించే మాట్లాడలేదు. మా మాటలు మేము మాట్లాడుకున్నాం. తను పొరపాటు పడితే మేమేం చెయ్యాలి? " ఆశ్చర్యపోతూ అన్నాడు ఒక కానిస్టేబుల్.

"లేదు ఫాదర్! వీళ్లు నా గురించే మాట్లాడారు. నేను విన్నాను. హైదరాబాద్‌లో కూడా అల్లర్లు జరిగాయటకదా. ఎవరికో ఏదో జరిగిందటకదా!" భయంగా అంది గౌసియా.

"నో నో! ఎవ్వరికీ ఏం జరగలేదు" గౌసియా భుజంపై చేయివేశాడు ఫాదర్.

"మీరు ఏదో దాచిపెడుతున్నారు. నిజంగానే ఎవ్వరికో ఏదో జరిగింది" ఏడవసాగింది గౌసియా.

"ఎవ్వరికీ ఏమీ కాలేదమ్మా.. అందరూ క్షేమంగా వున్నారు" చిన్నగా నవ్వుతూ అన్నాడు ఫాదర్.

"అయితే రేపే నన్ను హైదరాబాదు తీసుకెళ్లండి" అంది గౌసియా.

"వెళ్దాం. కాని కొద్దిగా ఆలస్యంగా! ఎందుకంటే నువ్వు హత్యకేసులో వున్నావు. ఈ కేసులో నీకు శిక్షపడదు. కాని కొన్ని రోజులు ఇక్కడే పోలీసులు నిన్ను అదుపులోకి తీసుకుంటారు" నచ్చజెప్పే ప్రయత్నం చేశాడు ఫాదర్.

"వద్దు... నేను రేపే వెళ్తాను" మొండిగా అంది గౌసియా.

"సరేలే నీ ఇష్టం" అని కాసేపాగి, "ఇప్పుడే వస్తాను. ఇక్కడే కూర్చో" చెప్తూనే లేచి తిరిగి లోపలికి నడిచాడు ఫాదర్.

'నా భవానీ శంకర్‌కు ఏం కాకూడదు' మనసులో కోరుకుంటూ అక్కడే కూర్చుండిపోయిందామె.

"పాపా" కాసేపటి తర్వాత ఒక కానిస్టేబుల్ పిలుస్తూ వచ్చాడు.

ఏంటన్నట్లుగా చూసింది గౌసియా.

"స్టేషన్‌కు వెళ్దాం రామ్మా" అన్నాడు.

"ఫాదర్!" లోపలివైపు చూసింది.

"నేను తర్వాత వస్తానమ్మా"

"వద్దు ఫాదర్! మీరు లేకుండా నేను

వెళ్లను" అంది గౌసియా.

"నాకు కొద్దిగా పని వుందమ్మా! ఆ పని అయ్యాక వెంటనే వస్తాను" అన్నాడు ఫాదర్.

"తొందరగా రావాలి" అంది గౌసియా.

"వస్తాను"

గౌసియా ఇంకేం మాట్లాడలేదు. కానిస్టేబుల్ వెంట బయటకు నడచింది.

"ఈ అమ్మాయి ఎక్కువసేపు ఇక్కడ వుంటే నిజాన్ని ఎట్లాగయినా తెలుసుకుంటుంది. ఈ కానిస్టేబుల్స్ కాసేపు వూరుకొండయ్యా అంటే విన్పించుకునేట్టులేరు. తను ముందే మానసికంగా బలహీనురాలు. అందుకే స్టేషన్‌కు పంపిస్తున్నాం" వెళ్తున్న గౌసియానే చూస్తూ పక్కన నిల్చునివున్న ఒక పత్రికా విలేకరితో అన్నాడు ఫాదర్.

"ఈరోజు కాకపోయినా రేపైనా నిజం తెలుస్తుందిగా ఫాదర్? " అన్నాడు విలేకరి.

"నిజం తెల్సినా భరించుకునేలా రేపటివరకు అమ్మాయిని ప్రిపేర్ చేస్తాం" అన్నాడు ఫాదర్.

అప్పటికి కానిస్టేబుల్‌తో కలిసి బయటకి నడిచింది గౌసియా. వెనకే మరో కానిస్టేబుల్ వచ్చాడు. ఇద్దరితో కలిసి పోలీసు జీపులో స్టేషన్‌కి బయలుదేరిందామె. మధ్యలోకి వెళ్లాక వెనకసీట్లో కూర్చుని వున్న కానిస్టేబుల్ అడిగాడు.

"అమ్మాయీ! నీవు ప్రేమలో పడ్డావా? "

"అ...వు.. ను" కొద్దిగా ఇబ్బందిపడింది గౌసియా.

"ఆ కుర్రాడు ఏం చేస్తుంటాడు? "

"చదువుకుంటున్నాడు"

"ఏంటో ఈ కాలం పిల్లలకు ఇంత వయసు వచ్చిందో లేదో అప్పుడే తహతహలు మొదలౌతాయి" తనలో తానే గొణుక్కున్నాడు కానిస్టేబుల్.

జీపు పోలీస్ స్టేషన్ ముందు ఆగింది. కానిస్టేబుల్స్‌తో పాటుగా జీపుదిగి స్టేషన్ లోపలికి నడిచింది గౌసియా.

"నీకేం భయంలేదు. ధైర్యంగా వుండు" డ్రైవ్ చేసిన కానిస్టేబుల్ ఆమె భుజాన్ని తడుతూనే గట్టిగా నొక్కాడు.

ఆమె అతడిని పెద్దగా పట్టించుకోలేదు. వెళ్లి అక్కడ కుర్చీల్లో ఒక పక్కగా కూర్చుంది.

"నీకేం అవసరం వచ్చినా మాతో చెప్పు" ఆమె వీపు నిమిరాడు అతడు.

"సరే" తలాడించిందామె.

"బాత్‌రూమ్ వస్తోందా? " తనే అడిగాడు.

"ఉహూ" తల అడ్డంగా వూపింది.

"వస్తేవెళ్లు" చెప్పాడు.

"..."

"కాసేపైతే ఫాదర్‌తో పాటుగా అందరూ వస్తారు. అంతా అల్లరిగా వుంటుంది. బాత్‌రూమ్‌కి ఇప్పుడే వెళ్లు" చెప్పాడు.

"వద్దు" అందామె.

"సరే నీ ఇష్టం" అంటూ బయటకి నడిచాడు అతడు.

"ఏమంటోందిరా? " మెల్లగా అడిగాడు అక్కడున్న కానిస్టేబుల్.

"వేస్టు క్యాండిడేటు" చెప్తూ వెళ్లి అతడి పక్కన కూర్చున్నాడు ఇతడు.

"ఇదే వేరే కేసైతే ట్రైచేసి చూసేవాళ్లం. కాని ఇప్పుడు జాగ్రత్తగా వుండాల్రోయ్. లేదంటే మన కొంపలు మునుగుతాయి" మొదటి కానిస్టేబుల్ అన్నాడు.

అంతలోనే గౌసియా డోర్‌దాకా వచ్చి "సార్" పిల్చింది. ఇద్దరూ ఆమెవైపు చూశారు.

"బాత్‌రూమ్" అందామె.

"వస్తాను పదా" అంటూ రెండవ కానిస్టేబుల్ లేచి ఆమెవైపు వెళ్లాడు.

"మీ ఇద్దరి పేరేంటి? " అడిగింది గౌసియా.

"నా పేరు కృష్ణ. అతడి పేరు వెంకట్" చెప్పాడు.

ఆమె ఇంకేం అనలేదు. కృష్ణ ఆమెను

బాత్‌రూమ్‌వైపు తీసుకెళ్లాడు. ఆమె బాత్‌రూమ్‌లోకి వెళ్లి నిముషం తర్వాత వచ్చింది.

"గౌసియా నీకో నిజం చెప్తాను. నేను కోరింది ఇస్తావా? " చీకట్లో ఆమె చేయి పట్టుకున్నాడు కృష్ణ.

"ఏంటీ? " ప్రశ్నార్థకంగా చూసింది అతడి వైపు.

"చెప్తాగాని ముందు నేను కోరింది ఇవ్వు" మాట మార్చాడు కృష్ణ.

"నీకేం కావాలి? " అడిగిందామె.

"నువ్వు కావాలి" గుసగుసగా అన్నాడు అతడు.

"ఆ" ఆమెకు వెంటనే ఏం అర్థం కాలేదు.

"నువ్వు కావాలి" మళ్లీ చెప్పాడు.

"అం...టే? " ఆమె గొంతు అప్రయత్నంగా వణికింది.

"ష్... మరేం కాదులే. నీకు డబ్బులు కూడా ఇస్తాను" ఆశపెట్టాడు.

"ఆ...ఆ..." ఆమె తడబడింది.

"హైదరాబాదులో ఏం జరిగింది అనేది ఫాదర్ నీతో దాచిపెట్టాడు. కాని నీకు మొత్తంగా చెప్పేస్తాను. నా కోరిక అంగీకరిస్తేనే" అన్నాడు కృష్ణ.

"అమ్మో... వద్దు" భయంగా గుండెలపై చేయివేసుకుందామె.

"ప్లీజ్ కాదనవద్దు" ఆమె చేయిని గట్టిగా పట్టుకున్నాడు.

"వద్దు" అతడిని విడిపించుకునే ప్రయత్నం చేసింది.

"కృష్ణా..." అంతలోనే స్టేషన్‌లోపల్నుంచి వెంకట్ పిలుపు.

"ఆ వస్తున్నా" అంటూ, "నేను ఇలా అడిగానని వాడితో చెప్పొద్దు" అని గౌసియాతో చెప్పి ఆమె చేయి పట్టుకుని లోపలికి నడిచాడు కృష్ణ.

"నీకు సర్కిల్ సాబ్ నుండి ఫోన్ వచ్చింది" చెప్పాడు వెంకట్.

"ఏమన్నాడు? " అడిగాడు కృష్ణ.

"ఇంటికి రమ్మంటున్నాడు" చెప్పాడు వెంకట్.

వెంటనే బయటకు నడిచాడు కృష్ణ. అప్పటికి బాగా రాత్రయ్యింది. ఆవులిస్తూ వెళ్లి ఎప్పటిచోట కూర్చుంది గౌసియా. కాసేపటి తర్వాత ఆమె దగ్గరికి వెళ్లాడు వెంకట్.

"హైదరాబాద్‌లో ఏం జరిగింది? " అడిగింది గౌసియా.

"ఏం జరగలేదు. ఆనందంగా వుండు" అంటూ వెళ్లి ఆమె పక్కగా కూర్చుని "నీవూ నీ ప్రియుడు కలిసి ఎక్కడెక్కడ తిరిగేవాళ్లు? " అడిగాడు.

"ఎక్కడా తిరగలేదు. మైసమ్మ గుడి దగ్గర కల్సుకునేవాళ్లం" చెప్పింది.

"అక్కడ ఏం చేసేవాళ్లు? " ఆరా తీసినట్టుగా అడిగాడు.

"మాట్లాడుకునేవాళ్లం"

"అంతేనా? ఇంకేం చేసేవాళ్లుకాదా? "

"ఇంకేం చేస్తాం? " అతడివైపు అనుమానంగా చూసింది.

అతడు చిన్నగా నవ్వాడు. నవ్వుతూనే "ఈకాలం పిల్లలకు ప్రేమంటే అదేకదా! అందుకే అడిగాను" అన్నాడు.

"..."

"అయినా అందులో తప్పేముంది? " అంటూనే ఆమె చేయి పట్టుకుని గట్టిగా నొక్కి వదిలేశాడు.

"..."

"ఒక్కసారి ఆ సుఖం తెలిస్తే నువ్వు ఇలా వుండలేవు" గొణిగినట్టుగా అన్నాడు.

"ఫాదర్ ఎప్పుడు వస్తాడు? " అతడి మాటలు వింటూనే అడిగింది.

"వస్తాడు" టైం చూసుకుంటూ అన్నాడు వెంకట్.

"త్వరగా వస్తే బాగుణ్ణు" అందామె.

"వస్తాడులే" ఆమెవైపు ఓరగా చూశాడు అతడు.

అప్పటికి ఆ ఇద్దరి మెంటాలిటీ ఆమెకు అర్థమైపోయింది. వాళ్లు తనని ఏమైనా

చేస్తారేమోనన్న భయం ఆమెను నిలువెల్లా వణికించసాగింది.

ఇరవై నిముషాలు గడిచాయి. ఫాదర్ ఇంకా రాలేదు. ఆమెలో టెన్షన్ పెరిగింది. అంతలో ఫోన్ మోగింది. వెళ్లి లిఫ్ట్ చేశాడు వెంకట్. వెంటనే అతడి ముఖంలో రంగులు మారాయి.

"ఐసీ... ఓకే" అంటూ ఫోన్ పెట్టేశాడు.

"ఎక్కణ్ణుంచి ఫోను?" అడిగింది గౌసియా.

"ఫాదర్‌వాళ్లు వస్తున్న జీపుకి యాక్సిడెంట్ జరిగిందంట. నీకు చెప్పొద్దని చెప్పారు. కాని చెప్పాను. బాధపడుతూ కూర్చుని, నన్ను బయట పెట్టొద్దు" అన్నాడు అతడు.

"హా....?" ఆమె తట్టుకోలేకపోయింది.

"చెప్పానుకదా! నీకు తెలీనట్టుగానే వుండు" అన్నాడు అతడు.

"ఎలా వుండమంటావు?" ఏడుస్తూ అంది గౌసియా.

'వాడికెవ్వడికో యాక్సిడెంట్ అయితే దీనికి ఇంత దుఃఖం ఎందుకో?' తనలో తను గొణుక్కుని "ఇప్పుడు నువ్వు ఏడ్చినంత మాత్రాన వాళ్ల గాయాలు తగ్గిపోవు" అన్నాడు.

"వెళ్లి చూసివద్దాం" ఏడుస్తూనే అంది గౌసియా.

"నీకు చెప్పడమే నా బుద్ధి తక్కువ అయినట్టుంది" అంటూ వచ్చి ఆమె పక్కన కూర్చుని "సరేలే తీసుకువెళ్తాను. మరి నాకేం ఇస్తావు?" అడిగాడు.

"ఏమివ్వాలి?" అందామె.

"కోరింది ఇవ్వాలి" అన్నాడతడు.

అతడు ఆమెకు అర్థమయ్యాడు. "ఇక్కడ వుండటం ఎంత మాత్రం మంచిదికాదు" మనసులో స్థిరంగా అనుకుంది.

"సరేనా?" అన్నాడు అతడు.

ఆమె భయంగా చూసింది. అతడు మాత్రం హాయిగా 'నాయక్ నహీ' పాటను హమ్ చేసుకుంటూ వెళ్లి ఏవో ఫైల్స్ సర్దసాగాడు.

ఆమె ఆలస్యం చేయలేదు. అటుతిరిగి నిల్చునివున్న అతణ్ణే చూస్తూ మెల్లగా వెనక్కి అడుగులు వేస్తూ వెలుపలికి నడిచింది.

స్టేషన్ బయటకి వచ్చాక ఆమెకు అంతా గందరగోళంగా వుంది. రోడ్లమీద జనసంచారం అడపాదడపా అన్నట్లుగా ఉంది. మరియా ఆశ్రమానికి వెళ్లాలని బయటకి వచ్చిందేకాని అర్థంకాని ఆ రహదారుల వెంబడి తను వెళ్లాల్సిన చోటుకు వెళ్లలేనని అర్థమైపోయింది. దానికి తోడు నవీన్‌వాళ్లు గుర్తొచ్చారు. అందుకే కొంతదూరం ముందుకు నడిచి 'స్టేషన్‌కే వెళ్లిపోదామా?' అన్నట్టుగా వెనక్కి తిరిగి చూసింది. అదే సమయంలో స్టేషన్ ప్రహారీగోడలోంచి వెలుపలికి వస్తూ కనబడింది ఒక వాహనం.

'తనకోసమే కావొచ్చు' అని ఆమె మనసు తలచగానే తిరిగి ఆమెకు భయమనిపించింది. 'దొరక్కూడదు' అని వెంటనే నిర్ణయించుకుంది. వాహనం ఆమెను దాటి వెళ్లిపోయింది.

అక్కడ కారు షెడ్డువుంది. కార్లచాటుగా నక్కిన గౌసియా వాహనం వెళ్లిపోగానే వెలుపలికి వచ్చి అటూ ఇటూ చూసింది. ఆ తర్వాత కాసేపటికి ఒక నిర్ణయానికి వచ్చిన దానిలా వడివడిగా వచ్చిన దారెంబడే వెనుతిరిగి సాగిపోయింది.

స్టేషన్‌ని దాటి కొంతముందుకు వెళ్లాక ఒక ఇంటిముందు హడావిడి కనబడింది. ఇంటికి వేసిన లైట్లు, జనాల్లో కనిపిస్తున్న ఆనందం, ఆ ఇంట్లో ఏదో శుభకార్యం జరుగుతోందని చెప్పకనే చెప్పింది.

అప్పుడు సమయం పదకొండు దాటింది. అయినప్పటికీ బంధువులు హడావిడిగా

తిరుగుతుండటం ఆమెకు ఒక అవకాశంగా తోచింది. ఆలస్యం చేయకుండా వెళ్లి బంధువుల మధ్య కల్సిపోయింది. వాళ్లంతా ఖరీదైన బట్టలు ధరించి వున్నారు. వాళ్లమధ్య వెలిసిపోయినట్లుగా వున్న తన దుస్తుల్ని ఒకమారు చూసుకుని వీళ్లు నన్ను వేర్పాటు చేయకుంటే బాగుణ్ణు మనసులో అనుకుంటుండగానే ఆమె దృష్టి కాసింత దూరంలో వున్న బాత్‌రూమ్ మీద పడింది.

బాత్‌రూమ్‌కు సమీపంగా కట్టివున్న తాడుమీద మంచి వస్త్రాలు ఆరవేయబడివున్నాయి. వాటిని చూడగానే ఆమెలో చటుక్కున ఒక ఆలోచన మెదిలింది. కాసేపు అటూ ఇటూ తటపటాయించి తర్వాత బాత్‌రూమ్‌వైపు నడిచి తాడుమీద తనకు సరిపడే ఒక గాగ్రాచోళిని తీస్కుని బాత్‌రూమ్‌లోకి వెళ్లి మార్చుకుని వచ్చింది. ఎవ్వరూ ఆమెను పట్టించుకోవడంలేదు. వెళ్లి ఒక పక్కగా కూర్చుంది.

"ఫాదర్‌కి ఎలావుందో ఏమో! వెళ్లి చూసి వద్దామనుకున్నా ఈ నగరం అర్థం కావడం లేదు. ఈ రాత్రికి స్టేషన్‌లోనే వుండి వుదయాన్నే పోలీసుల సహాయంతో వెళ్దామన్నా పరిస్థితి బాగోలేదు. అసలు వీళ్లల్లో కల్సిపోయాను కాని ఇప్పుడేం చేయాలి? " ఆమె మనసు కలవరపడింది.

పదిహేను నిముషాలు గడిచిపోయాయి. పెళ్లివాళ్లు నృత్యాలు మొదలెట్టారు. అదే సమయంలో పక్కన వచ్చి కూర్చున్న వాళ్ల మాటలద్వారా వాళ్లంతా హైదరాబాద్ బయలుదేరి వెళ్తారని తెల్సింది.

వీళ్లవెంట వెళ్లిపోతే సరి. కాని ఇక్కడ ఫాదర్? తనలో తను అనుకుంటూండగానే ఎవరో ఒక అమ్మాయి వచ్చి ఆమె చేయి పట్టి లాగింది.

ఉలిక్కిపడి చూసింది గౌసియా.

"డాన్స్ చేద్దాం" పిలిచింది ఆ అమ్మాయి గౌసియా కాదనలేదు. అమ్మాయి అందించిన కర్రల్ని పట్టుకుని వచ్చీరానీ నృత్యాన్ని చేయనారంభించింది.

అర్ధగంట తర్వాత టూరిస్టు బస్సువచ్చి గేటు బయట ఆగింది. పెళ్లిజనాలు ఒక్కొక్కరుగా బస్సులోకి ఎక్కి కూర్చోసాగారు. కొందరు లగేజీతో వెళ్తున్నారు. కొందరు ఖాళీగా వెళ్తున్నారు. వాళ్లందరితో పాటుగా తనూ వెళ్లాలనుకుంటూ కోలాటం కర్రల్ని ఆ అమ్మాయికి అందించింది గౌసియా.

"నువ్వు కూడా వెళ్తావా? " అడిగింది అమ్మాయి.

"అందరూ వెళ్లిపోతున్నారుకదా? " అంది గౌసియా.

"వాళ్లంతా హైదరాబాదు వెళ్తున్నారు. మనం మాత్రం ఇక్కడే వుండి హాయిగా డాన్స్‌లు చేసుకుందాం. మనతోపాటుగా ఇంకా చాలామంది కూడా వుంటున్నారు. సరేనా? " అంది ఆ అమ్మాయి.

"వద్దు నేను వెళ్లిపోతాను" అంటూ బస్ వైపు నడిచి బస్సు ఎక్కి కూర్చుంది గౌసియా. అమ్మాయి కూడా బస్సు ఎక్కింది.

"ప్లీజ్ నాకు ఫ్రెండ్స్ ఎవ్వరూ లేరు. నువ్వే నా ఫ్రెండువి. కిందికి దిగవా? " ప్రతిమాలినట్లుగా అంది.

"నేను హైదరాబాద్ వెళ్లాలి" అంది గౌసియా.

"మనం తర్వాత వెళ్దాం" అంది అమ్మాయి.

విన్పించుకోలేదు గౌసియా. అమ్మాయి కాసేపు అడిగి, డ్రైవర్ బస్సు ఎక్కగానే "చూద్దాంలే" అంటూ బస్సు దిగి వెళ్లిపోయింది.

"హమ్మయ్యా" అమ్మాయి బస్సు దిగగానే

అనుకుంది గౌసియా.



అక్కడ వెంకట్ గౌసియాను కొంత దూరం వరకు వెదికి తిరిగి స్టేషన్‌కు వచ్చాడు. అతడి ముఖం కంగారుతో నిండిపోయి వుంది. అప్పటికి స్టేషన్‌కు కృష్ణ వచ్చి వున్నాడు. అతడు వాళ్లకోసమే వెదుకుతున్నట్టుగా బయటే నిలబడివున్నాడు.

"కృష్ణా ఆ పోరి కనబడట్లేదు" జీపు దిగీదిగకుండానే హడావిడిగా చెప్పాడు వెంకట్.

"ఎక్కడికెళ్లింది?" కృష్ణ కూడా కంగారుపడ్డాడు.

"అది తెలిస్తే ఇంత కంగారు ఎందుకు పడ్తాను?" చేతులు నలుపుకున్నాడు వెంకట్.

"మరి ఇప్పుడెలా?"

"ప్చ్.. అదే అర్థం కావడంలేదు"

"ఆ పోరి నీ కళ్లుగప్పి పారిపోవడానికి నువ్వెక్కడికి వెళ్లావు?"

"ఆ దరిద్రపు ఫైల్లు సర్దుతున్నాను"

"అరరే"

"ఆ ఫాదర్‌గాడు వస్తున్న జీపుకు యాక్సిడెంట్ జరిగింది. అందులో మన కానిస్టేబుల్స్, ఎస్.ఐ కూడా వున్నారు. ఎవ్వరికీ ఏం కాలేదు. కాకపోతే ఆ పోరికి కొద్దిగా బిల్డప్ ఇచ్చాను. అదీ నా లైను క్లియర్ అవుతుందేమోనని. ప్చ్.. ఒప్పుకోలేదు. పైగా పారిపోయింది. ఆ పోరి డైరెక్టుగా ఆసుపత్రికి వెళ్లిందేమో? వెళ్తే మాత్రం మన గురించి చెప్పేస్తుంది. వెళ్లినా వెళ్లకపోయినా మన ఉద్యోగం మాత్రం ఊడుతుంది ప్చ్.." రెండు విధాలా కలవరపడిపోయాడు వెంకట్.

"అవునవును. అనవసరంగా ఆ పోరితో ఎక్స్‌ట్రాగా ప్రవర్తించాం. ఇప్పుడేం చేద్దాం?" కృష్ణ మరింత కలవరపడిపోతూ ఏకంగా తల పట్టుకుని మెట్లపై కూలబడిపోయాడు.

★ ★ ★

ఇక్కడ గౌసియా వెళ్తున్న బస్సులోంచి బయటకు చూస్తూ నిశ్శబ్దంగా కూర్చుండిపోయింది.

బస్సులోని స్త్రీ పురుషులు పాటలు పాడుతున్నారు. గౌసియా ఎవ్వరిపాటనూ వినడం లేదు. ఆమె మెదడు రకరకాల ఆలోచనలతో నిండిపోయి వుంది. ఆ ఆలోచనలు ఆమెను ఒకవైపు భయపెడుతున్నాయి, ఒకవైపు కలవరపెడుతున్నాయి, మరోవైపు తొందరపెడుతున్నాయి, ఇంకోవైపు ఎటూ అర్థం కాకుండా చేస్తున్నాయి.

## శుక్రవారం

గౌసియా గురించిన మొత్తం సమాచారం అన్ని తెలుగు, హిందీ, ఇంగ్లీషు, మరాఠి దిన పత్రికల్లో ప్రధానవార్తగా ఫోటోలతోసహా ప్రచురింపబడింది. ఎవ్వరూ ఊహించని గౌసియాగాథ దేశం మొత్తంమీద సంచలనం సృష్టించింది. ఎవ్వరినోట చూసినా ఆ మాటలే వినబడసాగాయి.

గౌసియాకు అదేమీ తెలియదు. పెళ్ళివాళ్ళతో కలిసి రెండుగంటలకల్లా హైద్రాబాద్ చేరుకుంది. అప్పటివరకూ పెళ్ళిజనాలు



ఆమెను పెద్దగా పట్టించుకోలేదు.

అందరితోపాటుగా బస్సు దిగి అటూ ఇటూ చూసింది. అది ఆమెకు ఏమాత్రం పరిచయంలేని ప్రాంతం. అయినప్పటికీ ఎరిగినవాళ్ళు ఎవ్వరైనా కనబడ్తారేమో అన్న ఆశతో జనాల్ని కలియచూసింది.

పెళ్ళివాళ్ళ ఇంటికి వెళ్ళాక కూడా తెలిసినవాళ్ళకోసం ఆమె కళ్ళు గాలించసాగాయి.

"అమ్మాయీ" అంతలోనే ఎవరో పిలిచారు.

ఎవరన్నట్టుగా చూసింది గౌసియా.

"నీవు చందూలాల్ కూతురివి కదూ? " అడుగుతూ వచ్చి ఆమె పక్కలో కూర్చుంది ఒక నడివయసు స్త్రీ.

వెంటనే ఏంచెప్పాలో తోచలేదు గౌసియాకు. చేసేది లేక అవును అన్నట్టుగా తలాడించింది.

"నేను నిన్ను రాత్రినుంచి చూస్తున్నాను. ముఖంమాత్రం అచ్చు అలాగేఉంది కానీ, అవునా కాదా అనుకుంటున్నాను" అంటూ మరికొంచెం చేరువగా జరిగి, "మరి ఒక్క

సొమ్ము కూడా పెట్టుకోలేదు ఎందుకు? " అడిగింది.

"పెట్టుకోలేదు" ఇబ్బందిగానూ భయం గానూ అంది గౌసియా.

"అవున్లే! చిన్నపిల్లవికదా. ఎందుకైనా మంచిది అని పెట్టలేదనుకుంటాను? అవునూ మీ అమ్మానాన్న రాలేదుకానీ, నువ్వు ఒక్కతివే వచ్చావేంటీ? "

"వచ్చాను"

"మీ అమ్మావాళ్ళు వెనక వస్తారేమో కదూ? "

"అవును"

"మీ అన్నయ్య డాక్టరు కోర్సు చదువుతు న్నాడుకదూ? "

"అవును"

'మరి నీవేం చదువుతున్నావు? "

"నేను పదవ తరగతి"

"నీ పేరు ఏదో వుంది కదా? మాలతి కదూ? "

"అవును"

"ఆ... మాలతీ! ఒక్కపని చెప్తాను చేస్తా వుకదా? "

"చెప్పండి"

"మరేంలేదు. నాకు కొద్దిగా తలనొప్పిగా వుందమ్మా. ఆ ఎదురుగా కనిపిస్తున్నాయే దుకాణాలు, అక్కడికి వెళ్ళి ఒక అమృతాం జనం సీసా, అనాసిన్ మాత్రలు తీసుకురా.

"పని చెప్తున్నానని మరేం అనుకోవద్దు. నేను నీకు మేనత్త వరస అవుతాను. నువ్వు గుర్తుపట్టలేవుగానీ, మీ నాన్న నాకు బాగా తెలుసు" అందామె.

"సరే" తలాడించింది గౌసియా.

"వేరే ఎవ్వరికైనా ఈ పని చెప్పేదాన్నే అనుకో! కానీ నాకు ఇక్కడ ఎవ్వరూ తెలీ దమ్మా. అందుకే నువ్వేం అనుకోవద్దు" డబ్బులు అందిస్తూ క్షమార్పణగా ముఖం పెట్టిందామె.

"ఏమీ అనుకోనులే" అంటూ డబ్బు అందుకుని బయటకు నడిచింది గౌసియా.

బయటకు వెళ్ళగానే తెల్సినవాళ్ళు ఎవ్వ రైనా కనిపిస్తారేమోనన్న ఆతృత ఆమెలో రెట్టింపు అయ్యింది. ఎందుకంటే ఒకచోట జనాలు గుమిగూడి వున్నారు. వాళ్ళకు సమీపంగా వెళ్ళి అందర్నీ కలియచూసింది గౌసియా.

వాళ్ళంతా ఒక షాపుముందు నిల్చుని టీవీలో క్రికెట్ చూస్తున్నారు. వాళ్ళల్లో ఒక్కరు కూడా తెల్సినముఖం కనబడలేదు.

"ప్చ్! ఎవరైనా కనిపిస్తే బాగుణ్ణు" అను కుంటూ మెడికల్ షాపు దగ్గరికి అలా వెళ్ళిందోలేదో, దూరంనుండి అరు పులు వినబడ్డాయి.

ఎవరన్నట్టుగా కంగారుపడిపోతూ అటు కేసి చూసింది గౌసియా.

కొందరు యువకులు కత్తులు పట్టుకుని వికృతంగా అరుస్తూ పరుగెట్టుకొస్తున్నారు. అది చూసి భయంతో దుకాణాలు మూసు కుంటున్నారు అందరూ. మొదట కొందరు యువకులే కనిపించారు కానీ, చూస్తుండ గానే గుంపులు గుంపులుగా పుట్టుకొచ్చారు అల్లరిమూకలు. క్షణాల్లో ఆ ప్రాంతం అంతా భయానకంగా మారిపోయింది. అమాయక జనాలు చెల్లాచెదురవుతున్నారు. కొన్ని వాహనాలు ఎక్కడివక్కడ ఆగిపో యాయి. అల్లరిమూకలు కొందరు వాటి అద్దాల్ని విచక్షణారహితంగా పగలగొట్టడమే కాదు, వాహనదారుల్ని రాక్షసంగా కిందికి లాగి చితకబాదుతున్నారు.

మరికొన్ని వాహనాలు పక్కనవున్న సందుల్లోకి వేగంగా జొరబడిపోతున్నాయి. ఇంకొందరు వాహనదారులైతే వాహనాల్ని వదిలేసి పారిపోతున్నారు.

అంతా బీభత్సం... గందరగోళం... అయోమయం... రోడ్లమీద నిలిచిపోయిన వాహనాలు, పరుగెడుతున్న జనాలు, ప్రాణ భయాన్ని వ్యక్తంచేస్తూ వినిపిస్తున్న హాహా కారాలు, వికృతాన్ని చాటిచెబుతున్న కేకలు, అంతా ఒక కురుక్షేత్రంలా తయారయ్యింది.

గౌసియా చుట్టూ చూసింది. అప్పటికి అన్ని షాపులూ మూసివేయబడివున్నాయి.

"యా... అల్లా" బిగ్గరగా అరుస్తూ అక్కడినుండి పారిపోయే ప్రయత్నం చేసింది. అంతలోనే నిలువు నామం దిద్దుకుని, కాషాయపు గుడ్డను తలకు చుట్టుకున్న ఒక యువకుడు, కత్తితో ఆమె వీపులో కసిగా పొడిచాడు.

"అమ్మా..." తెలుగులో పెనుకేక వేస్తూ, కత్తిపోటును లక్ష్యపెట్టక అలాగే పరుగెట్టబోయింది గౌసియా.

అంతలోనే ఒక ముస్లిం యువకుడు కత్తితో ఆమె భుజాన్ని పొడిచాడు. అయినప్పటికీ ఆమె ఆగలేదు. బాధను భరిస్తూ అలాగే ముందుకు పరుగెట్టింది.

ఆమెకు దారి తెలియట్లేదు. దిక్కుతోచనట్టుగా పరుగెత్తసాగింది. ఒకవైపు రక్తం ఆమె గుడ్డల్ని తడిపేస్తూనే వుంది.

కొంతదూరం పరుగెట్టాక రైల్వేస్టేషన్ కనబడింది. ప్లాట్‌ఫామ్‌పై ఒక రైలు చిన్న జర్కుతో అప్పుడే కదులుతోంది. ప్రాణాల్ని రక్షించుకునే ప్రయత్నంలో చాలామంది అభాగ్యజనాలు పరుగెట్టుకుని వెళ్ళి ఆ రైల్లోకి ఎక్కుతున్నారు. వాళ్ళతోపాటుగా పరుగెట్టుకువెళ్ళి రైలు ఎక్కబోయింది గౌసియా. కానీ ఆమెకు వెళ్తున్న రైలు ఎక్కడం చేతకాలేదు. అయినప్పటికీ పట్టు వదలకుండా రైలు వెంటే కొంతదూరం పరుగెట్టి, ఒక యువకుడు చేయి అందించడంతో రైలు ఎక్కగలిగింది.

రైల్లో అందరూ గౌసియా పరిస్థితిని చూసి "అయ్యయ్యో..." అంటూ గాభరాపడ్డారు.

"మత కొట్లాటలు జరుగుతున్నాయి. ఈ దరిద్రపు నా కొడుకులకు మతం ఏంపెట్టిందో తెలీదుగానీ, మానవతను మరిచి పోట్లాడుకుంటున్నారు" ఎవరో అన్నారు.

అప్పటికి గౌసియా పరిస్థితి తీవ్రంగా తయారయ్యింది. దప్పికతో ఆమె నోరు పిడచకట్టుకుపోసాగింది. కళ్ళు మూతలు పడసాగాయి. మరోవైపు రక్తస్రావం ఎక్కువౌతూ ఒంట్లో శక్తి పూర్తిగా నశించసాగింది. ఇంకోవైపు కత్తిగాయాలు శరీరాన్ని బాధపెడుతూ కలిచివేయసాగాయి.

"పాపం! పిల్ల పరిస్థితి అనోలావుంది. కనీసం పక్క స్టేషన్లో నైనా ఎవ్వరికైనా అప్పజెప్పుదాం"

"పాపం... ఎవ్వరో ఉన్నోళ్ళ పిల్లలా వుంది. ఎక్కడికీ ప్రయాణించినట్టులేదు, కలహాలకి భయపడి రైలుఎక్కినట్టుంది"

"ఎవరి ఖర్మ ఎలా రాసిపెట్టి వుంటే అలా జరుగుతుంది. ఆ పిల్లను అనవసరంగా పట్టించుకుని గాలికి పోయే కంపను తలకు తగిలించుకునే ప్రయత్నం చేయొద్దండి"

కనికరం చూపేవాళ్ళు, కాఠిన్యం పంచే వాళ్ళు, ఎవరికి తోచినట్టుగా వాళ్ళు మాట్లాడుతున్నారు. కానీ ఏ ఒక్కరూ కూడా ఆమె దగ్గరికి రాలేదు.

రైలు వేగంగా ప్రయాణిస్తోంది. క్షణక్షణానికి గౌసియా పరిస్థితి కూడా విషమించసాగింది. ప్రాణాలు పోయేంతగా కత్తిపోట్లు ఆమెను గాయపర్చకపోయినా, పట్టించుకునే నాథుడు లేనందున ఆమెకు ప్రాణాపాయస్థితే ఏర్పడింది.

"హ... హమ్మా... అమ్మా... మా..." ఆయాసపడసాగింది గౌసియా. ఆమె రైలు ఎక్కేందుకు చేయిని ఆసరా ఇచ్చిన యువకుడు ఆమెను ఎంతోసేపు అలా చూస్తూ ఉండలేకపోయాడు. వచ్చి ఆమె గాగ్రాపైటతో ఆమె గాయాలకు కట్టు కట్టసాగాడు.

"బాబూ... వూరుకోవయ్యా! ఇట్లాంటి కేసులు ప్రాణంమీదకి వస్తాయి" అన్నారు ఎవరో.

"ఛ... నోర్మూసుకోండి. మీకు మానవత్వం ఏ కోశాన వున్నా ఈ విధంగా మాట్లాడరు" గదమాయింపుగా అన్నాడు అతడు.

"ఎవరి ఖర్మ వాళ్ళది. మనకెందుకు?" ఎవరో గొణిగారు.

ఆ యువకుడు ఎవ్వర్నీ పట్టించుకోలేదు. గౌసియా గాయాలకు కట్టుకట్టి వాటర్ బాటిల్ కోసం అటూ ఇటూ చూశాడు. ఎవరో చిన్నపిల్లాడు కూల్ డ్రింక్ తాగుతూ కనిపించాడు.

ఆ యువకుడు పరుగున ఆ పిల్లాడి దగ్గరకి వెళ్ళి, కూల్ డ్రింక్ సీసా లాక్కుని, గౌసియా దగ్గరకి అదే పరుగుతో వచ్చి ఆమె ముఖంమీద కొంత చిలకరించి, మిగతాది ఆమెతో తాగించసాగాడు.

అవతల ఆ పిల్లాడు కూల్ డ్రింక్ సీసా కోసం గుక్కపెట్టి ఏడవసాగాడు.

"బావున్నావు కదయ్యా! పిల్లాడి కూల్ డ్రింక్ లాక్కుని తాగిస్తున్నావు" ఆ పిల్లాడి తాలూకు వాళ్ళు అన్నారు.

"అవతల ఆ మనిషి చస్తుంటే, కూల్ డ్రింక్ కోసం చూసుకుంటావేంటమ్మా? నువ్వు ఎలాంటి మనిషివి?" మరెవరో ఆవిడమీద కొద్దిగా కోప్పడ్డారు.

పక్క స్టేషన్‌లో రైలు ఆగింది. ఆ యువకుడు ఆలస్యం చేయలేదు. గౌసియాను చేతులమీదకు ఎత్తుకుని రైలుదిగి ఆటోలో హాస్పిటల్ కి తీసుకెళ్ళాడు. అప్పటికే గౌసియాకు స్పృహ తప్పింది.

వెనువెంటనే చికిత్స అందించారు. గంట తర్వాత స్పృహలోకి వచ్చి చూసుకుంటే, వదులైన తెల్లని దుస్తులు వున్నాయి తన శరీరంమీద.

"పాపా" పిలిచాడు డాక్టర్.

"మా..." నీరసంగా పలుకుతూ చూసింది గౌసియా.

"ఎలా వుంది?"

"బాగుంది" అన్నట్టుగా తలాడించింది గౌసియా.

"డాక్టర్" అంతలో పిలుస్తూ వచ్చాడు యువకుడు.

"యస్" అంటూ అటు తిరిగాడు డాక్టర్.

"అమ్మాయికి ఎలా వుంది?" అడిగాడు యువకుడు.

"బాగుంది. చెప్పిన మందులు అన్నీ తీసుకొచ్చావా?" అంటూనే అతడి చేతిలోని మందుల ప్యాకెట్స్‌ని తన చేతిలోకి తీసుకున్నాడు డాక్టర్.

యువకుడు అమ్మాయి దగ్గరకి నడిచాడు. డాక్టర్ తన గదిలోకి వెళ్తూ, "మిస్టర్... ఈ మెడిసిన్స్ అన్నీ ఒక్కసారి చెక్ చేస్తాను" చెప్పాడు.

"ఒకే డాక్టర్..." అని, "అమ్మాయీ" గౌసియా ముఖంలోకి చూశాడు యువకుడు.

గౌసియాకు అతడు ఎవరో అర్థంకాలేదు.

"నాపేరు మోహన్... నిన్ను ఇక్కడికి తీసుకువచ్చింది నేనే" చెప్పుకున్నాడు అతడు.

గౌసియా కళ్ళల్లో కృతజ్ఞతాభావం పొంగి పొర్లింది.

"ఇప్పుడు నీకేంకాదు. నీవు అన్నివిధాలా క్షేమంగా వున్నావు. కాపోతే ఒక నెలరోజులు రెస్ట్ తీసుకోవాలి" అంటూ గౌసియా పక్కన కూర్చుని, "నీ చిరునామా చెప్పు. మీ అమ్మావాళ్లకు కబురుచేస్తాను" అన్నాడు అతడు.

"మాది హైదరాబాద్" చెప్పింది గౌసియా.

"హైద్రాబాదులో ఎక్కడ వుంటారు?"

"పత్తర్‌బజార్"

"నీపేరు, మీ నాన్నగారి పేరు, మీ చిరునామా మొత్తంగా చెప్పు?"

"నా పేరు..." అంటూ ఆగిపోయి, "నువ్వెవరు?" అడిగింది గౌసియా.

"చెప్పాను కదా... నా పేరు మోహన్. నాదీ హైద్రాబాదే. బాంబే వెళ్తున్నాను. కాకపోతే నీకోసం ఇక్కడ దిగాల్సి వచ్చింది"

"శుక్రియా..." గౌసియా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"ఫర్వాలేదులేమ్మా! నువ్వు నా చెల్లెల్లాంటి

దానివి" చిన్నగా నవ్వాడు అతడు.

"మా పత్తర్‌బజార్‌లో కూడా గొడవలు జరిగాయా? " అడిగింది గౌసియా.

"ఎక్కడ జరిగితేనేమి? ఈ గొడవలు ఎక్కడ జరిగినా అవి మానవతకి కడుతున్న సమాధులు" ఆవేశంగా మాట్లాడాడు మోహన్.

ఆమె మౌనంగా చూసింది.

"మనసుల్లేని ఈ మనుషులు రాన్రానూ రాక్షసులౌతున్నారు. లేకపోతే ఇన్ని అన్యాయాలు, మోసాలు, దారుణాలు ఎందుకు జరుగుతాయి? ఛ" అని కాసేపాగి, "మన హైద్రాబాదుకు చెందిన ఒక ముస్లిం అమ్మాయిని, అరబ్బు షేక్‌కు అమ్మివేశాడుట ఒక పాపిష్టి తండ్రి. ఆ తండ్రిలాంటి తండ్రులు ఇంకా ఎందరో ఉన్నారు. కానీ ఆ అమ్మాయిలాంటి అమ్మాయిలు మాత్రం ఎవ్వరూ లేరనిపిస్తుంది. ఎందుకంటే ఆ అమ్మాయి ఎంతో ధైర్యంగా అరబ్బుషేక్‌ని ఎదురుతిరిగి చంపేసింది. రియల్లీ అయామ్ ప్రౌడ్ ఆఫ్ హెర్!

"ఇంతేకాదు, ఆ అమ్మాయి... ఒక హిందూ యువకుడు ప్రేమించుకున్నారట. అయితే ఆ యువకుడు అదేరోజు రాత్రి ఆ తండ్రిని నిలువునా నరికిపడేసాడట. మంచి పని చేశాడు" అదే ఆవేశంతో మాట్లాడ్తూ పోయాడు అతడు.

అతడి మాటలు పూర్తికాకముందే గౌసియా స్తంభించిన ప్రకృతిలా తయారయ్యింది.

"అ...ది..." తండ్రి మరణం ఆమెను కలిచివేయసాగింది.

"ఈరోజు గొడవలు ఈ విషయమై తలెత్తాయి. ఛూ... పొరపాటున మనుషులుగా పుట్టారీ మతపిచ్చి వెధవలు" పళ్ళ బిగువున అన్నాడు అతడు.

ఆమె మామూలు మనిషి కాలేకపోతోంది. కళ్ళ వెంబడి నీళ్ళు ధారాపాతమౌతున్నాయి. ఏదో మాట్లాడాలనుకుంటూ మాట్లాడలేకపోతోంది.

"భయపడవద్దమ్మా! ఇట్లాంటి గొడవలు సహజమే కదా? " అన్నాడు అతను.

"అ... అ... ఆ యువకుడికి ఏం కాలేదా? " వణుకుతున్న గొంతును బలవంతాన పెగల్చుకుని అడిగింది.

అంతలోనే డాక్టర్‌నుండి అతడికి పిలుపు వచ్చింది. "ఇప్పుడే వస్తాను" అంటూ వెళ్ళిపోయాడు అతడు. కాసేపటి తర్వాత డాక్టర్‌తో కలిసి వచ్చాడు మోహన్. ఇద్దరూ కల్సి గౌసియా వివరాల్ని అడిగారు.

"నేను ఈ గొడవలమధ్య ఇంటికి వెళ్తే మరిన్ని గొడవలు జరుగుతాయి. వెళ్ళకపోవడమే మంచిది" మనసులో అనుకుని, "నన్ను మీ వెంట బొంబాయికి తీసుకెళ్ళండి. అక్కడ మరియా ఆశ్రమంలో ఫాదర్ వుంటాడు. మదర్లు వుంటారు" చెప్పింది గౌసియా.

"ముందు నీ పేరేంటో చెప్పు? " డాక్టర్ అన్నాడు.

"నా పేరు గౌసియా"

"మీ నాన్న పేరు? "

"సాయిబు"

"మీ నాన్న ఏం చేస్తాడు? "

"పత్తర్‌బజార్‌లో చాయ్‌బండి అమ్ముతుంటాడు" ఏడుస్తూ చెప్పింది.

ఆమెను వాళ్ళు ఇంకేం అడగలేదు. ఆమె చెప్పిన ఆ మూడు వివరాలే ఆ ఇద్దరిలో అనుమానం తెప్పించాయి.

"అంటే... నువ్వు ఆ అమ్ముడుపోయిన అమ్మాయివా? " ఆరా తీసినట్టుగా అడిగాడు డాక్టర్.

"అ... వు...ను..." ఏడుస్తూనే చెప్పింది.

"ఐసీ..." అని కిందిపెదవి పైపంటితో బిగించి, "మిస్టర్, చాలామంచిపని చేశావు" అంటూ మోహన్ భుజం తట్టి, "అవునూ, బాంబేనుండి హైద్రాబాద్‌కి ఎవరివెంట వచ్చావు? " కనుబొమ్మలు ముడిచాడు

డాక్టర్

అక్కడి తన పరిస్థితిని వివరించుకుంది గౌసియా.

"షిట్! ఈ నయవంచకులకు కామమే తప్ప మరేం తెలీనట్టుంది. కోరికలు ఎవ్వరికైనా వుంటాయి. అలాగని ఏ పరిస్థితుల్లో ఎలా ప్రవర్తించాలో తెలీదా ఈ రాక్షసులకి? అయినా రక్షకభటులైవుండి కూడా బాధ్యతా రహితంగా ప్రవర్తించారంటే ఆ వెధవల్ని నరికిపోగులు పెట్టాల్సిందే" పిడికిళ్ళు బిగించాడు మోహన్.

"ఈ సమాజంలో అట్లాంటివాళ్ళు సహజమే. కాలమే వాళ్ళకు బుద్ధి చెప్తుంది" అని గౌసియాకు ఏదో ఇంజక్షన్ ఇచ్చి, "ఆ మిస్టర్ మోహన్! ఈ అమ్మాయి కోలుకునే వరకు ఇక్కడే వుంటుంది. మీరు అర్జెంటు పనిమీద బాంబే వెళ్తున్నాను అన్నారుకదా, ఇక మీరు వెళ్ళొచ్చు. మంచి మనసుతో ఈ అమ్మాయిని కాపాడినందుకు, మీరు వెళ్ళే పని సక్సెస్ అవుతుంది. విష్ యూ ఆల్ ది బెస్ట్! మీకూ మీ మంచితనానికి హాట్సాఫ్..." డాక్టర్ మాటల్లోనే కాదు, ఆ కళ్ళల్లోనూ ప్రస్ఫుటమౌతున్న ఎంతో ఉన్నతమైన ప్రశంస.

"అమ్మాయిని జాగ్రత్తగా ఇంటికి చేర్చండి పోలీసుల సహాయం తీసుకొనైనాసరే, అవసరమైతే అమ్మాయి ఇంటికి చేరుకునేవరకు మీరు కూడా వెంటే వుండండి" చెప్పాడు మోహన్.

"తప్పకుండా" అన్నాడు డాక్టర్.

మరి కాసేపటి తర్వాత డాక్టర్ వద్ద, గౌసియావద్ద సెలవు తీసుకుంటూ ఇద్దరికీ తన విజిటింగ్ కార్డు ఇచ్చి వెళ్ళిపోయాడు మోహన్.

మోహన్ గురించే ఆలోచిస్తూ పడుకుంది గౌసియా. అతడు ఆమెకు దేవుడిలా తోస్తున్నాడు. వెళ్ళేముందు తనకు స్వంత చెల్లెలు అన్న భావనతో జాగ్రత్తలు చెప్పడమే కాకుండా, బాంబేనుండి తిరిగి వచ్చాక తప్పకుండా కలుస్తానని మరీమరీ చెప్పి వెళ్ళిపోయిన అతడి వాత్సల్యం... ఆమె మనసును ద్రవింపచేస్తోంది.

"ఈ పాలు, బ్రెడ్ తీసుకో" కాసేపటి తర్వాత బన్నుముక్కలు, పాల గ్లాసుతో వచ్చింది నర్సు.

"ఆకలిగా లేదు" చెప్పింది గౌసియా.

"లేకపోయినా పాలు తాగి, కొద్దిగా బ్రెడ్డు తిను. ఎందుకంటే... ముందే నీరసంగా వున్నావు. తినకపోతే మరింత నీరసమైపోతావు" అంది నర్సు.

గౌసియా ఇంకేం మాట్లాడలేదు. నర్సు సహాయంతో నెమ్మదిగా లేచి కూర్చుంది. పాలల్లో బ్రెడ్ కలిపి స్పూన్‌తో మెల్లగా తినిపించసాగింది నర్సు. రెండుస్పూన్లు అలా తిందో లేదో భవానీశంకర్ గుర్తొచ్చాడు ఆమెకు.

"వద్దు" ముంచుకొస్తున్న దుఃఖంతో నర్సును దూరం జరిపింది.

"ప్చ్! విసిగించొద్దు" అంది నర్సు.

"నా భవానీ శంకర్‌కి ఏంకాలేదు కదా. అతడు క్షేమంగా వున్నాడు కదా? " అడిగింది గౌసియా.

"భవానీశంకర్ ఎవరు? " కనుబొమ్మలు ముడిచింది నర్సు.

ఏం చెప్పలేకపోయింది గౌసియా. ధారాపాతమౌతున్న కన్నీళ్ళను తుడ్చుకుంటూనే, మరోవైపు నర్సు తినిపిస్తున్న బ్రెడ్‌ను బలవంతంగా మింగసాగింది.

★ ★ ★

రాత్రి పదిగంటలు కావొస్తోంది. నెత్తుటి గాయాలు శరీరాన్ని బాధిస్తుంటే గౌసియాకు నిద్రపట్టడంలేదు. తోడుగా భవానీ శంకర్ గూర్చిన ఆలోచనలు ఆమె హృదయాన్ని వేదనతో ఉడికిస్తున్నాయి. కాగా, తండ్రి మరణం మాత్రం ఆమెను పెద్దగా కృంగదీయడంలేదు.

"కనికరం లేకుండా నన్ను అమ్ముకున్న అబ్బా గురించి నేనెందుకు బాధపడాలి?

అబ్బా కారణంగానే నేను ఇప్పుడు ఇన్ని అవస్థల్ని ఎదుర్కొంటున్నాను. అట్లాంటి అబ్బా కోసం నేనెందుకు ఏడవాలి? కాకపోతే అమ్మా... చెల్లెళ్ళు... ఎలా వున్నారో?

నా భవానీశంకర్ ఎక్కడున్నాడు? ఎలా వున్నాడు? పోలీసులు పట్టుకువెళ్ళి తనను హింసించడంలేదు కదా? పాపం నా కోసం తను ఎంత తెగించాడు" మనసులో మౌనంగా తలుస్తూ రూఫ్‌కేసి చూస్తున్న గౌసియా, ఎవరో వస్తున్నట్టనిపించి డోర్ వైపు చూసింది.

ఎవరో ఇద్దరు వ్యక్తులు డాక్టర్‌తో కలిసి లోపలికి వచ్చారు. ఎటూ చూడకుండా నేరుగా లోపలికి నడిచారు. కాసేపటి తర్వాత మరో ఇద్దరు వ్యక్తులు వచ్చి వాళ్ళు కూడా లోపలికి నడిచారు.

గౌసియా ఎవ్వర్నీ పెద్దగా పట్టించుకోలేదు. ఎటూ నిలవడంలేని మనసు మెదడును గందరగోళం చేస్తుంటే నెమ్మదిగా కళ్ళు మూసుకుంది.

కాసేపటి తర్వాత అనుకోకుండా కడుపులో నొప్పి ఆరంభమైందామెకు. తనకు అప్పుడప్పుడూ కడుపు నొప్పొస్తుంటుంది. కానీ ఇంత విపరీతంగా ఎప్పుడూ నొప్పి రాలేదు.

బాధ చెప్పనలవి కానిదిగా వుంది. భరించడం చేతకావడంలేదు. "అమ్మా... అమ్మా..." తాళలేక అటూ ఇటూ కదులుతుంటే గాయాలపై ఒత్తిడి పెరుగుతూ ప్రత్యక్ష నరకం కనబడుతోంది.

ఆమె ఇక ఎంతోసేపు బాధను ఓర్చుకోలేక అతి ప్రయాసగా బెడ్ దిగి డాక్టర్‌కోసం ముందుకు నడిచింది. వెళ్ళేందుక్కూడా ఆమెకు శక్తి చాలనట్లుగా వుంది. గోడను ఆసరాగా పట్టుకుని, అటూ ఇటూ వున్న గదుల్లో డాక్టర్‌ను వెదుక్కుంటూ... లోపలికి నడిచి వెళ్ళసాగింది.

కొంతదూరం వెళ్ళాక విశాలంగా వున్న హాల్లు ఒకటి వచ్చింది. "డాక్టర్" పిలుస్తూ ఆ హాల్లోకి ప్రవేశించింది గౌసియా.

అది ఔట్ పేషెంట్స్‌కు ఉద్దేశించిన హాలు. అదేమీ ఆమెకు తెలీదు. హాలును దాటి ముందుకు నడిచింది. అక్కడ ఒక గదిలో వచ్చినవాళ్ళతో కూర్చుని హాయిగా పేకాడుతూ కన్పించాడు డాక్టర్. వాళ్ళు మందు కూడా సేవిస్తున్నారు.

"డాక్టర్" ఆయాసపడుతూ ఆ గదిలోకి వెళ్ళింది గౌసియా. అందరూ ఒకేసారి గౌసియా వైపు చూశారు.

"డాక్టర్... కడుపులో నొప్పి" అతి కష్టంగా చెప్పింది గౌసియా.

"వెళ్ళి పడుకో వస్తాను" తాగిన మత్తులో వంకరగా చెప్పాడు డాక్టర్.

"చాలా నొప్పిగా వుంది డాక్టర్" ఏడుస్తూ చెప్పింది గౌసియా.

"మరేం కాదులే. వెళ్ళి పడుకో" డాక్టర్‌లో మార్పులేదు. ఏడుస్తూనే తిరిగి బయటకు నడిచింది గౌసియా. మధ్యలో ఎదురయ్యాడు హాస్పిటల్ కాంపౌండరు.

"ఏంటమ్మా?" గౌసియాను చూడగానే అతడిలో ఆతృత.

"కడుపులో నొప్పి" చెప్పింది గౌసియా.

"అయ్యో...! ఎంతసేపయ్యింది?"

"ఇప్పుడే! డాక్టర్ దగ్గరకి వెళ్తే... వెళ్ళి పడుకో వస్తానని చెప్పాడు" కడుపును గట్టిగా పట్టుకుంటూ చెప్పింది గౌసియా.

"ప్చ్...! వీడు ఇంతేనమ్మా! పగలు పూట మాత్రమే వీడు మనిషి. రాత్రి కాగానే వీడికి పేకాట, మందు వుంటేచాలు. ఇలాంటి సమయంలో వీడితో చికిత్స చేయించుకుంటే చచ్చిపోవాల్సిందే. ఇద్దరు ముగ్గురు చనిపోయారు కూడా! నిన్ను వేరే హాస్పిటల్‌కు తీసుకువెళ్తాను పదమ్మా" చెప్తూనే తను కూడా గౌసియా వెంబడే ముందుకు నడిచాడు కాంపౌండర్.

కానీ గౌసియా నడవలేకపోతోంది. ఆమె పరిస్థితిని గ్రహించిన అతడు ఆమెను

రెండు చేతులమీదకు ఎత్తుకుని, గబగబా వెలుపలకి నడిచి, తన స్కూటర్‌పై కూర్చో బెట్టుకుని, పది నిముషాల్లో వేరే హాస్పిటల్‌కు తీసుకెళ్ళాడు.

అది గవర్నమెంట్ హాస్పిటల్. వీళ్ళు వెళ్ళేసరికి అక్కడ ఎవ్వరూలేరు. కాంపౌండరే వెళ్ళి డాక్టరును తీసుకువచ్చాడు.

డాక్టర్ వచ్చేసరికి హాస్పిటల్ మెట్లపై మెలికలు తిరుగుతూ పడివుంది గౌసియా.

"అరెరే..." గాబరాగా గౌసియాను తిరిగి తన రెండు చేతుల్లోకి ఎత్తుకుని, డాక్టర్ వెంట లోపలికి నడిచాడు కాంపౌండర్.

"అసలు ఈ అమ్మాయికి ఏమయ్యింది? " షర్టు పైకి తొలగి నడుముకు కట్టివున్న బ్యాండేజీ కనబడుతుంటే కనుబొమలు ముడిచి చూస్తూ అడిగాడు డాక్టరు.

"ఈ మధ్యాహ్నం హైదరాబాద్‌లో జరిగిన మతకలహాల్లో ఈ అమ్మాయి గాయపడింది. ఎవరో పుణ్యాత్ముడు ఈ అమ్మాయిని తీసుకు వచ్చి మా హాస్పిటల్లో చేర్పించాడు. అప్పుడే అనుకున్నా ఎలాగూ ఖర్చు పెట్టుకుంటున్నావు. ఆ పుణ్యం దక్కాలీ అంటే వేరే ఆస్పత్రికి తీసుకు వెళ్లకూడదా నాయనా అని.

"అయినా మా డాక్టర్ సంగతి కొత్తవాళ్లకు ఏం తెలుస్తుంది? తెల్సిన పాతవాళ్లు మాత్రం రావడం తగ్గించారు" చెప్పుకుపోయాడు కాంపౌండర్.

డాక్టర్ ఎంతమాత్రం ఆలస్యం చేయలేదు. గౌసియాను అక్కడ టేబుల్‌పై పడుకోబెట్టించి వెంటనే తన చికిత్సను ఆరంభించాడు.

మొదట అపెండిసైటిస్ అని అనుమానపడ్డారు కాంపౌండర్, డాక్టరూ. కాని చికిత్స తర్వాత అది సాధారణ కడుపునొప్పిగా తేలింది.

"అంటే ఇంక నాకేం కాదా? " ఏ విషయాన్ని డాక్టర్ కాంపౌండర్‌తో చెప్పాక ఆతృతగా డాక్టర్‌వైపు చూసింది గౌసియా.

"ఏం కాదు" చిరునవ్వుగా చెప్పాడు డాక్టర్.

"నాకు అప్పుడప్పుడూ సన్నగా కడుపునొప్పొస్తుంటుంది. ఆ నొప్పి కూడా రాకుండా మందులు ఇవ్వండి" అంది గౌసియా.

"తప్పకుండా ఇస్తాను" చెప్పి మందుల కోసం తన గదివైపు నడిచాడు డాక్టరు. వెంటే వెళ్తూ "డాక్టర్! నాకు అవతల పని వుంది. నేను వెళ్లవచ్చా? " అడిగాడు కాంపౌండర్.

"నువ్వెళ్లు. ఈ అమ్మాయితో ఆయాను ఉంచుతాను" చెప్పాడు డాక్టర్.

కాంపౌండర్ తిరిగి వెనక్కివచ్చి "పాపా! నేను వెళ్తాను. మళ్లీ రేపు ఉదయాన్నే వస్తాను" గౌసియాతో చెప్పాడు.

"మరి నా దగ్గర ఎవ్వరూ వుండరా? " అడిగింది గౌసియా.

"ఆయా వస్తుంది" చెప్పి, "నీకేం భయం లేదు. అక్కడ హాస్పిటల్లో ఎంత ధైర్యంగా వున్నావో, ఇక్కడ కూడా అంతే ధైర్యంగా వుండాలి" గౌసియా తల నిమురుతూ చెప్పి వెళ్లిపోయాడు కాంపౌండర్.

"అమ్మాయీ" కాసేపటి తర్వాత పిలుస్తూ వచ్చాడు డాక్టరు. ఏంటన్నట్లుగా నెమ్మదిగా తల తిప్పి చూసింది గౌసియా.

"నీకు అప్పుడప్పుడు కడుపునొప్పొస్తుంది అన్నావుకదా! ఏటైమ్‌లో వస్తుంది? " ఆమె కడుపును మృదువుగా వత్తుతూ అడిగాడు.

"టైం అనేది వుండదు. ఒక్కోసారి రాత్రి పూట... ఒక్కోసారి పగలుపూట... ఎప్పుడంటే అప్పుడే" చెప్పింది గౌసియా.

"అదికాదు, పీరియడ్స్ టైమ్‌లో నొప్పొస్తుందా అని అడుగు తున్నాను"

"పీరియడ్ అంటే? "

"బహిష్టు"

"ఛీ..." ఇబ్బంది పడిపోయింది గౌసియా.

"డాక్టర్‌దగ్గర సిగ్గు పడకూడదు. ఫ్రీగా మాట్లాడాలి" అన్నాడు డాక్టర్.

"అవును" ఇబ్బందిపడుతూనే చెప్పింది గౌసియా.

"ఐసీ" అంటూ తన చేతుల్ని ఆమె రొమ్ముల మీదకు పోనిచ్చి "ఆ టైమ్‌లో ఇక్కడ కూడా నొప్పిగా వుంటుంది కదూ? " అడిగాడు.

"ఊహూ" తల అడ్డంగా వూపింది.

"బాగా గుర్తు తెచ్చుకో" అంటూ ఆమె రొమ్ముల్ని మృదువుగా నొక్కాడు.

"లేదు" అతడి చేతులు తన ఎదమీద తచ్చాడుతుంటే ఆమె శరీరం కుంచించుకు పోసాగింది.

అతడు ఆ హాస్పిటల్లో జూనియర్ డాక్టర్. ఆడపిల్లల పిచ్చి ఎక్కువ. సీనియర్ డాక్టర్ ప్రతి స్త్రీలోనూ తల్లినో చెల్లినో చూస్తాడు కాని అతడు ప్రస్తుతం సెలవు మీద వూరెళ్లాడు. లేదంటే ఇప్పుడు తనే వచ్చేవాడు. తను లేడు. పైగా ఒక అందమైన అమ్మాయి హాస్పిటల్‌కి వచ్చింది. అందుకే ఆ డాక్టరు హృదయం ఆనందంతో ఎగసిపడుతోంది.

"నీ పేరేంటి? " అడిగాడు.

"గౌసియా" చెప్పింది.

"అమ్మాయి గౌసియా! కమలాకర్ మీకు బంధువు అవుతాడా? " అతి తెలివిగా ప్రశ్నించాడు డాక్టర్.

"కమలాకర్ ఎవరు? " అడిగింది గౌసియా.

"అదే నిన్ను ఇప్పుడు తీసుకు వచ్చాడే"

"ఏం కాదు"

"అలాగా" అంటూ పొరపాటున ఆమె రొమ్ముల్ని గట్టిగా నొక్కాడు.

"అమ్మా" ఆమె బాధగా అరిచింది.

"ఎవరికి ఏం అయింది డాక్టర్? " అప్పుడే అడుగుతూ వచ్చాడు ఆ హాస్పిటల్ కాంపౌండర్ దినకర్.

"కడుపునొప్పి పేషెంట్" అంటూనే తన చేతుల్ని గౌసియా కడుపు మీదకు చటుక్కున తీసుకువచ్చాడు డాక్టర్.

"దవాఖానా తెరిచి వుంటేనూ, ఎవరికి ఏం జరిగిందా అని పరేషాన్ అయ్యాను నేను" అన్నాడు దినకర్.

"ఈ అమ్మాయికి నో ప్రాబ్లమ్! కాకపోతే సెలైన్ అవసరం. వెళ్లి ఆయాను తీసుకు రండి" చెప్పాడు డాక్టర్.

"మీరు గమ్మత్తుగా మాట్లాడ్తుండరు. ఆయా ప్రొద్దుటే గదా వూరెళ్లింది" అన్నాడు దినకర్.

"ఓ అవును కదూ? మరి ఈ అమ్మాయికి సెలైన్ ఎక్కిస్తే దగ్గరగా ఎవరు వుంటారు? " అన్నాడు డాక్టర్.

"ముంతాజ్‌గాడ్ని తీసుకువస్తాగానీ ఈ అమ్మాయి తాలూకు వాళ్లు ఎవ్వరూ లేరా? " అడిగాడు దినకర్.

"ఎవ్వరూ లేరు"

"అదేంటీ? "

"అవన్నీ తర్వాత ముందు ముంతాజ్‌ను పిల్చుకురండి"

"వాడు రెండో ఆట సిన్మాకు వెళ్లాడు. రాగానే ఇక్కడికి పంపిస్తాను" అని "ఈ అమ్మాయిది ఏం నొప్పి? " అడిగాడు దినకర్.

"బ్లడ్ ఎక్కువగా పోవడం, శరీరం కదలికలకు గురికావడంవల్ల కడుపులో నొప్పి వచ్చింది అంతే" చెప్పాడు డాక్టర్.

అర్థం కానట్లుగా చూశాడు దినకర్. అతడి చూపులు గౌసియాకు అర్థమయ్యాయి. హైదరాబాద్ అల్లర్ల దగ్గర్నుండి, తనను హాస్పిటల్లో జాయిన్‌చేసిన కథ వరకు వివరంగా చెప్పుకుంది.

ఈలోగా ఇన్‌పేషెంట్స్ కొందరు అక్కడికి వచ్చారు. దినకర్‌తో పాటుగా అందరూ గౌసియాపట్ల జాలి కనబర్చారు. అందరూ రావడంతో డాక్టరు బుద్ధిమంతుడిగా మారాడు. ఆడపిల్లల పిచ్చి తప్పిస్తే అతడు నిజంగా బుద్ధిమంతుడే అని చెప్పాలి. అదే విషయాన్ని దినకర్ మనసులో అనుకున్నాడు.

"వీడి బుద్ధికి బ్రేకులు పడ్డాయి. వెధవ సన్యాసి"



సికింద్రాబాద్ రైల్వేస్టేషన్‌లో మద్రాసు నుండి వస్తున్న రైలు దిగాడు భవానీశంకర్.

జుట్టుచెదిరి, బట్టలు మాసిపోయి పీక్కుపోయిన మొహంతో పిచ్చివాడులా తయారై వున్నాడు అతడు.

బాగా పొద్దుపోయింది కాబట్టి స్టేషన్‌లో జనాలు పూర్తిగా పలచబడి వున్నారు. కొందరు ప్రయాణికులు అప్పటికే గురకలు కొడుతూ పడుకుని వున్నారు.

భవానీశంకర్ స్టేషన్‌దాటి ఇవతలకి నడిచాడు. అతడి నడక ఒంట్లో శక్తి లేనట్లుగా తడబడుతోంది.

"రేయ్... ఎవడ్రా అక్కడా? " స్టేషన్ బయట నిల్చుని వున్న రైల్వే పోలీసు కేకేశాడు.

భవానీ శంకర్ భయపడలేదు. నేరుగా పోలీసు వైపు నడిచాడు.

"ఎవడ్రా నువ్వు? తాగి తిరుగుతున్నావా ఏం? " దగ్గరగా వచ్చాడు పోలీసు.

"నమస్తే సార్! మద్రాసు నుండి ఒస్తున్నాను" పోలీసు దగ్గరగా రాగానే నీరసంగా చెప్పాడు భవానీ శంకర్.

పోలీసు ఒకమారు భవానీశంకర్‌ను ఆపాదమస్తకం పరిశీలనగా చూసి "నీది మద్రాస్ నుండి వస్తున్న ఫేసేనట్రా? " ఎగాదిగా చూస్తూ అన్నాడు.

అందుకు ఏం అనలేక ఇబ్బందిగా కదిలాడు భవానీశంకర్.

"రేయ్ నీ మొహం చూస్తుంటే ఫుట్‌పాత్ వెధవలా కనబడుతున్నావు. ఇంకొక్క నిముషం కూడా నా కళ్ల ఎదురుగా నిలబడొద్దు. చల్‌బే చల్" గదమాయింపుగా అన్నాడు పోలీసు.

"వెళ్తున్నాను సర్" అన్నాడు భవానీశంకర్.

"చల్‌బే" అన్నాడు పోలీసు.

ముందుకు నడిచాడు భవానీశంకర్.

"రేయ్" మళ్లీ పిలిచాడు పోలీసు.

ఆగి వెనక్కి చూశాడు భవానీశంకర్.

"ఇట్టారా" పిలిచాడు పోలీసు.

దగ్గరగా వచ్చాడు భవానీశంకర్.

"నీవు ఈ చుట్టుపక్కల ఎక్కడా కనబడకూడదు. పొరపాటున కనబడ్డావనుకో రైల్వే దొంగ కింద కేసుబుక్ చేసి... బొక్కలో తోయిస్తాను కొడకా" బెదిరించాడు పోలీసు.

"వెళ్లిపోతున్నాను" అంటూనే ముందుకు నడిచి "ఈ పోలీసునాయాళ్లకి జులుం చేయడం ఒక్కటి బాగా తెలుసు" మనసులో అనుకున్నాడు భవానీశంకర్.

బస్టాపును దాటి ముందుకు నడిచాక ఎస్టీడీ బూతు ఒకటి కనబడింది. ముగ్గురు వ్యక్తులు కంటే ఎక్కువలేరు అక్కడ. వెళ్లి వాళ్ల మధ్యలో కూర్చున్నాడు భవానీశంకర్.

అరగంట తర్వాత భవానీశంకర్ ఛాన్సు వచ్చింది. గ్లాస్ క్యాబిన్‌లోకి వెళ్లి స్నేహితుడు గోపాల్‌కు నంబర్ కలిపాడు భవానీ శంకర్. ఎంగేజ్ వచ్చింది. అంతలో మరెవ్వరో కస్టమర్ వచ్చాడు.

"బాయ్... నీది లోకలేకదా, తర్వాత చేసుకో" క్యాబిన్ తెరిచి మరీ చెప్పాడు

ఎస్టీడీ యజమాని.

"వీడొకడు" మనసులో తిట్టుకుంటూ వెలుపలికి వచ్చాడు.

పావుగంట తర్వాత వచ్చిన కస్టమర్ వెళ్లి పోయాడు. అందుకోసమే టెన్షన్‌గా ఎదురు చూస్తున్న వాడు వెంటనే క్యాబిన్‌లోకి వెళ్లి తనక్కావల్సిన నంబర్ మరోసారి ప్రయ త్నించాడు. అవతల రెండురింగులు రాగానే డైరెక్టుగా గోపాలే లైన్లోకి వచ్చాడు.

"హలో"

"అరే గోపాల్ నేనురా భవానీశంకర్‌ను" స్నేహితుడి గొంతును వెంటనే గుర్తుపట్టాడు భవానీశంకర్.

"ఎక్కడున్నావురా? " గోపాల్‌లో ఆతృత.

"సికింద్రాబాద్‌నుండి మాట్లాడుతున్నాను. ఎక్కడికి వెళ్లాలో తెలీడంలేదు" అన్నాడు భవానీశంకర్.

"అసలు నీవు నిజంగా ఎక్కడున్నావురా? నువ్వు ఘనకార్యం చేసివెళ్లాక ఇక్కడ పరిస్థి తులు పూర్తిగా విషమించి పోయాయి" కొద్దిగా కోప్పడ్డాడు గోపాల్.

"రోజూ పేపర్ చూస్తున్నాను. నాకు అన్ని విషయాలు తెల్సు. ఈ రోజు పేపర్లో గౌసియా గురించి చదివాను"

"గౌసియా గురించి చదివావు సరే, కాని ఈ రోజు మధ్యాహ్నం ఇక్కడ మళ్లీ అల్లర్లు జరిగాయి. కొన్ని ప్రాంతాల్లో కర్ఫ్యూ విధిం చారు. నీవు చేసిన పని ఇంతదూరం వచ్చింది"

"అదంతా సరే ముందు నేను ఎక్కడికి వెళ్లాలో చెప్పు? "

"ఎక్కడికి వెళ్లాలని వచ్చావు? "

"గౌసియా హైదరాబాద్ వచ్చివుంటుం దనే ఆశతో వచ్చాను. మా ఇంటికి మాత్రం వెళ్లాలనుకోలేదు. అమ్మానాన్నా క్షేమంగా వుంటే చాలు. కనబడితే నా గురించి చెప్పు

"ముఖ్యంగా నేను కనబడితే నన్ను పోలీ సులు అరెస్టు చేస్తారు. అందుకే ఎక్కడైనా రహస్యంగా వుండిపోయి మీ అందరి సహా యంతో గౌసియాను తీస్కుని ఎక్కడికైనా వెళ్లిపోవాలని వుంది"

"అరే పిచ్చోడా నీ కారణంగా తండ్రిని కోల్పోయి కూడా ఆ పిల్ల మళ్లీ నీ వెంట వస్తుందా? "

"తప్పకుండా వస్తుంది"

"ఏంటోరా నీ పిచ్చి రోజురోజుకి బాగా ముదిరిపోతున్నట్టుంది"

"గౌసియాను మర్చిపోలేను"

"ప్చ్... ఏం చూసి ఆ పిల్లను అంత ఇదిగా ఇష్టపడుతున్నావురా? ఆస్తిమంతు రాలు కాదు, అక్షరం ముక్కరాదు. ఏదో కాసింత అందం వుంది. ఆ అందాన్ని పట్టు కుని తింటావా? "

"నీవు ఏమైనా మాట్లాడు గోపాల్! గౌసియా నా ప్రాణం! ఆమె లేకుండా నేను బతకలేను. ఈ పరిస్థితిలో కూడా నన్ను, నా ప్రేమను నిందించే ప్రయత్నం చేయొద్దు.

"దయచేసి నన్ను అర్థం చేసుకోరా! నేను గౌసియాను ఇష్టపడి పొరపాటు చేశానేమో తెలీదుకాని ఇప్పుడు ఆమె లేని జీవితాన్ని ఊహించుకోలేకపోతున్నాను"

"ఆమె లేకుండా నీవు బతకలేవు సరే! మరి ఒకవేళ గౌసియా అరబ్బుషేకు వెంట చిరునామా లేకుండా వెళ్లిపోయి వుంటే ఏం చేసేవాడివి? "

"నీకు తెలీదురా! ఈరోజు ఉదయం ఆత్మ హత్య చేసుకోవాలనుకున్నాను. కానీ అనుకో కుండా పేపరు చదవడం, గౌసియా గురించి తెలవడం, నిజంగా నాకు పునర్జన్మ లాంటిది"

"సర్లేగాని ఇప్పుడు ఎక్కడికి వెళ్తావు? ఈ రాత్రిపూట ఎక్కడికీ వెళ్లలేవు కూడా! కాబట్టి ఇప్పుడు ఎక్కడున్నావో చెప్పు బండి తీసు కుని వస్తాను"

"వద్దురా! మీ ఇంటికి రావడం కూడా అంత మంచిదికాదు"

"మరి ఇప్పుడు ఎక్కడికి వెళ్తావు? "

"రాబర్ట్‌వాళ్ల ఇంటికి వెళ్తాను. అక్కడ వుంటే నన్ను ఎవ్వరూ పట్టుకోలేరు"

"రాబర్ట్ వాళ్లు నిన్ననే వూరెళ్లారు"

"ఓ గాడ్! మరి ఇప్పుడు ఎలా? "

"అందుకే మా ఇంటికి వచ్చేయ్"

"కాదురా, ముంతాజ్‌గాడి దగ్గరకి వెళ్తే? "

"ఈ టైమ్‌లో వాడి దగ్గరకి ఎలా వెళ్తావు"

"ఇప్పుడు పన్నెండు గంటలకు ట్రెయిన్ వుందికదా"

"చార్జీకి డబ్బులు వున్నాయా? "

"వున్నాయి"

"నిజం చెప్పు"

"వున్నాయిరా"

"ఎంతవుంది? "

"వంద రూపాయలు వున్నాయి"

"సరిపోతాయిలే! అక్కడికి వెళ్లాక ఒక వేళ డబ్బు అవసరం అనిపిస్తే నాకు ఫోన్ చేయి! లేదంటే ముంతాజ్‌గాడిని అడిగి తీసుకో"

"అట్లాగే"

"ఇంకో విషయం! అది వేరే వూరుకదాని బయట తిరుగొద్దు"

"నాకు అన్నీ తెల్సుగాని గౌసియా గురించి ఏ విషయం తెల్సుకుని రేపు నాకు ఫోన్ చేయి. నీ ఫోన్‌కోసం ఎదురు చూస్తుంటాను" అన్నాడు భవానిశంకర్.

"తప్పకుండా" అన్నాడు గోపాల్.

భవానీశంకర్ ఇంకేం మాట్లాడలేదు. ఫోన్ కట్‌చేసి క్యాబిన్‌లోంచి వెలుపలికి వచ్చి బిల్ చెల్లించి తిరిగి రైల్వేస్టేషన్‌వైపు నడిచాడు.

## శనివారం

"నీకు ఎవ్వరూ సహాయం చేయకపోయినా నేను సహాయం చేస్తా్రా" అన్నాడు ముంతాజ్.

"గోపాల్‌గాడు ఒకవేళ ఫోన్ చేయకపోతే నువ్వొకసారి హైదరాబాద్ వెళ్లిరావాలి"

"ఎలాగూ రేపు పనిమీద వెళ్తున్నాను. మీ అమ్మావాళ్లను కూడా కల్సివస్తాను"

"గోపాల్‌గాడిని కూడా కలిసి నా గురించి ఎక్కడా చెప్పవద్దని చెప్పు. ఈ మాట మా అమ్మవాళ్లకు కూడా చెప్పు"

"వాళ్లకు అంతా తెల్సులే" ముంతాజ్ అంటుంటేనే "బేటా! కాళ్లు కడుక్కోండి. నాస్టా చేద్దురుగానీ" పిలుస్తూ వచ్చింది ముంతాజ్ తల్లి హుస్సేన్‌బీ.

భవానీశంకర్, ముంతాజ్ ఇద్దరూ లేచి లోపలికి నడిచారు. హుస్సేన్‌బీ బోటీ కలిపిన గోంగూర కూరను, చపాతీల్ని, చాపపై సర్దసాగింది. చేతులు కడుక్కుని వచ్చి చాపపై అభిముఖంగా కూర్చుని తినడం ఆరంభించారు మిత్రులు ఇద్దరూ.

"రాత్రి ఒక సంఘటన జరిగింది. ఎవరో హైదరాబాద్‌కు చెందిన అమ్మాయి మా దవాఖానాకు వచ్చింది. పాపం.. ఆ పోరిది చాలా చిన్న వయసు. నిన్న హైదారాబాద్‌లో జరిగిన మతకలహాల్లో గాయపడిందంట. ఆ పోరి పరిస్థితి చూస్తుంటే నిజంగా మస్తు జాలి అన్పిస్తుంది" తింటూ చెప్పాడు ముంతాజ్.

"..." తింటూ తలాడించాడు భవానీశంకర్.

"అట్లాంటి పరిస్థితి శతృవులకు కూడా రాకూడదురా! ఎందుకంటే ఒకవైపు గాయాలు, మరోవైపు కడుపునొప్పి. నిజంగా చాలా ఘోరం!" అన్నాడు ముంతాజ్.

"ఒక్కొక్కరిది ఒక్కో బాధ" అన్నాడు భవానీశంకర్.

"మా కులం పోరీనే! మస్తుగ వుంది. కాపోతే గొప్పింటి దానిలా వుంది. అందుకే బాధ" కూర వేసుకుంటూ అన్నాడు ముంతాజ్.

"అదేంట్రా? " నవ్వాడు భవానీశంకర్.

"నాకు సరిపోయే కుటుంబం అయి

వుంటే షాది చేసుకునేవాడ్ని"

"అంత నచ్చిందా?"

"నిజంరా! నాకైతే బాగా నచ్చింది"

"నచ్చితే ఒక లవ్ లెటర్ రాసి ఇచ్చేసుకో గాని ముందు నా గురించి ఆలోచించురా! నేను ఇప్పుడు అగ్గికణికలమీద నిలబడి వున్నాను. నా పరిస్థితి ఒక కొలిక్కి వచ్చేలా చూడు"

"చెప్పాను కదా నీకు నేను తప్పకుండా సహాయం చేస్తాను"

"థాంక్సరా" అని కాసేపాగి, "అవున్రా నీ ఉద్యోగం పర్మనెంటు అయినట్లేనా?" అడిగాడు భవానీశంకర్.

"అది మా నాన్న ఉద్యోగం కదా పర్మనెంటు అయినట్టే లెక్క" చెప్పాడు ముంతాజ్.

"జీతం ఎంత?"

"మానాన్నకు రెండు వేలు వచ్చేవి. నాకు వెయ్యి రూపాయలు ఇస్తున్నారు. మున్ముందు పెంచుతారంట" అంటూ చేయి కడుక్కున్నాడు ముంతాజ్.

భవానీశంకర్ కూడా చేయి కడుక్కున్నాడు.

ఇద్దరూ లేచి బయటి గదిలోకి నడిచారు.

"దవాఖానకు వెళ్దామా?" అడిగాడు ముంతాజ్.

"వద్దు" అన్నాడు భవానీశంకర్.

"ఇంట్లో కూర్చుని ఏం చేస్తావు?"

"నేను బయటకి వెళ్లడం అంతమంచిది కాదు"

"దవాఖాన ఇక్కడికి దగ్గరే. ఈ పక్క గల్లీలోంచి వెళ్దాం. నిన్ను ఎవ్వరూ పోల్చుకోరు"

"వద్దురా! నువ్వెళ్లు"

"రారా"

"ఏం నీ లవ్వర్‌ను చూపిస్తావా?"

"పోరా" ముంతాజ్‌లో కొద్దిగా సిగ్గు.

"పిచ్చోడా! నిన్ననేగా ఆ పిల్లను చూసింది అప్పుడే మనసు పారేసుకున్నావా?" నవ్వాడు భవానీశంకర్.

"ఆ సంగతి వదిలిపెట్టుగాని నువ్వు ముందు వస్తావా? రావా?" అడిగాడు ముంతాజ్.

"నన్ను అర్థం చేసుకోరా" అన్నాడు భవానీశంకర్.

"అయితే నీ ఇష్టం నాకు డ్యూటీ టైమ్ అయింది. వెళ్లొస్తాను" అంటూ బయటకు నడిచాడు ముంతాజ్.

"గోపాల్‌గాడు ఫోన్ చేస్తే చేయొచ్చు అన్ని విషయాలు వివరంగా మాట్లాడి తెలుసుకో" గుమ్మందాకా వచ్చి చెప్పాడు భవానీశంకర్.

"సరే" అంటూ లూనా స్టార్టు చేసుకుని ఎక్కి కూర్చుని "బోర్ అన్పిస్తే అమ్మను అడిగి పక్కింటివాళ్ల దగ్గర్నుండి పుస్తకాలు తెప్పించుకో" చెప్పి వెళ్లిపోయాడు ముంతాజ్.

భవానీశంకర్ లోపలికి నడిచాడు.

★ ★ ★

"గౌసియా! ఎలావుంది ఆరోగ్యం?" హాస్పిటల్‌కు రాగానే అడిగాడు కమలాకర్.

"బాగుంది" చెప్పింది గౌసియా.

"మరి వెళ్దామా?" అడిగాడు.

"వెళ్దాం"

"ముంతాజ్" ఆ వెంటనే ముంతాజ్ కోసం చూశాడు కమలాకర్.

"అన్నా" అంటూ వచ్చాడు ముంతాజ్.

"ఏమీ అనుకోకుండా ఆటో తీసుకువస్తావా?"

"ఆటో ఎందుకు అన్నా?"

"మేము ఇక వెళ్లద్దా?"

"అప్పుడే వెళ్తున్నారా?" కొద్దిగా బాధని పించింది ముంతాజ్‌కు.

"మా డాక్టర్‌సాబ్ ఇప్పటికే నాపై కోప్పడ్తున్నాడు" చెప్పాడు కమలాకర్.

"మీ డాక్టర్ బుద్ధిమంతుడైతే ఇలా బాధ

పడాల్సిన అవసరమేలేదు" అంటూ బయటకు నడిచాడు ముంతాజ్.

పది నిముషాల్లో ఆటో వచ్చి హాస్పిటల్ ముందు ఆగింది. కమలాకర్ గౌసియాను జాగ్రత్తగా తీసుకువెళ్లి ఆటోలో కూర్చోబెట్టాడు.

"డాక్టర్‌సాబ్ వస్తే అమ్మాయిని తీసుకువెళ్లానని చెప్పు" ముంతాజ్‌కు చెప్పాడు కమలాకర్.

సరే అన్నట్టుగా తలాడించాడు ముంతాజ్. ఆ తర్వాత ఆటో ముందుకు కదిలింది.

★ ★ ★

"అమ్మాయీ నీకు వస్తాను అనే చెప్పాను కదా? చెప్పినా కూడా ఆ కమలాకర్ వెంట వెళ్లడం ఏంటీ? దిసీజ్ టూమచ్" కమలాకర్ రౌండ్స్‌కు వెళ్లగానే గౌసియాపై కోప్పడ్డాడు డాక్టర్ దినేష్.

"బాధ ఎక్కువైతే" చెప్పుకోబోయింది గౌసియా.

"డోంట్ టాక్ ఐసే" కఠినంగా అన్నాడు డాక్టర్.

గౌసియా కిమ్మనలేదు. గొణుక్కుంటూ వెళ్లిపోయాడు డాక్టర్. తన మీద తనకే జాలికలుగుతుంటే గౌసియా గుడ్లనిండా నీళ్లు తిరిగాయి.

'అంతా నా ఖర్మ' మనసులో అనుకుంటూ కళ్లనీళ్లు తుడ్చుకుంది. అదే సమయంలో హాస్పిటల్‌కు సీరియస్ కేసు ఒకటి రావడం, డాక్టర్‌తోపాటుగా కాంపౌండర్, నర్సులు, అందరూ అప్రమత్తులు కావడం జరిగిపోయింది.

బాధపడుతూ మౌనంగా పడుకున్న గౌసియాను పిలుస్తూ వచ్చింది ఆయా.

"గౌసియా"

ఏంటన్నట్లుగా చూసింది గౌసియా.

"నీకు బొంబాయి నుండి ఫోను" అంటూ కార్డులెస్ అందించింది ఆయా. కార్డ్‌లెస్ అందుకుని ఆతృతగా మాట్లాడింది గౌసియా. ఫోన్ చేసింది ఆమెను హాస్పిటల్లో చేర్పించిన మోహన్. అతడు ఎవరో అయినప్పటికీ మళ్లీ ఫోన్ చేసి ఆమె యోగక్షేమాల్ని తెల్సుకోవడం ఆయాను విస్మయపరిచింది.

"నిజంగా ఆ మనిషి ఎంతో పుణ్యాత్ముడు అనుకోవాలి" గౌసియా మాట్లాడ్డం పూర్తయ్యాక అంది ఆయా.

"ఇది సరేగాని నాకో సహాయం చేస్తావా ఆయా? " అడిగింది గౌసియా.

"ఏం సహాయం? "

"నువ్వు చేస్తానంటేనే చెప్తాను"

"నావల్ల అయ్యేది వుంటే తప్పకుండా చేస్తాను"

"డాక్టరుకి చెప్పి నన్ను హైద్రాబాద్ హాస్పిటల్‌కు పంపించే ఏర్పాటు చేయి"

"ఇక్కడ బాగానే వుంది కదా? ఇప్పుడే హైద్రాబాదు ఎందుకు? "

"అలా అని కాదు, నన్ను ఇక్కడ జాయిన్ చేసి వెళ్ళాడే మోహన్‌భయ్యా, వాళ్ళ అన్నయ్య కూడా హైద్రాబాద్‌లో డాక్టరుగా పనిచేస్తున్నాడంట. నాకు ఇక్కడ ఇబ్బంది వుంటే ఈ డాక్టరును అడిగి అక్కడికి వెళ్ళమన్నాడు. అందుకు అయ్యే ఖర్చుల్ని ఆ డాక్టరే భరించుకుంటాడంట.

"మోహన్ భయ్యా చాలా మంచివాడు. నా గురించి వాళ్ళ ఇంటివాళ్ళకు ఇంతక్రితమే ఫోన్‌చేసి చెప్పాడంట కూడా! నాకు అక్కడికే వెళ్ళాలని వుంది. దయచేసి ఈ సహాయం చేసిపెట్టవా? " అభ్యర్థనగా అడిగింది గౌసియా.

"చిరునామా వుందా? " అడిగింది ఆయా.

"నాకు కార్డు ఇచ్చివెళ్ళాడు కదా...అదే చిరునామా"

"ఏం కార్డు ఇచ్చివెళ్ళాడో ఏమో!? ఇక్కడ ఏం తక్కువయ్యిందని అక్కడికి వెళ్ళాలనుకుంటున్నావు? " గొణిగినట్లు అంది ఆయా.

"నాకు ఈ డాక్టరును చూస్తుంటే భయమనిపిస్తుంది" అంది గౌసియా.

"ఎందుకు భయం? డాక్టరుసాబు చాలా మంచివాడు" అంది ఆయా.

"వద్దు! నేను ఇక్కడ వుండను"

"అయితే ఆ విషయం నువ్వే అడగ రాదూ? నాతో ఎందుకు? "

"డాక్టరు నన్ను ఇంతక్రితమే తిట్టాడు. అందుకే అడిగేందుకు భయం"

"డాక్టరు ఆపరేషన్ రూములో వున్నాడు. బయటకి వచ్చేవరకు చాలా సమయం పడు తుంది. వచ్చాక చూద్దాంలే" అంటూ అక్క డ్నుంచి వెళ్ళిపోయింది ఆయా.

ఆమె అలా వెళ్ళిపోయిందో లేదో ఒక యువకుడు గౌసియా బెడ్ దగ్గరకు వచ్చాడు. అతడు ఔట్ పేషెంట్.

"నీకు ఇక్కడ ఎవ్వరూ లేరా? " అడిగాడు ఆ యువకుడు.

"లేరు" చెప్పింది గౌసియా.

"నేను హైద్రాబాద్ వెళ్తున్నాను. వీళ్ళు నిన్ను తీసుకువెళ్ళకపోతే నేను తీసుకువె ళ్తాను" అన్నాడు యువకుడు.

"నువ్వెవరు? "



"నా పేరు శ్యామ్. నేను డాక్టరు తమ్ముడ్ని"

"అలాగా! మరి మీరెప్పుడు వెళ్తున్నారు"

"ఈ సాయంత్రం వెళ్తాను"

"అయితే నన్ను తీసుకువెళ్ళవా? "

"అన్నయ్య కోప్పడ్తాడేమో అని భయంగా వుంది? అయినా అన్నయ్యకు సర్దిచెప్పుకుంటాను"

"అంటే మీ అన్నయ్యకు చెప్పకుండా తీసుకువెళ్తావా? "

"ముందే చెప్పాను కదా! వీళ్ళు ఒప్పుకుంటే సరి, లేదంటే నా వెంట తీసుకెళ్ళిపోతాను. అయినా అన్నయ్య చాలా స్ట్రిక్టు. కాబట్టి ఒప్పుకోరేమో అనిపిస్తుంది! అందుకే అన్నయ్యకు చెప్పకుండా అయితేనే నీవు ఇక్కడ్నుంచి బయటపడగలవు. ముందు ఈ విషయాన్ని ఎవ్వరికీ చెప్పొద్దు"

"నాకోసం నువ్వెందుకు ఇబ్బందిని ఎదుర్కోవడం? "

"నిన్ను చూస్తుంటే నాకు చాలా జాలి అన్పిస్తోంది. నీలాంటి వాళ్ళకు సహాయం చేస్తేనే ఆ దేవుడు నన్నూ, మా అన్నయ్యను చల్లగా చూస్తాడు అని కూడా అన్పిస్తోంది" అని.

"ఇప్పుడే వస్తాను" అంటూ అక్కడ్నుంచి బయటకు నడిచాడు.

ఆయా ఎవరో ఇన్ పేషెంట్ తో మాట్లాడుతోంది. నెమ్మదిగా ఆమెవైపు నడిచాడు అతడు.

"పెద్ద డాక్టరు ఇప్పుడు దొరకడు అని చెప్పాను కదా" అతడ్ని చూడగానే అంది ఆయా.

"చిన్న డాక్టర్ వస్తాడు కదా" అన్నాడు యువకుడు.

"ఇద్దరూ ఆపరేషన్ థియేటర్ లోనే వున్నారు"

"ఇదేం హాస్పిటల్? ఈ సమయంలో ఇన్ పేషెంట్ ఎవ్వరికైనా సీరియస్ అయితే? "

"లోపలికి నంబరుంది. సీరియస్ అనుకుంటే కలుపుతాను" అంది ఆయా.

"మంచిది" అని కాసేపాగి, "అవునూ, ఉదయాన్నే ఎవరైనా టైఫాయిడ్ పేషెంట్ వచ్చారా ఇక్కడికి? " అడిగాడు అతడు.

"ఎవ్వరూ రాలేదే" అంది ఆయా.

"ఇప్పుడు వస్తాడు" అంటూ వెళ్ళి అక్కడున్న విజిటర్ చెయిర్స్ వరసలో కూర్చున్నాడు అతడు.

పదిహేను నిముషాలు గడిచిపోయాయి. ఆపరేషన్ థియేటర్లోంచి కాంపౌండర్ వెలుపలికివచ్చి, ఆయాకు మందుల చీటి ఇస్తూ, "ఈ మందులు మన మెడికల్ హాల్లో లేవు. అవతలి వీధిలో వున్న మెడికల్ హాల్లో ఈ మందులు దొరుకుతాయి. వెంటనే వెళ్ళి తీసుకురాపో" అని చెప్పి, ఆ వెంటనే లోపలికి వెళ్ళిపోయాడు.

ఆయా వడివడిగా బయటకు నడిచింది. అట్లాంటి అవకాశంకోసమే ఎదురుచూస్తున్న అతగాడు, ఆయా అలా బయటకు వెళ్ళగానే ఇలా గౌసియా దగ్గరకి నడిచాడు.

"ఇంతసేపు ఎక్కడికి వెళ్ళారు? " అడిగింది గౌసియా.

"ఫోన్లో అన్నయ్యతో మాట్లాడాను. తను ఎమర్జెన్సీ కేసులో వున్నాడు కాబట్టి నామీద తీవ్రంగా కోప్పడ్డాడు. ఆ కోపంలోనే 'ఆ అమ్మాయి ఇక్కడే వుండాలి. ఎక్కడికీ వెళ్ళడానికి వీల్లేదు' అని చెప్పాడు" అన్నాడు అతడు.

"మరి ఇప్పుడెలా? "

"ఇంకేం ఆలోచించేది లేదు, వెళ్దాం"

"సరే"

"నేను ఆటో తీసుకువస్తాను" అంటూ మెరుపు వేగంతో బయటకు నడిచి, రోడ్డెంబడి వెళ్తున్న ఆటోని చప్పట్లు చరుస్తూ "ఆటో" పిలిచాడు.

ఆటో ఇటు తిరిగింది. అతడు వెంటనే లోపలికి నడిచాడు.

"ఆయాకు చెప్పాలా? " అడిగింది గౌసియా.

"చెప్పాను. తీసుకువెళ్ళమంది"

"నాకు నడవడం చేతకాదు. పట్టుకుని మెల్లగా నడిపించు"

"ఎత్తుకు వెళ్తాలే" అంటూనే గౌసియాని తన రెండుచేతులమీదకు గబుక్కున ఎత్తుకున్నాడు అతడు.

అతడి ఓ చేయి నడుందగ్గిరి ఆమె గాయంమీద ఒత్తిడిని పెంచింది. ఆమె భరించలేకపోయింది.

"అ...మ్మా..." బాధగా అరిచింది.

"ఏమయ్యింది? " గాభరపడ్డాడు.

"ఈ చేయి తీయండి..." బాధపడుతూనే అతడి చేతిని దూరం జరుపుకుంది.

అప్పుడు గమనించాడు అతడు ఆమె గాయాన్ని. "ఓ సారీ! చూళ్ళేదు" అంటూ తనచేయిని దూరం జరిపి, ఆ వెంటనే డోర్ దాకా నడిచి, అటూఇటూ చూసి, ఎవ్వరూ తమని గమనించడం లేదు. ఆయా కూడా రావడంలేదు. అని నిర్ధారించుకున్నాక, పరుగున వెలుపలికి నడిచాడు.

★ ★ ★

మధ్యాహ్నం భోజనానికి ఇంటికి వెళ్ళాడు ముంతాజ్.

"ఏమంటోందిరా నీ లవ్వర్? " ముంతాజ్ రాగానే, తన చేతిలోని ఏదో మేగజైన్‌ను పక్కకు పెడుతూ అడిగాడు భవానీశంకర్.

"ప్చ్.. డిస్చార్జి అయ్యింది" నిరాశగా చెప్పాడు ముంతాజ్.

"భగ్న ప్రేమికుడివి అన్నమాట" టీజ్ చేసాడు భవానీశంకర్.

"ఏదోగాని, గోపాల్‌గాడు ఫోన్‌చేసాడు" చెప్పాడు ముంతాజ్.

"ఏమన్నాడు? " ఆత్రంగా చెయిర్‌లోంచి లేచి ముంతాజ్ చేతుల్ని పట్టుకున్నాడు భవానీశంకర్.

"గౌసియా ఇంకా హైద్రాబాద్‌కు రాలేదట"

"అదేం? "

"నాకేం తెల్సురా? "

"ఇంకా ఏం చెప్పాడు? "

"మీ అమ్మా, నాన్నలకు నీ గురించి చెప్పగానే చాలా సంతోషించారట! నిన్ను ఇప్పుడే ఇంటికి రావొద్దని చెప్పారంట! గౌసియా వాళ్ళ పరిస్థితి మాత్రం చాలా దీనంగా ఉందట! వాళ్ళ తండ్రి మరణం వాళ్ళను విపరీతంగా కృంగదీస్తుంటే మనుషులు కాలేకపోతున్నారంట"

"బిడ్డను అమ్ముకుని మాత్రం ధైర్యంగా ఉండగలిగారా? " వెంటనే కసిగా అన్నాడు భవానీశకంర్.

"అదే నాకు అర్థంకాలేదు" అన్నాడు ముంతాజ్.

"మొత్తానికి గౌసియా ఇంకా బాంబేలోనే వుందేమో? " అన్నాడు భవానీశంకర్.

"ఇంక అక్కడే వుంటుంది కదా" అంటూ చొక్కా గుండీలు తీసుకోసాగాడు ముంతాజ్.

"ఇంకా ఏమేం మాట్లాడాడు? " భవానీశంకర్‌లో ఆసక్తి.

"ఇంకేం మాట్లాడలేదు. మళ్ళీ రేపు ఫోన్ చేస్తానన్నాడు. మరి కనీసం రేపైనా దవఖానకు వస్తే బాగుంటుంది" అంటూ చొక్కా వదిలి హ్యాంగర్‌కు తగిలించాడు ముంతాజ్.

"రావాలనే వుంది. కాని భయంగా వుందిరా! అయినా రావడానికి ప్రయత్నిస్తాను! కాపోతే ఇప్పుడు ఒక నంబరు ఇస్తాను. ఆ నంబరుకు ఒకసారి ట్రై చేసి వివరంగా మాట్లాడు. అక్కడ సిరాజ్ అని నా ఫ్రెండు వుంటాడు. వాడు లేకపోతే వాడి అక్క పర్వీనా వుంటుంది. ఇద్దరిలో ఎవరు వున్నా అక్కడి పరిస్థితి గురించి పూర్తిగా తెలుస్తుంది. వాళ్ళు వుండేది మాకు దగ్గరే, పైగా వాళ్ళు గౌసియా వాళ్ళకు బాగా తెలుసు" చెప్పాడు భవానీశంకర్.

"వాళ్ళు ముస్లింలు కదా? " అన్నాడు ముంతాజ్.

"నీలాగే వాళ్ళకు కూడా హిందూముస్లీం తేడాలులేవు. మంచి మనసే మతం, కలిసి వుండటమే కులం అని అనుకుంటారు. ఇంకో విషయం తెల్సా? మా ప్రేమలో సహాయపడింది కూడా వాళ్ళే" చెప్తూనే అదే హ్యాంగర్‌కు తగిలించి వున్న తన ప్యాంటు జేబులోని పర్సును ఫోన్ నంబర్‌కోసం బయటకు తీయబోయాడు భవానీశంకర్. కాగా, పర్సు పొరపాటున జారి కిందపడిపోయింది.

"నీ పర్స్ బాగుందిరా" అంటూ వంగి కిందబడిన పర్సును చేతుల్లోకి తీసుకుని తెరిచి చూసిన ముంతాజ్ ఒక్కసారిగా ఉలిక్కిపడ్డాడు.

"ఏమయ్యిందిరా?" కలవరపడ్డాడు భవానీశంకర్.

"ఈ... ఈ... మె...?" ముంతాజ్ తడబడ్డాడు.

"గౌసియా" చెప్పాడు భవానీశంకర్.

"సారీరా" వెంటనే స్నేహితుడి చేతుల్ని పట్టుకున్నాడు ముంతాజ్.

అర్ధంకానట్టుగా చూశాడు భవానీశంకర్.

"దవఖానాకు వచ్చింది ఈ అమ్మాయేరా" ఆయాసపడినట్లుగా చెప్పాడు ముంతాజ్.

"ఆ?" నమ్మలేకపోయాడు భవానీశంకర్

"నిజం! ఈ అమ్మాయే! నేను బాగా గుర్తుపట్టగలను"

"బాంబేలో వున్న గౌసియా ఇక్కడికి ఎలా వస్తుంది?"

"అదంతా నాకు తెలీదు. నేను చూసింది ఈ అమ్మాయినే, పొరపాటున మనసు పారేసుకున్నదీ ఈ అమ్మాయిపైనే! నీకు నమ్మకం కుదరకపోతే స్వయంగా వెళ్ళి చూసాకే నమ్ము"

"డిస్చార్జి అయ్యింది అన్నావు కదా"

"ఇదే వూర్లో వేరే దవాఖానలో వుంటుంది. ఇప్పుడే వెళ్దాం" అంటూనే తిరిగి చొక్కా వేసుకున్నాడు ముంతాజ్

"ఏంచేస్తుంది అక్కడ?" అడిగాడు భవానీశంకర్.

"ఏంచేయదు. అక్కడ కూడా తను పేషెంటే" చెప్పాడు ముంతాజ్

అర్థంకానట్టుగా చూశాడు భవానీశంకర్.

"ఆలస్యం అమృతం...విషం... పదరా" అంటూనే బయటకు నడిచాడు ముంతాజ్.

వెనకే నడిచాడు భవానీశంకర్

★ ★ ★

"నన్ను ఇక్కడికి తీసుకువచ్చావేం?" కంగారుగా అడిగింది గౌసియా.

"తీసుకురావాలీ అనుకున్నాను కాబట్టి తీసుకువచ్చాను" అన్నాడు అతడు

"అంటే? నన్ను హైద్రాబాద్ తీసుకువెళ్ళవా?"

"హైద్రాబాద్ ఎందుకు?"

"అదేంటి అలా మాట్లాడ్తున్నారు?"

"బాగానే మాట్లాడ్తున్నాను" అంటూ సిగరెట్టు వెలిగించుకున్నాడు అతడు.

"మీరు ఇలా మాట్లాడొద్దు. నాకు ఏడుపు వొస్తుంది" ఏడుపు ముఖం పెట్టింది గౌసియా.

"ఏడ్వొచ్చు! నో ప్రాబ్లమ్!" తాపీగా అన్నాడు అతడు.

"అయ్యో... అల్లా" ఆమెకు దుఃఖం ముంచుకొచ్చింది.

"అనవసరంగా ఏడిస్తే నీ శక్తే వృధా..." రింగురింగులుగా పొగ వదులుతూ విలాసంగా అన్నాడు.

ఆమె ఇక పడుకోలేకపోయింది. ఏడుస్తూనే బలవంతాన లేవబోయింది. అతడు ఆమెవైపు కొన్నిక్షణాలు సూటిగా చూసి... "ఎక్కడికి?" అడిగాడు.

"నేను వెళ్ళిపోతాను" గోడకు జారగిలబడి కూర్చుంది.

"అదే ఎక్కడికి?"

"హాస్పిటల్‌కి"

"వెళ్ళలేవు"

"వద్దు... నన్ను వెళ్ళనివ్వండి"

"విసిగించొద్దు. పడుకో" అంటూనే వచ్చి ఆమె భుజమ్మీద చేయివేశాడు అతడు.

"జరుగు" అతడ్ని పక్కకు జరిపిందామె.

"మంచి మాటలతో చెబుతున్నాను పడుకో! లేదంటే కొడతాను" భయపెట్టాడు.

"నన్ను మోసంచేయొద్దు. ఇప్పటికే నేను చాలా కష్టాలు ఎదుర్కొన్నాను" అప్రయత్నంగా చేతులు జోడించింది.

"నిన్ను మోసం చేయను. నీవు బతికివున్నంతకాలం నాదగ్గరే వుంచుకుంటాను"

ఆమె ఇంకేం మాట్లాడలేదు. అరచేతుల్లో ముఖం దాచుకుని వెక్కివెక్కి ఏడవసాగింది.

"హే..." గదమాయింపుగా అన్నాడు.

ఆమె విన్పించుకోలేదు. అతడు కూడా ఇంకేం అనలేదు. విసవిసా వెళ్ళి చెయిర్‌లో కూర్చున్నాడు. ఆమె కాసేపటివరకు ఏడ్చి తర్వాత మౌనంగా వెక్కుతూ కూర్చుండిపోయింది.

"ఇక్కడ నీవు సుఖంగా వుంటావు, బాధపడొద్దు" అన్నాడు అతడు.

"... ... ..."

"నాకు పెళ్ళికాలేదు. నీవు బుద్ధిగా వుంటే పెళ్ళి కూడా చేసుకుంటాను"

"... ... ..."

"వారంగోజుల్లో నీ గాయాలు తగ్గుతాయి. అందుకు నీకు అధునాతనమైన ఛికిత్స ఇప్పిస్తాను. ఇక్కడ కాదు, ముంబాయిలో!"

"... ... ..."

"ఈ రాత్రికే ముంబాయి వెళ్తున్నాము..."

"... ... ..."

"ముంబాయిలో నాకు ఫిల్ముస్టారులు, దర్శకులు, నిర్మాతలు, చాలామంది తెలుసు. నీవు అందంగా వున్నావు కాబట్టి, నీకు ఇంట్రస్ట్ వుంటే సిన్మాల్లో అవకాశం కూడా ఇప్పిస్తాను"

"..."

"సిన్మాలో అవకాశం రాకపోయినా ఫర్వాలేదు. వచ్చే నెలలో నేను టెలీఫిల్మ్ తీసే ఐడియాలో వున్నాను. నిన్నే హీరోయిన్‌గా తీసుకుంటాను. హీరోగా ఎవ్వరో తెల్సా? అచ్యుత్! అతడు టీవీ నంబర్‌వన్. అతడి పక్కన నీవు నటిస్తే నువ్వు కూడా నంబర్ వన్ పొజిషన్‌లోకి వెళ్తావు"

"..."

"నీవు నా దగ్గర వున్నావంటే అదృష్టం నీడలో వున్నట్టు లెక్క!"

అంతలోనే టెలీఫోన్ మోగింది. లిఫ్ట్ చేసాడు అతడు.

"హలో"

అవతల్నుండి అతడి స్నేహితుడు మాట్లాడుతున్నాడు.

"ఎంతవరకు వచ్చిందిరా నీ పని? "

"నాకు మంచి పార్టీ దొరికింది. రియల్లీ అయామ్ లక్కీ"

"నిజంగానా? "

"నమ్మకం కుదరకపోతే ఒకసారి వచ్చిపో"

"అయితే నేనే ఫెయిల్ అన్నమాట"

"వారం రోజులు గడువు ఇస్తాను. సక్సెస్ కాకపోతే నాకు సెవంటీఫైవ్ పర్సెంట్, నీకు ట్వెంటీఫైవ్ పర్సెంట్"

"అన్యాయం రా"

"ఎక్కడైనా ఫ్రెండ్షిప్... ఇక్కడ మాత్రం కాదు. అయామ్ వెరీసారీ"

"పార్టీకోసం చాలా ప్రయత్నిస్తున్నాను. కాని ఛాన్స్ దొరకడంలేదు. నిన్న ఒక పార్టీని ఉమెన్స్ కాలేజీ దగ్గర పట్టుకోవాలి అనుకున్నాను. కాని బ్యాడ్‌లక్... చెప్పుదెబ్బలు మిగిలాయి" నిరాశగా అన్నాడు స్నేహితుడు.

స్నేహితుడి మాటలకు అతడికి నవ్వొచ్చింది.

"నీకేంరా నవ్వుతావు" స్నేహితుడిలో అదే నిరాశ.

"నవ్వడం కాదుగాని ఒక ఐడియా

చెప్తాను ఫాలో అవుతావా?" అన్నాడు అతడు.

"ఏంటీ?"

"టెలీఫిల్ముకోసం నటీనటులు కావాలని పేపర్‌లో యాడ్ ఇవ్వు. అడ్రస్ నువ్వుండే దిల్ సుఖ్ నగర్ కాకుండా, కృష్ణానగర్ ఇవ్వు! నెలకు వెయ్యిరూపాయలైనా సరే, మంచి రూము తీసుకుని డిగ్నిఫైడ్‌గా కనిపించు!

"ముఖ్యంగా కృష్ణానగర్‌లో ఎందుకు రూము తీసుకోమని చెబుతున్నానంటే బోగస్ ఫిల్ము సంస్థలు ఎక్కువగా దిల్‌సుఖ్ నగర్‌వైపే వున్నాయి. కొన్ని బయటపడ్డాయి. మన బోగస్ హీరోలు జైలుపాలయ్యారు కూడా! కాని కృష్ణానగర్‌లో వుంటే గనుక ఎవ్వరికీ అనుమానం రాదు. అక్కడ మీడియా మనుషులే ఎక్కువగా వుంటారు కాబట్టి, సిన్మాపిచ్చోళ్ళు చచ్చినట్టు నమ్మివస్తారు. అప్పుడు ఇక నీకు నచ్చిన పార్టీని సెలెక్ట్ చేసుకో"

"వెరీగుడ్ ఐడియా! థాంక్స్"

"వెల్ కమ్! ఇంతకు ఈ వూరు ఎప్పుడు వస్తావు?"

"నేను వచ్చేది ఏంలేదు. నువ్వే సిటీకి ఎప్పుడువస్తావో చెప్పు?"

"ఈ రాత్రికి ముంబాయి వెళ్తున్నాను! వచ్చిన తర్వాత నిన్ను తీరిగ్గా కలుస్తాను"

"అప్పుడే పార్టీ దొరికింది. అప్పుడే ముంబాయి వెళ్తున్నావా? యమా ఫాస్ట్ వున్నావురా"

"ఫాస్టా నా బొందా! వన్ వీక్‌వరకు నా పప్పులు ఉడకవు"

"అదేంట్రా?"

"ఫ్రాక్చర్స్! అండర్‌స్టాండ్‌మీ"

"మాట వినకపోతే చేయిజేసుకున్నావా ఏంటీ?"

"నోనో! గాయపడిన పక్షిని కాపాడాను. వేటగాడు ఎవ్వరో తెలీదు"

"ఓ... ఐసీ! ఆ రూట్‌లో వచ్చావు కాబట్టే సక్సెస్ అయ్యావు. లేదంటేనా ఈ జన్మలో నీకు పార్టీ దొరక్కపొయ్యేది!"

"ఎలాగో ఓలాగ... సక్సెస్ అయ్యానా లేదా?"

"అయ్యావు సర్లేగాని, వారంరోజులవరకు ముంబాయిలో ఏంచేస్తావు? ఎలాగూ పార్టీ యూజ్‌ఫుల్ కాదుకదా"

"కాదుగాని, ఆ వారంరోజుల్లో బిజినెస్ మాట్లాడుకుంటాను. అంతవరకు పార్టీ ఆరోగ్యం ఓకే అవుతుంది. ఎలాగూ బ్యూటిఫుల్ కాబట్టి నాకు ఇక అదృష్టం పండినట్టే లెక్క"

వాళ్ళు అలా మాట్లాడుకుంటూ పోతుంటే, అతడి మాటలు పరోక్షంగా సాగుతున్నప్పటికీ ఆమెకు పూర్తిగా అర్థమైపోయాయి.

"నిజంగా నేను ఎంత తెలివితక్కువ దాన్ని!? హైద్రాబాద్ తీసుకువెళ్తాను అనేసరికి, వెనకాముందు ఆలోచించకుండా వీడి వెంట ఎంత ధైర్యంగా వచ్చేసాను? ! అల్లా! నా దురదృష్టాన్ని నేనే కొనితెచ్చుకున్నానా ఏంటీ? ఇంతవరకు ఎదురైన కష్టాలో పరిస్థితులు నన్ను వెంటాడాయి. ఇప్పుడు మాత్రం నేనే తప్పటడుగు వేసాను. నన్ను కాపాడు తండ్రీ!" మనసులో దీనంగా అర్థించుకుంది గౌసియా.

అంతలోపు అతడు ఫోన్ పెట్టేసాడు. ఆమె అతడివైపు జాలిగా దృక్కులు సారించివుంది.

"ఇప్పుడే వస్తాను..." అంటూనే లేచి బాత్‌రూమువైపు నడిచాడు అతడు.

అతడు వెళ్ళిపోగానే ఆమె అటూఇటూ చూసింది. అది మూడుగదుల ఇల్లు. తను రెండవగదిలో పడుకుని వుంది. బాత్ రూము కూడా అదే గదిలో వుంది.

ఆమె ఆలస్యం చేయలేదు. గాయాల బాధను లెక్కచేయకుండా బెడ్‌దిగి వడివడిగా ముందుకు నడవబోయింది. ఆమెకు చేతకాలేదు. పళ్ళ బిగువున బాధను అదిమిపట్టుకుని అలాగే నెమ్మదిగా అడుగులు ముందుకు వేయసాగింది. ఈ గది దాటి

అవతలి గదిలోకి వెళ్ళేసరికే ఆ బాధ వర్ణనాతీతం అయిపోయింది. అయినప్పటికీ ఆమె ఆగలేదు. అతడు వస్తాడేమో అన్న భయంతో బాత్‌రూమ్‌వైపు చూస్తూనే వెళ్ళి, మెయిన్‌డోర్ లాక్‌ను చప్పుడు చేయకుండా తీసి, అలా తెరిచిందో లేదో ఇలా బాత్‌రూమ్ శబ్దం అయ్యింది.

ఆమెకు ప్రాణం పోయినంత పనయ్యింది. చప్పున అక్కడున్న మేజా చాటుకు వెళ్ళి నక్కి కూర్చుంది.

బాత్‌రూమ్‌లోంచి వెలుపలికి వచ్చిన అతగాడు ఆదుర్దాగా అటూఇటూ చూసి, "ఓసీ! నాకే టోకరా వేసావే?" అంటూ గబగబా బయటకు నడిచాడు.

"అయ్యో! బాత్‌రూమ్‌కు బయటినుండి గడియపెట్టి వుంటే సరిపోయేది" మనసులో అనుకుంది గౌసియా.

అతడు గేటుదాటి వెళ్ళిపోయాడు. గౌసియా మెల్లగా లేచి మేజా ఇవతలికి వచ్చి తలుపుచాటునుంచి బయటకు తొంగి చూసింది.

అతడు గేటు అవతల నిల్చుని అటూఇటూ చూస్తున్నాడు. గేట్ లోపల ఎవరో ఆవిడ మొక్కల కొమ్మల్ని పొందికగా కత్తిరిస్తోంది.

గౌసియా బయటకి వెళ్ళేందుకు భయపడింది. అంతలోనే అతడు మరింత ముందుకు నడిచిపోయాడు. అదే అదనుగా గౌసియా చప్పున బయటకు వెళ్ళింది.

మొక్కల్ని కత్తిరిస్తున్న ఆవిడ గౌసియాను గమనించనేలేదు. అటు తిరిగి నిల్చుని తనపని ఏదో తను చేసుకుపోతోంది.

గౌసియా మెల్లగా అక్కడున్న పారిజాత పూల మొక్కలచాటుకి వెళ్ళి ఒదిగి కూర్చుంది. కూర్చోవడం ఆమెకు నరకంలా కనబడుతోంది. పచ్చిపుండులావున్న గాయం ఒంటిమీద నిప్పుల్ని పరిచినంత బాధను కలిగిస్తోంది. ఫలితంగా కళ్ళనీళ్లు ఆమెకు తెలీకుండానే చెక్కిళ్ళమీదనుండి జారిపోతూ ఆమె దుస్తుల్ని తడిపేస్తున్నాయి.

ఐదు నిముషాల తర్వాత అతడు హడావిడిగా వచ్చాడు. కొమ్మల మధ్యనుండి కళ్ళింతచేసి చూసిందామె. అతడు ఆలస్యం చేయలేదు. ఆ వెంటనే ఇంటికి లాక్‌చేసి, పారిజాతపూల మొక్కలకు సమీపంగా ఆపి వున్న తన సుజికిని స్టార్ట్‌చేస్కుని, వేగంగా ముందుకు వెళ్లిపోయాడు.

అప్పటికిగానీ వెలుపలికి రాలేదు గౌసియా. మరో ఐదు నిముషాల తర్వాత ఆవిడ కూడా లోపలికి వెళ్ళిపోయింది. అప్పటికి ఆ కాంపౌండ్‌లో ఒక కుటుంబం కూడా కాపురం వుంటోందన్న సంగతిని గమనించిందామె. ఆ ఇంటిముందు కళ్లాపి చల్లి ముగ్గులు వేయబడివున్నాయి. చూడంగానే సంసారిక కుటుంబంలా తోస్తుంది. ఆవిడ లోపలికి వెళ్ళగానే, ఇద్దరు చిన్నపిల్లలు ఆడుకుంటూ వెలుపలికి వచ్చారు.

"వాళ్ళ ఇంటికి వెళ్ళి తన బాధను చెప్పుకుంటే ఏమైనా సహాయం చేస్తారేమో!?" మనసులో అనుకుంటూ నెమ్మదిగా లేచి నిలబడి ఒక్కో అడుగు ముందుకు వేయసాగింది గౌసియా.

అంతలో చేతిలో చేటతో ఆవిడ బయటకు వచ్చింది. గౌసియాను చూస్తూనే అర్థం కానట్టుగా కనుబొమ్మలు ముడిచింది.

అప్రయత్నంగా చేతులు జోడించింది గౌసియా. ఆమె గౌసియాను అలాగే చూస్తూ మజ్జిగలో ఊరబెట్టిన మిరపకాయలు వున్న చేటను అక్కడ ఒకచోట పెట్టింది.

"నన్ను రక్షించండి ఆంటీ" వేడుకున్నట్టుగా అంది.

"ఎవరు పాపా నువ్వు?" ఆమెకు ఏమీ అర్థంకావడంలేదు.

"ఇతడు తీసుకొచ్చాడు..." అతడి ఇంటివైపు చూపించింది.

"అలాగా!" ఆమె కళ్ళింత చేసింది.

"వీడు నన్ను మోసం చేయాలనుకుంటు న్నాడు" గౌసియా చెప్తుంటేనే సమీపంగా సైకిల్ మోటార్ శబ్దం వినబడింది.

"హా!" ఉలిక్కిపాటుగా అటుకేసి చూసింది గౌసియా.

అతడు కాదు, ఎవరో బాటసారి. తన దారి వెంట తను వెళ్ళిపోయాడు.

"ఇతడు నీకు ఎక్కడ పరిచయం? " అడి గిందామె.

"ఎక్కడా పరిచయం లేదు. హాస్పిటల్లో వున్న నన్ను మాయమాటలు చెప్పి తీసుకు వచ్చాడు" చెప్పింది గౌసియా.

"అలాగా!" అంటూ ఏదో నిజం బయట పడ్డట్లుగా తలాడించి, "ఇంట్లోకి రామ్మా" అని పిలుస్తూ లోపలికి నడిచిందామె.

మెల్లగా ముందుకు నడవసాగింది గౌసియా. ఆమె లోపలికి వెళ్ళిందల్లా, గౌసియా రావడం ఆలస్యం కావడంతో మళ్ళీ బయటకు వచ్చి గౌసియా పరిస్థితిని గమనించి, దగ్గరగా వచ్చి, తన చేయిని ఆస రాగా అందించింది.

ఇంట్లోకి వెళ్ళాక గౌసియాకు వాలు కుర్చీ చూపిస్తూ, "కూర్చో" అంది.

"ఆ! ఇప్పుడు చెప్పు? " గౌసియా కూర్చో గానే అడుగుతూ వెళ్ళి అక్కడున్న మరో చెయిర్‌లో కూర్చుందామె.

గౌసియా తన అసలు పరిస్థితి గురించి చెప్పుకోలేదు. కేవలం హాస్పిటల్లో అతగాడు తనను మోసం చేసి తీసుకువచ్చిన కథను మాత్రం చెప్పుకుంది.

"అసలు మీది ఏవూరు? నువ్వెవరు? " అడిగిందామె.

"మాది హైద్రాబాద్. మా అమ్మా, నాన్న అక్కడే వుంటారు" చెప్పింది గౌసియా.

"ఇక్కడికి ఎలా వచ్చావు? "

గౌసియా కాసేపు మౌనం వహించి, ఆ తర్వాత ఇక తప్పదన్నట్టుగా తన కథను విపులంగా చెప్పుకుంది.

"చ్చొ చ్చొ చ్చొ" గౌసియా కథ విని జాలి పడిందామె. గౌసియా కళ్ళనీళ్లు తుడుచుకుంది.

"ఈ చిన్నవయసులో ఆ ప్రేమలు ఎందు కమ్మా నీకు? నీది చదువుకునే వయసు. చదువుకుని జీవితంలో స్థిరపడ్డాక ప్రేమిస్తే ఆ ప్రేమకు అర్థం వుంటుంది. కాని ఈ ఎదిగీఎదగని వయసులో నీలో ప్రేమ కలి గింది అంటే, అది ప్రేమ కాదు. తెలియని తనం! ఆకర్షణ!

"ఈ ఆకర్షణలో మునిగి తెలియనితనాన్ని తెలిసినతనం అనుకుంటున్నావు నువ్వు! ఏదోలే... జరిగింది జరిగిపోయింది. ఇప్పుడు నీ జీవితం సుగమం కావాలి. అంతేకదా? " అందామె.

అవును అన్నట్లుగా తలాడించింది గౌసియా.

"ఇంకో విషయం! ప్రేమ కారణంగానే నిన్ను ప్రేమించిన కుర్రాడు హత్యకేసులో ఇరుక్కున్నాడు. ఇందుకు వాళ్ళ తల్లిదం డ్రులు ఎంతో క్షోభను అనుభవిస్తుండ వచ్చు! ఒక్కసారి ఈ విషయం గురించి వాస్తవంగా ఆలోచించు"

"నిజమే" తలాడిస్తూనే అంది గౌసియా.

"మీ నాన్న చనిపోవడానికి కూడా మీ ప్రేమే కారణం! మీ నాన్న మూర్ఖుడు కావొచ్చు దుర్మార్గుడు కావొచ్చు కాని అత డికీ ప్రాణాలమీద తీపి వుంటుంది. ఆ తీపిని నీ ప్రియుడు చంపేశాడు" అని కాసే పాగి, "నువ్వు ఏమైనా అనుకో పాపా! మీ నాన్నను చంపేసి ఆ కుర్రాడు మంచిపనిచే శాడు. నీ తండ్రిలాంటివాళ్ళు బతకడంకంటే చావడమే మేలు! మీ నాన్నకు బాధ్యతలు వున్నాయి. కాని ఆ బాధ్యతల్ని నెరవేర్చుకుం టాడనే నమ్మకం మీ నాన్న ఒకవేళ బతికి వున్నా నాకు లేకపోయేది"

"అవును"

"నిన్ను అమ్మివేసినందుకు మీ నాన్న అంటే నీకు ద్వేషం పెరిగిందో లేక కన్నకూ

తురిగా ఇంకా ప్రేమిస్తున్నావో తెలీదు గాని... మీ నాన్నను చంపినందుకు ఆ కుర్రాడ్ని అభినందిస్తున్నాను. ఆ కుర్రాడి పరిస్థితికి ఒక తల్లిగా బాధపడుతున్నాను"

"...."

"అవునూ... ఇప్పుడు నీవు ఎక్కడికి వెళ్తావు? మీ ఇంటికి ఎలాగూ వెళ్ళలేవు. ఎవరైనా బంధువులుగాని, స్నేహితులుగాని, నిన్ను అర్థం చేసుకునేవాళ్ళు వున్నారా?" అడిగిందామె.

"నేను ఎవ్వరి ఇంటికీ వెళ్ళను. నన్ను హాస్పిటల్లో జాయిన్ చేసిన మోహన్ భయ్యా వాళ్ళ ఇంటికే వెళ్తాను" గౌసియా అంటుంటేనే ఇంటి యజమాని వచ్చాడు. రాగానే గౌసియావైపు ఎవ్వరు అన్నట్లుగా చూశాడు.

"మన అనుమానం నిజమేనండీ" రాగానే భర్తతో అందామె.

"అవునా?" అంటూ ఆమెకు ఎడంగా వున్న చెయిర్‌లో కూర్చున్నాడు అతడు. అతని ముఖంలో ఏదో గొప్ప నిజాన్ని తెలుసుకున్నంత ఆసక్తి.

"ఈ దరిద్రపు వెధవమీద మనకు నెలరోజులనుండి అనుమానంగానే వుంది. ఇక ఈరోజు మన అనుమానాన్ని నిజంచేస్తూ ఈ పిల్లను హాస్పిటల్లో వుంటే బలవంతంగా ఎత్తుకువచ్చాడు. ముదనష్టపు వెధవ... వాడి పిండా కూడు పందులు తినుగాకా!" ఆమె గొంతులో ఆవేశం.

"నాకు ఈ మధ్యాహ్నమే వాడిపై అనుమానం వచ్చింది. కాని పెద్దగా పట్టించుకోలేదు..." అన్నాడు అతడు.

"వాడ్ని ఈ రాత్రికే ఇల్లు ఖాళీ చేయించేద్దాం! ఇట్లాంటి మోసాలు హైదరాబాద్ వంటి మహానగరాల్లోనే అనుకున్నాం. కాని ఇలాంటి వెధవలు తగలబడితే మన వూళ్ళు కూడా పాడైపోతాయి" ఆమెలో ఆవేశం తగ్గలేదు.

"ఇల్లు ఖాళీ చేయించడం ఒక్కటే కాదు, వాడ్ని పోలీసులకు పట్టివ్వాలి" అతడిలో కూడా ఈసారి ఆవేశం.

"అవును అవును" దరువేసిందామె.

కాని రాత్రి ఎనిమిదిగంటలు కావొచ్చినా కూడా, గౌసియాను తెచ్చిన ఆ వ్యక్తి ఇంటికి రాలేదు. తొమ్మిది కావొస్తుంది అనగా ఐదారుమంది స్నేహితులతో కలిసి వచ్చాడు. అప్పటికి గౌసియా వాళ్ళ చల్లని నీడలో సేదతీరి పడుకునివుంది.

"వాడి దగ్గరకు వెళ్ళిరానా?" భార్యను అడిగాడు అతడు.

"ఇద్దరం కల్సివెళ్దాం" అందామె.

ఇద్దరూ కలిసి వెంటనే బయటకు నడిచారు. వాళ్ళు వెళ్లేసరికి తాగుతూ కూర్చుని వున్న మిత్రబృందం ఉలిక్కిపడిచూసింది.

"మా ఇంట్లో వున్నప్పుడు మా కుటుంబ సభ్యుల్లో ఒకరిగా వుండాలి. కాని ఇదేంటి శ్యామ్?" అన్నాడు అతడు.

"ఆ!" ఉలిక్కిపడ్డాడు శ్యామ్ ఉరఫ్ రమణ.

"మాకు ఇలాంటి పద్ధతులు నచ్చవు" అందామె.

"మీరు ఏం మాట్లాడ్తున్నారు ఆంటీ... నాకేం అర్థం కావడంలేదు" రమణ అంటుంటేనే అతడి మిత్రులు మందుసీసాల్ని తీసి పక్కకు పెట్టేశారు.

"అన్నీ తెలిసాకే మాట్లాడుతున్నాం" ఇంటి యజమాని నిష్టూరంగా అంటుంటేనే "ఈ రాత్రిదాకా కూడా నువ్వు మా ఇంట్లో వుండడానికి వీల్లేదు. వెంటనే వెళ్ళిపో" కోపంగా చెప్పిందామె.

"ఆదేం ఆంటీ?" విస్మయంగా చూశాడు రమణ.

"ఏంలేదు! నీలాంటివాళ్ళకు ఎలా బుద్ధి చెప్పాలో మాకు బాగా తెలుసు" అంటూ వెంటనే బయటకు నడిచాడు అతడు. వెనకే నడిచింది భార్య.

"ఏంట్రా? మన కొంప మునిగేలా

వుంది? " వాళ్ళు వెళ్ళిపోయాక మిత్రులకు మాత్రమే వినబడేలా అన్నాడు రమణ.

"వెళ్ళిపోదాం పదరా" వెంటనే ఒక మిత్రుడు సలహా ఇచ్చాడు.

"పోరా! వీళ్ళు మనల్ని ఏంచేస్తారు? " ఇంకో మిత్రుడు అన్నాడు.

"మనల్ని ఏంచేయరు? వీడ్ని చేస్తారు" మరో మిత్రుడు రమణ భుజం పట్టుకున్నాడు.

"అందుకే పదరా" అంటూనే లేచి నిల్చున్నాడు రమణ.

అంతలోనే ఆ వీధిలోని కొందరు పెద్దమనుషుల్లాంటి వ్యక్తుల్ని వెంటేసుకుని అక్కడికి వచ్చాడు ఆ ఇంటి యజమాని. వెంటే అతడి భార్య కూడా వుంది.

వాళ్ళను చూడగానే ప్రాణం పోయినంత పనయ్యింది రమణకు. అందర్నీ ఒకమారు చూసి, ఆ వెంటనే అక్కణ్ణుంచి పారిపోయే ప్రయత్నం చేశాడు.

అతడి ప్రయత్నం విఫలమైంది. గౌసియా ప్రస్తావన తీసుకువచ్చి అందరూ అతడ్ని చివాట్లు వేశారు. తప్పును కప్పిపుచ్చుకునే ప్రయత్నం చేయబోయాడు అతడు.

"పాపం అని పాముకు పాలుపోస్తే, పగతో కోరలు చాచిందంట. నీ సంగతీ అలాగే వుంది.

"ఆ పిల్లను నేను నిజంగానే హైదరాబాద్ తీసుకువెళ్ళాలనుకున్నాను. కాని నా మంచితనాన్ని ఆ పిల్ల గుర్తించలేదు"

"చాల్లేవయ్యా! నీమీద, నీ ప్రవర్తనమీద మాకు ఎప్పటినుండో అనుమానంగా వుంది. నీలాంటివాళ్ళను వూరికే వదిలిపెట్టకూడదు. పోలీసులకి పట్టించి చర్మం వొలిపించాలి" ఒక పెద్దమనిషి అన్నాడు.

"చర్మం వొలిపించడం ఒక్కటే కాదు, వీడికో వైన్‌షాప్ వుందికదా, దాన్ని మొత్తం తగలబెట్టేద్దాం" ఇంకో పెద్దమనిషి అన్నాడు.

మరో పెద్ద మనిషి ఏంమాట్లాడకుండా వేగంగా రమణవైపు కదిలి, అనూహ్యంగా అతడి కాలర్ పుచ్చుకుని చెంప పగలగొట్టాడు. అతడి అహం దెబ్బతింది. తట్టుకోలేకపోయాడు. తనని కొట్టిన ఆ పెద్దమనిషిని పళ్లు కొరుకుతూ రౌద్రంగా చూస్తూ వెనక్కి నెట్టేశాడు.

ఆ తోపుకు ఆ పెద్దమనిషి వెల్లకిల్లా పడిపోయాడు. అతడు ఆ వీధి అంతటికే కాదు, వూర్లో కూడా గౌరవమైన వ్యక్తి. అంతటి వ్యక్తినే రమణ అలా నెట్టడాన్ని ఎవ్వరూ సహించలేకపోయారు. అందరూ ఒక్కుమ్మడిగా రమణమీదకు ఎగబడి దేహశుద్ధి చేయడం మొదలెట్టారు. అందులో భాగంగా అతడి మిత్రులు కూడా తన్నులు తిన్నారు.

"పోలీస్‌స్టేషన్‌కు ఫోన్ చేయండి" ఎవరో అన్నారు. ఆ మాట అలా వెలువడిందో లేదో ఇలా ఓ కుర్రాడు పరుగున బయటకు వెళ్ళాడు.

పదిహేను నిమిషాల్లో పోలీసులు వచ్చారు. రమణను అతడి మిత్రులను పట్టుకునివెళ్ళారు. జరిగినదంతా చూడగానే గౌసియా కాళ్ళూ చేతులు వణకనారంభించాయి.

"గురుడికి మంచి గుణపాఠం జరిగింది" అంటూ తన ఇంట్లోకి వచ్చాడు యజమాని.

"ఇప్పుడే కాదండీ, నెలరోజుల కిందట కూడా ఎవరో అమ్మాయిని ఇంటికి తీసుకు వచ్చాడంట" వెనకేవస్తూ అంది.

"ఎప్పుడు? " అతడు అర్థంకానట్టుగా చూశాడు భార్యవైపు.

"మనం బుచ్చిబాబు పెళ్ళికని విజయవాడ వెళ్ళినప్పుడు" చెప్పింది భార్య.

"అలాగా! ఎవరు చెప్పారు ఈ సంగతి? "

"ఇప్పుడు కామాక్షమ్మ చెప్తోంది"

"అందుకే తగిన శాస్తి చేశాంకదా" అతడు అంటుంటేనే పొరుగింటి విమల హడావిడిగా వచ్చింది.

"ఏంటి వొదినా? మీకు ఇంతయినా బుద్ధివుందా? ఆ రౌడీ వెధవలతో కల్పించు కోవడం ఎందుకు? ఈరోజు వాడ్ని పోలీసు లకి పట్టిచ్చామని కాదు, రేపొద్దున కక్షగట్టి వాడు మనల్ని ఏమైనా చేస్తే ? " రాగానే కంగారుగా అంది.

"వాడు మనల్ని ఏంచేస్తాడు? " అన్నాడు అతడు.

"అలా అనుకోవద్దు అన్నయ్యా! రౌడీనా యాళ్ళు పాముల్లాంటి వాళ్లు. ఎక్కడ పొంచివుంటారో తెలీదు. అయినా మీకు సంబంధంలేని విషయంలో కల్పించుకు న్నారు. నాకు భయంగా వుంది" అంది విమల.

"సంబంధంలేని విషయం ఎందుకు అవు తుంది? మా ఇంట్లో అద్దెకు వుంటూ చేయ రాని పనులు చేశాడు కాబట్టే కల్పించు కున్నాం" అన్నాడు అతడు.

"ఏమో అన్నయ్యా! వాడ్ని భయపెట్టి వదిలేసివుంటే సరిపోయేది. కాని ఏకంగా పోలీసులకు పట్టిచ్చారు? మీరు కాబట్టి అలా చేశారు. నేనైతే నాకెందుకొచ్చిన గొడవ అంటూ ఇల్లు మాత్రం ఖాళీ చేయించి వూరుకునేదాన్ని! అంతేకదా. తన కుమాలిన ధర్మంలేదు" అంటూ గౌసియా వైపు చూపి, "ఈ అమ్మాయేనా? " అడిగింది విమల.

"ఏమ్మా... ఏ తల్లి బిడ్డవోగాని, నీ కోసం వీళ్ళు ఇంత హైరానా పడిపోయారు. ముమ్ముందు ఎన్ని కష్టాల్ని ఎదుర్కోవాల్సి వస్తుందో ఏమో? " అంటూ గౌసియాకు చేరువగా వెళ్ళింది విమల.

గౌసియా పడుకున్నదల్లా లేచి కూర్చోడా నికి ప్రయత్నించింది. "ఫర్వాలేదులే... పడుకో" అంటూ మరేదో మాట్లాడబో యింది విమల. అంతలోనే బయటనుండి పిలుస్తూ వచ్చింది ఆమె కూతురు. "వస్తు న్నాను" అంటూ ఆ వెంటనే వెళ్ళిపోయింది విమల.

"చూడమ్మాయీ! ఎవరో ఏదో అంటున్నా రని నువ్వు బాధ పడవద్దు. నీవు మా కూతురులాంటిదానివి" విమల వెళ్ళిపోగానే గౌసియాతో అన్నాడు అతడు.

"సరే" అన్నట్లుగా తలాడించింది గౌసియా.

ముఖ్యంగా గౌసియా "ఎవరు? " అనే విషయం ఆ దంపతులు పోలీసులకు చెప్ప లేదు. కాగా డాక్టర్ దినేష్ గౌసియా గురించి పోలీస్‌స్టేషన్‌కు "కనబడటంలేదు" అని రిపోర్టు ఇచ్చాడు. ఆ రిపోర్టు ఆధా రంగా అనుమానం వచ్చిన పోలీసులు, ఆ తర్వాత గంటసేపటికే తిరిగి గౌసియా వున్న ఇంటికి వచ్చారు. వాళ్ళ అనుమానం నిజమయింది. కాని గౌసియా హాస్పిటల్ కెళ్ళడానికి విముఖత చూపించింది. అందుకు ఆమెను ఎవ్వరూ బలవంతపెట్ట లేదు. ఆమె వెళ్ళాలనుకున్న మోహన్‌వాళ్ళ అన్నయ్య హాస్పిటల్‌కే పంపించాలనుకు న్నారు.

అదే సమయంలో వాళ్ళ ఇంటికి ఫోన్ వచ్చింది. ఫోన్ ప్రకారం ఆ ఇంటి యజ మాని తండ్రి విజయవాడలో గుండెనొప్పితో మరణించాడు. దీంతో వాళ్ళు అప్పటికప్పుడే విజయవాడ వెళ్ళేందుకు సిద్ధం కావడం, తప్పనిసరి పరిస్థితిలో గౌసియా హాస్పిట ల్‌కే వెళ్ళడం, అంతా అరగంటలో జరిగిపో యింది.

హాస్పిటల్‌కు వెళ్ళాక డాక్టర్ తనమీద మళ్ళీ కోప్పడతాడేమోనని గౌసియాకు భయమనిపించింది. కాని డాక్టర్ ఎంత మాత్రం కోప్పడలేదు. ప్రేమగా మాట్లా డాడు.

"హమ్మయ్య" అన్పించింది గౌసియాకు. కాగా కాంపౌండర్ కమలాకర్ ద్వారా తన కోసం "ఒక కుర్రాడు" వచ్చి వెళ్ళాడని తెలిసి, ఎవరా... అని ఆలోచించసాగింది గౌసియా.

"పేరు తెలీదుకాని, ఎత్తుగా...

దృఢంగా... చామనచాయ రంగులో వుంటాడు"

చిన్నవయసులోనే భారీ పర్సనాలిటి కలిగిన తన భవానీశంకర్ వివరాలు అవి!

మంచి ఎత్తు, దృఢమైన శరీరం, చామన ఛాయరంగు, మొనదేలిన ముక్కు, చురుకైన చూపు, ఒత్తయిన జుట్టు, తీరైన మీసకట్టు, నిజంగా తన భవానీశంకర్ ఎంత బాగుంటాడో! ఆ అందగాడు తనను వెదుక్కుంటూ వచ్చాడా?

ఆ ఆలోచనకే ఆమె మనసు పులకించిపోయింది. "అతడు ఎక్కడ వున్నాడు? " ఆరాటపడిపోయింది.

"ముంతాజ్ అని తెల్సిన కుర్రాడివెంట వచ్చాడు. వుంటే వాళ్ళ ఇంట్లోనే వుండొచ్చు" అన్నాడు కమలాకర్.

"దయచేసి అతడ్ని పిలిపిస్తావా? " అభ్యర్థనగా అడిగింది గౌసియా.

"ఎందుకు అంత ఆదుర్దా? ఆ కుర్రాడిలో కూడా ఇదే ఆదుర్దా కనబడింది" అన్నాడు కమలాకర్.

"తనూ... భవానీశంకర్" చెప్పింది గౌసియా.

అపనమ్మకంగా చూశాడు కమలాకర్.

"కావొచ్చు అనుకుంటున్నాను" అంతలోనే ఆమెలోనూ అపనమ్మకం.

"అతడు నీవు ప్రేమించిన కుర్రాడే అయితే మీ ఇద్దరు కల్సుకుంటున్నందుకు సంతోషం! కాని ఒక్క విషయం గుర్తుపెట్టుకో... ఆ కుర్రాడిదీ ప్రేమించే వయసు కాదు, నీదీ ప్రేమించే వయసు కాదు. మీ ఇద్దరూ ఇప్పుడు చదువుకోవాలి. మీ భవిష్యత్తుకో దారి వెదుక్కోవాలి" అన్నాడు కమలాకర్.

"నిజమే కావొచ్చు సార్! కాని ఇప్పుడు మాత్రం మేం ఇద్దరం... ఒకర్ని విడిచి ఒకరం వుండలేం. ప్రేమలో పడటం మా పొరపాటు అయినప్పటికీ మేం విడిపోయి బతకలేం!" అంది గౌసియా.

"మిమ్మల్ని విడిపొమ్మని నేను చెప్పడం లేదు. మీ ఇద్దరూ కల్సి బతకాలన్నదే నా ఆశ! కాపోతే సందర్భం వచ్చింది కాబట్టి వాస్తవం చెప్పాను" అని కాసేపాగి, "రేపు ఉదయాన్నే ఆ కుర్రాడ్ని ఇక్కడికి పిలిపిస్తాను సరేనా? " అన్నాడు అతడు.

"మీరు ఈ సహాయం చేస్తాను అంటుంటేనే, భవానీశంకర్ నా కళ్లముందు నిల్చున్న ఆనందం కలుగుతోంది. కాని అతడు భవానీశంకర్ కాకపోతే, నేను ఎలా తట్టుకోవాలి? అని భయం అన్పిస్తోంది కూడా" అంది గౌసియా.

"చూడమ్మాయీ! ముందే ఆశలు పెంచుకుని నిలువెత్తున ఆనందంలో కూరుకుపోకూడదు. ఒక విషయం గురించి గెలుపు ఓటములు రెండింటిని ఊహించుకోవాలి. వాటి ఫలితాన్ని ఎదుర్కోడానికి నిన్ను నీవు సిద్ధం చేసుకోవాలి" చెప్పాడు అతడు.

"అట్లాగే" బుద్ధిగా తలాడించిందామె.



హాస్పిటల్లో గౌసియా లేకపోవడం అనేది "డిస్చార్జి" అయితే భవానీశంకర్ అంతగా బాధపడకపోయేవాడు. కాని ఆమె ఎవ్వరికీ చెప్పాపెట్టకుండా వెళ్ళిపోయిందని

తెల్సి... కారణం ఊహించుకోలేక కలవరప డిపోసాగాడు.

మొదట "తన గౌసియా ఇక్కడికెలా వస్తుందని? " ఆమె ఉనికిని ఆ వూర్లో నమ్మ లేకపోయాడు. కానీ హాస్పిటల్లో తెల్సుకున్న వివరాల ప్రకారం ఆమె తన గౌసియానే అని నిర్ధారణ చేసుకున్న తర్వాత మనిషి కాలేకపోతున్నాడు కూడా! ఇలాగని హాస్పిట ల్లోనే అతడు తన బాధను వ్యక్తం చేసుకో లేదు. తను ఎవరో ఎవ్వరికీ తెలీకూడదు అనుకున్నాడు కాబట్టి, హాస్పిటల్లో వున్నంత సేపూ బాధను అదిమి పట్టుకున్నాడు.

ఇంటికి వచ్చాక ఇక ఒక్కక్షణం కూడా అక్కడ వుండాలనిపించలేదు భవానీశంక ర్‌కు. గౌసియాను వెదుక్కుంటూ వెళ్ళిపో వాలనిపించింది. ఆ విషయాన్ని ముంతా జ్‌తో చెప్తే వెళ్ళనివ్వడు కాబట్టి అతడికి చెప్పాపెట్టకుండా వెళ్ళిపోవాలనుకున్నాడు. కాని వెళ్ళలేదు. ఎందుకంటే అక్కడ్నుంచి వెళ్ళిపోతే తనది గమ్యం తెలియని పయనం అవుతుంది. అలాగని ఆ వూర్లో వుండడానికి అతడి మనసు ఒప్పుకోవడం లేదు.

వింతగా ఆడుకుంటున్న పరిస్థితులు మన సును చిత్రవధ చేస్తుంటే ఆలోచిస్తూ పడు కునివున్నాడు భవానీశంకర్.

"ఏంట్రా? దవాఖానకు వెళ్ళివచ్చినప్పటి నుండి ఇలా తయారైపోయావు? " వచ్చి పక్కలో కూర్చున్నాడు ముంతాజ్.

"గౌసియా గుర్తొస్తోందిరా" చెప్పాడు భవానీశంకర్.

"నాకు తెల్సు" అని కాసేపాగి, "అదృష్టం వుంటే ఇద్దరూ కల్సుకుంటారు. అనవస రంగా బాధపడొద్దు" చెప్పాడు ముంతాజ్.

భవానీశంకర్ ఏంమాట్లాడలేదు. ముంతాజ్ కూడా ఇంకేం అనలేదు. కొన్ని క్షణాల మౌనం తర్వాత భవానీశంకరే మెల్లగా నోరు విప్పాడు.

"ముంతాజ్"

"ఊఁ? "

'రేపు హైదరాబాద్ వెళ్ళిపోతాను"

"నీకు దమాక్‌గాని కరాబ్ అయ్యిందా? "

"నాకు ఇక్కడ ఉండాలనిపించడంలేదు. అందుకే రేపు ఉదయాన్నే వెళ్ళిపోతాను"

"వెళ్ళి ఎక్కడ వుంటావు? "

ఏం చెప్పలేకపోయాడు భవానీశంకర్.

"పరిస్థితులు కుదుటపడేవరకు ఇక్కడే వుండు. గౌసియా ఆచూకీ కూడా ఈ రెండుమూడు రోజుల్లో తెల్సిపోతుంది" ముంతాజ్ అన్నాడు.

"...."

"నీవు గనుక ఇక్కడ్నుంచి కాలు తీశావ నుకో, నీ కష్టాలు నువ్వే కొనితెచ్చుకున్నవా డివి అవుతావు. కాబట్టి మరేం ఆలోచించ కుండా హాయిగా పడుకో" చెప్తూనే స్నేహి తుడి పక్కలో పడుకుండిపోయాడు ముంతాజ్.

భవానీశంకర్ మాత్రం అలాగే ఆలో చిస్తూ... "ఇంతకూ గౌసియా ఎక్కడికి వెళ్ళినట్టు? తనను ఎవరైనా తీసుకువె ళ్ళారా? లేక తనే వెళ్ళిందా? తను ఎలా వెళ్ళినా సరే... తనకు ఏమీ జరగకుండా క్షేమంగా వుండాలి"అని మనసులో అనుకు న్నాడు.

## ఆదివారం

ఉదయం పదిన్నరకు భవానీశంకర్ విష యమై ముంతాజ్‌ని కల్సేందుకు గవర్న మెంట్ హాస్పిటల్‌కు వెళ్ళాడు కమలాకర్!

"గౌసియా వచ్చింది. నీ పక్కన వున్న కుర్రాడు ఎక్కడ వున్నాడు? " అడిగాడు కమలాకర్.

ముంతాజ్ కమలాకర్‌వైపు అర్థం కాన ట్టుగా చూశాడు.

"అదేం ముంతాజ్ అలా చూస్తున్నావు? గౌసియా దొరికింది. నిన్న నీ వెంట వచ్చిన కుర్రాడు ఆ పిల్ల లవ్వర్ అంటకదా? " అన్నాడు.

"ఆ విషయం నీకెవరు చెప్పారు? " అడిగాడు ముంతాజ్.

"గౌసియానే చెప్పింది"

ముంతాజ్‌కు అనుమానం వచ్చింది. "నిన్న గౌసియా కోసం తాము మామూలుగా వెళ్ళారు. ఏమాత్రం అనుమానం రాకుండా ప్రవర్తించారు. ఒకవేళ గౌసియా నిజంగానే తిరిగివచ్చినా, భవానీశంకర్ అక్కడికి వెళ్ళినట్టు ఆమెకు ఎలా తెలుస్తుంది? "

ఈ అనుమానం రాగానే... "వాడు నిన్ననే వెళ్ళిపోయాడు" చెప్పాడు ముంతాజ్.

"ఎక్కడికెళ్ళాడు? " అడిగాడు కమలాకర్.

"హైద్రాబాద్ వెళ్ళాడు! అయినా వాడికి గౌసియా పరిచయం వుండటం ఏంటీ? " అన్నాడు ముంతాజ్.

"అయ్యో! అనవసరంగా ఆ పిల్లలో ఆశలు పెంచానా ఏంటీ" మనసులో అనుకుని, "ఆ కుర్రాడి పేరేమిటి? " అడిగాడు కమలాకర్.

"గోపాల్" చెప్పాడు ముంతాజ్.

"అలాగా!" అంటూ తలాడించి "అలవాటులో పొరపాటు..." తనలో తను గొణుక్కుని, "వెళ్తాను ముంతాజ్... నాకు టైమ్ అయ్యింది" అని చెప్పి అక్కడ్నుంచి బయటపడ్డాడు కమలాకర్.

అతడు అలా వెళ్ళిపోగానే ఇలా రెండవ దారి వెంబడి, తన లూనామీద ఇంటికి బయలుదేరి వెళ్ళాడు ముంతాజ్.

ఇంటిదగ్గర భవానీశంకర్ టీవీ చూస్తూ కూర్చుని వున్నాడు. అతడి ముఖంలో నిరాసక్తత స్పష్టంగా కనబడుతోంది.

"అరే శంకర్... నువ్వు వెంటనే ఇక్కడ్నుండి తప్పుకోవాలిరా" వెళ్ళగానే హడావిడిగా చెప్పాడు ముంతాజ్.

"ఎందుకు? " భవానీశంకర్‌లోనూ హడావిడి.

"నువ్వు ఇక్కడ వున్నావని పోలీసులకు తెలిసినట్టుంది. నిన్న మనం వెళ్ళామే ఆ దవాఖానా కాంపౌండర్ ఇంతక్రితం నా దగ్గరికి వచ్చాడు. నీ గురించి ఆరా తీశాడు" చెప్పాడు ముంతాజ్.

"అయితే ఇప్పుడెలా? " కంగారుపడిపోయాడు భవానీశంకర్.

"నీవు అస్సలు ఈ వూర్లోనే వుండొద్దు. హైద్రాబాద్ వెళ్ళిపో! నేను నీ వెంటే వస్తాను. అక్కడ మా మేనత్త వాళ్ళ ఇంట్లో వుందువుగాని" అన్నాడు ముంతాజ్.

"ఇప్పటికిప్పుడు హైద్రాబాద్ వెళ్ళొద్దు. వెళ్తుంటే మిమ్మల్ని ఇక్కడే మధ్యలోనే పట్టుకోవచ్చు. కాబట్టి ముందు నీ స్నేహితుడు నజీర్‌వాళ్ళ ఇంటికి తీసుకెళ్ళు. అక్కడ మధ్యాహ్నం దాకా వుంటే, పరిస్థితి కొద్దిగా కుదుటపడవచ్చు" కల్పించుకుంది ముంతాజ్ తల్లి హుస్సేన్‌బీ.

"ఆ పనిచేద్దాం... రారా" అంటూనే బయటకు నడిచాడు ముంతాజ్. వెనకే నడిచాడు భవానీశంకర్.

పది నిముషాల్లో నజీర్‌వాళ్ళ ఇంటికి చేరుకున్నారు మిత్రులు ఇద్దరూ. నజీర్ వాళ్ళది చాలా పెద్ద ఇల్లు. అంత పెద్ద ఇంట్లో మొత్తం ఇరవైఐదు మందిదాకా వుంటారు. వాళ్ళందరికీ మతచాదస్తం కూడా ఎక్కువ! కాబట్టి ముంతాజ్ చెప్పిన ప్రకారం భవానీశంకర్ అక్కడ ముస్లిం యువకుడిగా మారాడు.

"వీడు నా దోస్త్... సయ్యద్ పాషా! హైద్రాబాద్‌నుండి వచ్చాడు. మా ఇంట్లో అమ్మ తప్పిస్తే ఎవ్వరూ వుండరు. కాబట్టి వాడికి బోర్‌గా వుంటుందని ఇక్కడికి తీసుకువచ్చాను" ఉర్దూలో నజీర్‌తో చెప్పాడు ముంతాజ్.

"దవాఖానా దగ్గరికి తీసుకువెళ్ళొచ్చు కదరా" అన్నాడు నజీర్.

"నేను మర్డర్‌కేసు విషయమై పక్క పల్లెకు వెళ్తున్నాను" చెప్పాడు ముంతాజ్. అదే సమయంలో ముంతాజ్‌కు ఒక ఆలో

చన వచ్చింది. దాన్ని వెంటనే చెప్పాడు.

"వీడికి నీ టోపి, షార్వాణీ ఇవ్వరా? వచ్చేప్పుడు అట్లాగే వచ్చాడు గానీ, మాసిపోయాయని ఇక్కడికి వచ్చాక మార్చుకున్నాడు. ఇది నా డ్రెస్సే" నజీర్ చెప్తూ భవానీశంకర్ డ్రెస్సును చూపించాడు ముంతాజ్.

స్నేహితుడు ఎందుకు అలా చెప్తున్నాడో అర్థంకాలేదు భవానీశంకర్‌కు. అయినప్పటికీ మౌనంగా వుండిపోయాడు. అదే సమయంలో నజీర్‌కు వాళ్ళమ్మ దగ్గర్నుంచి పిలుపువచ్చింది. నజీర్ వెంటనే వెళ్ళిపోయాడు.

"ఏంట్రా? " నజీర్ వెళ్ళిపోగానే అడిగాడు భవానీశంకర్.

"నీకు వీళ్ళ సంగతి తెలీదురా! వీళ్ళ ముస్లిం పిచ్చి సామాన్యమైనది కాదు. ఇలా ప్యాంట్, షర్టూ వేసుకునేవాళ్ళను వీళ్ళు అసలు సిసలైన ముస్లిం కాదనుకుంటారు. మా ఇంటిదగ్గరే నీకు షార్వాణి తొడిగించుకు వద్దామనుకుంటే, ఆలస్యం ఎంత మాత్రం మంచిది కాదు అన్పించింది. అందుకే ఇక్కడ ఇలా చెప్పాను.

"నీవు ఇక్కడ పొరపాటున కూడా తెలుగులో మాట్లాడొద్దు. ఇంకో విషయం ఏంటంటే జ్వరం వచ్చినట్లుగా నటించు. లేదంటే వాళ్ళతో పాటుగా నమాజ్ చేయమంటారు" భుజం తడుతూ చెప్పి, "నీవు ఈ గెటప్‌లోనే బయటకు వెళ్ళావనుకో. నిన్ను ఎవ్వరూ గుర్తుపట్టరు..." అన్నాడు ముంతాజ్.

"ఏంటోరా. అన్నీ అవస్థలే" అన్నాడు భవానీశంకర్.

"బాధపడొద్దు. అల్లా వున్నాడు. నీ కష్టాలు అన్నీ గట్టెక్కుతాయి" ధైర్యం చెప్పాడు ముంతాజ్.

చిరునవ్వుతో తల పంకించాడు భవానీశంకర్. మరో పదినిముషాల తర్వాత ముంతాజ్ వెళ్ళిపోయాడు. నజీర్ భవానీశంకర్‌తో బాగా కలిసిపోయాడు. ముభావంగా వుంటాడేమోనని భయపడ్డ భవానీశంకర్, నజీర్ తనతో స్నేహంగా కలిసిపోయినందుకు ఆనందపడ్డాడు. తనుకూడా నజీర్‌తో స్నేహంగా మెలుగుతూ, నజీర్ వాళ్ళ ఇంటినుండే షిరాజ్‌కోసం నంబరు కలిపాడు.

ఆ సమయంలో నజీర్ నమాజ్‌కోసమని కింది హాల్లోకి వెళ్ళాడు. అతడి కుటుంబసభ్యులు అందరూ ఆ హాల్లోనే నమాజ్‌చేస్తారు. భవానీశంకర్‌కు అదే అవకాశం అన్పించింది. కానీ కొద్దిసేపువరకు ఎంగేజ్ వచ్చింది. అయినప్పటికీ ప్రయత్నిస్తూపోయాడు. కాసేపటికి నంబర్‌కల్సింది. అవతల షిరాజే లైన్లోకి వచ్చాడు.

"హలో..."

"సిరాజ్... నేను" అన్నాడు భవానీశంకర్.

"భవానీశంకర్? " అన్నాడు సిరాజ్.

"అవున్రా! అక్కడ పరిస్థితి ఎలా వుంది? " అడిగాడు భవానీశంకర్.

"పరిస్థితులు చాలా కటువుగా వున్నాయి. నువ్వు ఇప్పుడు ఇక్కడికి రావద్దు. నీవు గౌసియా వాళ్ళ నాన్నను చంపేసినందుకు, మరెవ్వరినైనా హిందువును చంపెయ్యాలన్నంత కసిగా వున్నారు మా ముస్లింలు. కానీ అంత సాహసం ఎవ్వరూ చేయరు. ఎందుకంటే, ఇప్పటికే ఇక్కడ హిందూ ముస్లిం గొడవలు తారాస్థాయికి చేరుకుని వున్నాయి. కాబట్టి ఆవేశపడినా కూడా హద్దులలోనే వుంటారు. మీ అమ్మానాన్నలకు పోలీసులు రక్షణగా వున్నారు. ఇక నువ్వు ఎక్కడ వున్నావో ఏమోగానీ, ఎట్టి పరిస్థితుల్లోనూ బయటకు రావొద్దు" అవతల షిరాజ్ మాట్లాడుతూ పోతున్నాడు.

ఇవతల భవానీశంకర్‌కు టెన్షన్ పెరిగిపోతుంటే... "నా గురించి పొరపాటున కూడా ఎవ్వరితో మాట్లాడవద్దొరేయ్" మధ్యలోనే అందుకున్నాడు.

"నాకు అన్నీ తెల్సు" అన్నాడు షిరాజ్.

"ముంతాజ్‌గాడు ఫోన్ చేశాడా?" అడిగాడు భవానీశంకర్.

"చేయలేదు. నువ్వు ఎక్కడ వున్నావు?"

"ముంతాజ్‌గాడి స్నేహితుడి ఇంట్లో వున్నాను. ఇక్కడ భవానీశంకర్‌గా కాదు, సయ్యద్ పాషాగా వున్నాను"

"అదేంట్రా?"

"అదో పెద్ద కథ" భవానీశంకర్ అంటుంటేనే ఎవరో వస్తున్న అలికిడి అయ్యింది.

"తర్వాత మాట్లాడదాం" అంటూ చప్పున ఫోన్ పెట్టేశాడు భవానీశంకర్. నజీర్ వచ్చి జానీమా తీసుకుని వెళ్ళాడు. నిజానికి నజీర్ ఎదురుగా కూడా తను ఫోన్ చేయగలడు. కానీ మాట్లాడే విషయాలు సీక్రెట్ కాబట్టి దొంగచాటుగా మాట్లాడాల్సి వచ్చింది. అదే అతడు చేసిన పొరపాటు అయ్యింది.

పది నిముషాల తర్వాత మేడమీదకు వచ్చి సూటిగా అడిగాడు నజీర్.

"నువ్వెవరు?"

అదిరిపడి చూశాడు భవానీశంకర్.

"నువ్వు మమ్మల్ని మోసం చేయలేవు" నజీర్ గొంతులో కాఠిన్యం.

అంతా అర్థమైంది భవానీశంకర్‌కి. చాటునుండి తన మాటల్ని నజీర్ విన్నాడని అనుకుంటున్నాడు అతడు. కానీ చాటు నుండి భవానీశంకర్ మాటలు వినలేదు నజీర్. వాళ్ళది ప్యారలల్ ఫోన్. భవానీశంకర్ మాట్లాడే సమయంలోనే ఎవ్వరికో అత్యవసరమై ఫోన్ చేయబోయి, అంతా వినేశాడు. అంతేకాదు, పేపర్‌ద్వారా గౌసియా సంగతి తెలుసు కాబట్టి... ఆ వెంటనే పోలీస్ స్టేషన్‌కు కూడా ఫోన్ చేసి మేడమీదకు వచ్చాడు. ఆ సంగతి భవానీశంకర్‌కు తెలియకపోయినా, తన బండారం బయటపడింది కాబట్టి వెంటనే అక్కడ్నుంచి తప్పించుకోవాలనుకున్నాడు. కానీ అందుకు అవకాశమే లేకుండా పోయింది.

"ఇప్పుడేం చేయాలి?" భయంగా మనసులో అనుకుంటూ అటూ ఇటూ చూస్తూ నిస్పృహాయంగా నిలబడిపోయిన భవానీశంకర్‌కు చప్పున ఒక ఆలోచన వచ్చింది. అతడు ఆలస్యం చేయలేదు. మెరుపువేగంతో ముందుకు దూకి, అక్కడ గోడకు తగిలించి వున్న తుపాకీ చేతుల్లోకి తీసుకున్నాడు.

అంతలోనే ఆ ఇంటివాళ్ళంతా ఒక్కొక్కరిగా ఆ గదిలోకి రాసాగారు. అందరిలోనూ హడావిడి... కంగారు! కొందరిలో తోడుగా కోపం కూడా!

భవానీశంకర్ ఎవ్వరికీ భయపడలేదు. తుపాకి ఎత్తి అప్రమత్తుడయ్యాడు. అందరూ అతడివైపు భయంగా, నిస్పృహాయులుగా చూస్తుండిపోయారు.

"ఎవ్వరైనా నాకు అడ్డువస్తే కాల్చిపడేస్తాను" భయపెడుతూ క్రమంగా అందర్నీ దాటుకుని వెలుపలికి నడిచాడు. భయపడుతూనే కొందరు అతడి వెంటే వచ్చారు.

ఆ పెద్ద బంగ్లాలోని గదుల్ని దాటి పూర్తిగా బయటకు వెళ్ళేవరకు తుపాకీ గురిపెట్టే వున్నాడు భవానీశంకర్. బయటకు వెళ్ళాక ఒకపక్కగా పార్క్ చేయబడిన యమహా కనబడింది.

ఒక చేత్తో తుపాకి ఎక్కుపెట్టి మరోచేత్తో యమహా స్టార్ట్ చేసుకుని, రివ్వున ముందుకు దూసుకుపోయాడు అతడు. జరిగిన అనూహ్యపరిణామానికి వాళ్ళంతా మరబొమ్మల్లా నిలబడిపోయారు.

భవానీశంకర్‌కు మధ్యలో ఎదురయ్యింది పోలీస్‌వ్యాన్. షార్వాణీ ధరించి, టోపీ పెట్టుకుని, అచ్చు ముస్లిం కుర్రాడిలా తయారైవున్న అతగాడు... పోలీసుల్ని చూసి కూడా కించిత్ భయపడలేదు. బండిని రైల్వేస్టేషన్‌వైపు పోనిస్తూ "తండ్రీ భగవంతుడా... నువ్వే నన్ను కాపాడాలి" ఆదుర్దా కొద్దీ అనుకున్నాడు.

బండి పదిహేను నిముషాల్లో రైల్వేస్టేషన్ చేరుకుంది. ప్లాట్‌ఫామ్‌పై ఓ రైలు

చిన్నజర్క్‌తో కదులుతోంది. అది ఎక్కడికి వెళ్ళే రైలు అన్న సంగతి గురించి ఆలోచించలేదు భవానీశంకర్. బండిని... రైఫిల్‌ను అక్కడే వదిలేసి, వేగంగా పరుగెట్టుకువెళ్ళి రైలు ఎక్కేశాడు.

రైలు వేగాన్ని పుంజుకుంది. తల పట్టుకుని కూర్చుండిపోయాడు భవానీశంకర్.

అతడు కూర్చున్న బోగీలోనే ఆ చివర్న గౌసియా... కమలాకర్‌లు వున్నారు. కమలాకర్ న్యూస్ పేపర్ చదువుతున్నాడు. గౌసియా పడుకుని ఏదో ఆలోచిస్తోంది.

"గౌసియా..." కాసేపటి తర్వాత పిలిచాడు కమలాకర్.

"ఊ..." పలుకుతూ చూసింది గౌసియా.

"అక్కడికి వెళ్ళాక మరెక్కడికో వెళ్తానని వాళ్ళను ఇబ్బంది పెట్టొద్దు" చెప్పాడు.

అతడు ఆ మాట అనగానే ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"ఏడ్వొద్దు. వాస్తవం చెబుతున్నాను. మమ్మల్ని ఇబ్బంది పెట్టినట్లుగా వాళ్ళను ఇబ్బంది పెడితే వాళ్ళు నిన్ను విసుక్కోవచ్చు ఇందువల్ల నిన్ను పట్టించుకునే వాళ్ళే లేకపోవచ్చు" అన్నాడు అతడు.

"మిమ్మల్ని ఇబ్బంది పెట్టాలనే ఉద్దేశం కాదు నాది. డబ్బులు ఎవ్వరివైనా కావొచ్చు నేను హైద్రాబాద్ వెళ్ళడం అనవసరపు ఖర్చే అవుతుంది. కానీ నాకు ఇక్కడ వుండాలని లేదు. మీరంతా నా స్వంత కుటుంబసభ్యుల్లా వుంటున్నప్పటికీ, డాక్టర్‌బాబు ఏ క్షణాన నాపై కోప్పడ్తాడో నన్న భయం... నన్ను ఇంకెవరైనా మోసం చేసి తీసుకువెళ్తారేమోనన్న భయం... నన్ను క్షణక్షణం వెంటాడుతున్నాయి. తోడుగా భవానీశంకర్‌కోసం ఆశపడి, అడియాశను అందుకున్నాను కాబట్టి... అక్కడ ఎంతమాత్రం నిలవబుద్ధికావడంలేదు" చెప్పుకుపోయింది గౌసియా.

"నేను నిన్ను అర్థం చేసుకోగలను గౌసియా! కాపోతే నేను చెప్పేదే నీవు అర్థం చేసుకోవడంలేదు.

నీది పరిస్థితుల్ని అర్థం చేసుకోలేని అమాయకత్వం. నీ వయసు పిల్లలు చాలామంది ఎంతో తెలివిగా, ఎంతో చలాకిగా, ప్రవర్తిస్తుంటారు. కానీ నీలో ఆ తెలివి, ఆ చలాకీతనం ఎంతమాత్రం లేవు. నీవు చాలా అమాయకురాలివి. ఈ అమాయకత్వంతో నీవు నీ ఇష్టప్రకారం ప్రవర్తించవద్దు. వెళ్ళినచోట వాళ్ళకు అనుగుణంగా మసులుకోవాలి. వాళ్ళు చెప్పినట్లుగా వినాలి" ఆత్మీయంగా చెప్పాడు అతడు.

"అట్లాగే" తలాడించిందామె.

కమలాకర్ ఇంకేం చెప్పలేదు. గౌసియా కూడా ఇంకేం మాట్లాడలేదు. కాసేపటి తర్వాత చిటికెనవేలు చూపిస్తూ లేవబోయింది గౌసియా. ఆసరాపట్టాడు కమలాకర్.

కమలాకర్ తోడుతో టాయ్‌లెట్‌వైపు నడిచింది గౌసియా. భవానీశంకర్ కూర్చుని వున్న వరుసముందు నుండే ఆమె నడిచివెళ్ళింది. కానీ అతడు అలాగే తల పట్టుకుని కూర్చుని వున్నందున, ఆమెను గమనించలేదు.

ఆమె టాయ్‌లెట్‌కువెళ్ళి వస్తుంటే అతడు అలాగే కూర్చుని వున్నాడు. ఆమె కూడా ఎవరివైపూ చూళ్ళేదు. కాగా, ఆమె ఆ వరుస దాటి వెళ్ళబోతుండగా, "హమ్మా హమ్మయ్య" అనుకుంటూ తలెత్తాడు భవానీశంకర్. కానీ అతడు గౌసియావైపు చూళ్ళేదు. కాపోతే అతడు ద్వారం పక్కనే కూర్చుని వున్నందున, అతడి గొంతు ఆమె చెవిలోకి చేరగానే ఆమె అడుగులు అప్రయత్నంగా ఆగిపోయాయి.

తల తిప్పి ఆదుర్దాగా ప్రయాణికుల్ని గమనించింది. భవానీశంకర్‌ను చూడగానే ఆమె కనుబొమలు ముడిపడ్డాయి.

"నువ్వేనా? "

"అగ్నిపర్వతపు అంచులోని హిమశిఖరానివేనా? "

ముస్లిం యువకుడిలా వేషం ధరించిన భవానీశంకర్ వైపు ప్రశ్నార్థకంగా చూస్తోందామె. కమలాకర్ గౌసియావైపు అర్థంకానట్లుగా చూస్తుండిపోయాడు.

"శం...క...ర్..." కొన్నిక్షణాల తర్వాత మెల్లగా పిలిచిందామె.

అతడు చప్పున తలతిప్పి చూసి, ఆ వెంటనే "గౌసియా..." అంటూ కళ్ళింత చేసి ఆత్రంగా లేచి వచ్చాడు.

ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఆనందమో... ఆవేదనో... అర్థంకాని తనమో... తెలీదుగానీ, ఆమె కళ్ళల్లో సకలభావాలు ఇమిడిపోయాయి. ఏదో ఆవేశం కూడా ఆమెలో పొంగిపొర్లుతుంటే అతడ్ని చూస్తూ అలాగే నిలబడలేకపోయింది.

భవానీశంకర్ కూడా ఎంతోసేపు ఆమెను చూస్తూ నిలబడలేకపోయాడు.

"గౌసియా... " మరోసారి పిలుస్తూ చప్పున వచ్చి ఆమె చేతుల్ని పట్టుకున్నాడు. అతడి కళ్ళల్లోనూ నీళ్ళు... ఆమె మీది అభిమానానికి, ప్రేమకి, ప్రతీకలుగా కనబడుతున్నాయి.

ఆలస్యం అయిందేమో అని అటు తొంగి చూసిన కమలాకర్‌కి అంతా అర్థమైంది. ఇద్దర్నీ తీసుకువెళ్ళే ప్రయత్నం చేస్తూ "రామ్మా గౌసియా..." అన్నాడు.

కమలాకర్‌వైపు అప్పుడు చూశాడు భవానీశంకర్. కమలాకర్‌ని చూడగానే అతడిలో భయం పెరిగింది. చప్పున గౌసియాకు దూరం జరిగాడు.

"భయపడొద్దు..." అన్నాడు కమలాకర్.

భవానీశంకర్, కమలాకర్‌ని చూడగానే ఎందుకు భయపడుతున్నాడో అర్థంకాక ఇద్దరి వైపూ ఒకసారి కంగారుగా చూసి, "కమలాకర్ సారు చాలా మంచివాడు" చెప్పింది గౌసియా.

భవానీశంకర్ మనసు అప్పుడు కుదుటపడింది. ముగ్గురూ పక్క వరుసలోకి నడిచి కూర్చున్నారు.

గౌసియా పడుకుంటే ఆమె తల దగ్గరే కూర్చుని ఆమెవైపు అర్థంకానట్లుగా చూశాడు.

"నేను చచ్చి బతికాను" అతడి చూపుల్ని అర్థం చేసుకుంటూ తొలిమాటగా మాట్లాడింది గౌసియా.

ఆమాత్రానికే భరించలేని వాడిలా గౌసియా చేతిని తన చేతిలోకి తీసుకుని మృదువుగా నొక్కాడు భవానీశంకర్.



రైలు సికింద్రాబాద్ స్టేషన్‌ని సమీపిస్తోంది. అంతవరకూ గౌసియా పడిన అవస్థల్ని పూర్తిగా తెలుసుకున్న భవానీశంకర్ మనిషి కాలేకపోయాడు.

అతడిది గమ్యం తెలియని పయనం. ఆమె మాత్రం అక్కడ దిగాల్సివుంది. కానీ అతడ్ని వదిలి ఆమె దిగలేకపోతోంది.

"గౌసియా! నీవు వెళ్లక తప్పదు. కోలుకునే వరకూ మోహన్ వాళ్ల హాస్పటల్‌లోనే వుండు. ఆ తర్వాత నీవు కోరుకున్న వాడి వెంట వెళ్లిపోదువుగాని." అన్నాడు కమలాకర్.

"వద్దు. నేను అక్కడికి వెళ్తే నాగురించి పోలీసులకి తెలుస్తుందేమో అనిపిస్తోంది. అందుకే నేను తన వెంటే వెళ్లిపోతాను."

భవానీశంకర్ చేతుల్ని గట్టిగా పట్టుకుంది గౌసియా.

"గౌసియా గురించి బయటకి తెలిస్తే తన ప్రాణానికి ముప్పు కలగవచ్చు... కలగకపోవచ్చు. కానీ ముస్లింలు మాత్రం ఆమెను తిరిగి నా కోసం రానివ్వరు. మేమిద్దరం ఎక్కడికైనా వెళ్లిపోతాం. ఈ ప్రపంచానికి దూరంగా వెళ్లిపోయి ఏమతం, ఏకులం లేకుండా మనసున్న మనుషులుగా బతుకుతాం. మాకు అండగా నిలవండి." చేతులు జోడించాడు భవానీశంకర్.

"గౌసియాను ఈ పరిస్థితుల్లో వెంట తీసుకు వెళ్లి కష్టాలుపడలేవు నువ్వు. అయినా మీ ఇద్దరూ కలిసి ఇప్పుడు ఎక్కడికి వెళ్తారు? నీవు మగపిల్లాడివి.... ఎక్కడైనా బతకగలవు. కానీ తను ఆడపిల్ల. భద్రత లేకుండా ఈ సమాజంలో జీవించడం చాలా కష్టం." అన్నాడు కమలాకర్.

మరేం మాట్లాడలేకపోయాడు భవానీశంకర్. నిలువునా గాయాలతో వున్న తన ప్రియురాలిని వేదన నిండిన కళ్లతో చూస్తుండిపోయాడు.

"మోహన్ వాళ్ల కుటుంబం చాలా మంచి కుటుంబంలా వుంది. వాళ్లు మిమ్మల్ని అర్థం చేసుకోగలరు. కాబట్టి గౌసియా తప్పకుండా నీకోసం వస్తుంది. ఈ విషయంలో నేను హామీ ఇవ్వగలను బెంగపెట్టుకోవద్దు.

నీవు మద్రాస్ వెళ్లిపోయి ఏదైనా పని చేసుకో. అక్కడ నీవు సయ్యద్‌పాషాగానే బతుకు. అదే పేరుతో నీ చిరునామా తెలుపుతూ నాకు ఉత్తరం రాయి. నీవు ఇకనుంచీ నా స్వంత తమ్ముడివే. కాబట్టి ఏ అవసరం వచ్చినా సంకోచంలేకుండా నాతో చెప్పు. నాకు చేతనైన సహాయం చేస్తాను.

ముఖ్యంగా నీవు చేసే పని ఎంతచిన్నదైనా కావచ్చు. ఆపని నిన్ను ప్రయోజకుడిగా మారిస్తే నీ పెళ్లాన్ని ధైర్యంగా పోషించగలవు. లేదంటే ఒక్క నిముషాన్ని వెనకేసుకోవడానికి నీవు ఎన్నో అవస్థల్ని ఎదుర్కోవాల్సి వస్తుంది. కాబట్టి మీ భవిష్యత్తుకోసం ఒక స్థానాన్ని సంపాదించుకో. ఆతర్వాత గౌసియాను నేనే స్వయంగా తీసుకువచ్చి నీకు అప్పచెబుతాను.... సరేనా!" చెప్పుకుపోయాడు కమలాకర్.

కాసేపు ఆలోచించి 'సరే' అన్నట్టుగా తలాడించాడు భవానీశంకర్.

రైలు సికింద్రాబాద్ స్టేషన్ చేరుకుంది. తన ప్రియుడు తనకు దూరమైపోతున్నాడన్న బాధ ఆమెను ఇక నిలవనీయలేదు. చిన్నపిల్లలా వెక్కివెక్కి ఏడవసాగింది. భవానీశంకర్‌లోనూ గొంతులోనే వుంది దుఃఖం. కానీ బలవంతాన ఆపుకుంటూ ఆమెకు ధైర్యంచెప్పాడు.

"మనం తప్పకుండా కల్సుకుంటాం. ఈ ఎడబాటు కొన్నాళ్లే!"

రైలు కొంతదూరం ముందుకు సాగిపోయి ఆగింది.

కమలాకర్ వెళ్ళి ఆటోరిక్షా తీసుకువచ్చాడు.

భవానీశంకర్ జాగ్రత్తగా గౌసియాను ఆటో ఎక్కించాడు.

వాళ్ళ అనురాగాన్ని చూస్తూ నిల్చున్న కమలాకర్... భవానీశంకర్ భుజాన్ని తట్టి ధైర్యం చెబుతూ, "మీ ప్రేమ గెలిచింది. కానీ పరిస్థితులు ప్రతికూలంగా వున్నాయి. అనుకూలం అయ్యేవరకు ఓపిక అవసరం" అని, తన ప్యాంట్ జేబులోంచి రెండువందల రూపాయలు తీసి అందివ్వబోయాడు.

"వద్దు" అన్నాడు భవానీశంకర్.

"ఫర్వాలేదు తీసుకో" అంటూ రెండువందల రూపాయల్ని భవానీశంకర్ చేతికి అందించి, ఆటో ఎక్కి కూర్చున్నాడు కమలాకర్.

మరుక్షణం ఆటో ముందుకు కదిలింది. కదిలిన ఆటోలోంచి వీడ్కోలుగా చేయి వూపింది గౌసియా. భవానీశంకర్ కూడా తన చేతిని గాలిలోకి ఎత్తి వూపాడు.

వెళ్తున్న ఆటోనే చూస్తూ అలాగే చేయి ఊపుతూ నిలబడిపోయాడు భవానీశంకర్! ☆

# చతుర ప్రపంచం

## ఆరని అగ్ని

1991లో ఇరాక్ సైన్యం కువైట్ నుంచి వెళ్లిపోతూ అక్కడి గొట్టపు చమురు బావులను తగులబెట్టారు. ఇందువల్ల కువాయిట్ ఆర్థికంగా నష్టపోవాలన్నది ఇరాక్ ఆశయం. అలా మొత్తం 727 బావులని తగలబెట్టారు. వాటిల్లో 'యం.జి 63' అనే బావిని మిగిలిన బావులంత తేలిగ్గా ఆర్పలేకపోయారు పని వాళ్లు. రోజుకి 2 కోట్ల 50 లక్షల బేరల్స్ చమురు ఆ బావిలో మండిపోసాగింది. దీన్ని ఆర్పే పనిని బ్రిటన్‌కి చెందిన బూట్స్అండ్ కూట్స్ కంపెనీ చేపట్టింది. చమురుబావులని ఆర్పడంలో ఆ కంపెనీది అరితేరిన చెయ్యి.

ఆ బావిలోని చమురు 3500 డిగ్రీల సెల్సియస్ వేడితో మండుతోందని గ్రహించారు ఆ కంపెనీ ఇంజనీర్లు. పది దేశాలకి చెందిన నిపుణులు ఆ కంపెనీ లో పనిచేస్తున్నారు. అంతా ఆ బావిని ఎలా ఆర్పాలా అని ఆలోచించారు. అంతదాకా అంతవేడిని ప్రపంచంలో ఎవరూ చల్లార్చలేదు. మామూలు పద్ధతులన్నీ అపజయం చవిచూశాయి. ముందర ఆ బావిలోకి ఆక్సిజన్ వెళ్లకుండా చేసి దానికి మూతపెడితే లోపల ఆక్సిజన్ లేక బావి ఆరిపోతుందన్న ప్రతిపాదనను అందరూ ఆమోదించారు.

కానీ ఆక్సిజన్ లేకుండా చేయడం ఎలా? నైట్రొజన్ ఆక్సిజన్‌ని పారద్రోలుతుంది. అంచేత నైట్రొజన్‌ని ఆ మంటల్లో నింపాలి. అయితే నైట్రొజన్ డ్రమ్ములు ఆ మంటల దగ్గరకు వెళ్లకుండానే వేడికి దూరంనుంచే పేలిపోసాగాయి. ఆ మంటల్లోకి నైట్రొజన్ డ్రమ్స్ వెళ్లే దాకా వాటిమీద నీటిని గొట్టంతో స్ప్రే చేయసాగారు. ఆ డ్రమ్ములను కూడా ఓ ప్రత్యేకమైన లోహం, మట్టి కలిపి తయారుచేశారు. నైట్రొజన్ మంటల్లోకి వెళ్లే మార్గంలో మంటలు తగ్గడానికి (ఆక్సిజన్‌ని ఖర్చుచేయడానికి) డైనమైట్లను పేల్చారు.

వాళ్లు దాంట్లో విజయం సాధించడానికి రెండు వారాలు పట్టింది. వాళ్లు పని మొదలుపెట్టిన పదిహేనున్నర రోజులకి ఆ బావిలోని మంటలు పూర్తిగా ఆరాయి. వెంటనే ఆ గొట్టపు బావికి మూతని బిగించారు. ఈపనంతా ప్రత్యేక రోబోట్స్ సహాయంతో నిర్వహించారు. డిసెంబరు 19, 1991 న ఆ బావి పూర్తిగా ఆరేసరికి 1.1 బిలియన్ బేరల్స్ చమురు వృథాగా మండిపోయింది. 727 బావులు తవ్వడానికి కువయిట్‌కి 2 సంవత్సరాలు పట్టింది.



# ఫ్లోరెంటైన్ ఫుట్‌బాల్

ఇటలీలోని ఫ్లారెన్స్ నగరంలో రెండు పుట్టాయి. ఒకటి ఫ్లోరెంటెయిన్ సలాడ్, రెండోది ఫ్లారెంటెయిన్ ఫుట్‌బాల్. రెండోది మొద టిదానంత ప్రాచుర్యం పొందలేదు.

రోమన్ సామ్రాజ్య కాలంలో పుట్టింది ఫ్లారెంటెయిన్ ఫుట్‌బాల్. ఆ రోజుల్లో సైనికులు ఈ ఆటని శారీరక పరిశ్రమ కోసం ఆడేవారు. నేటికీ ఆ ఆట నియ మాలు మీరకుండా అలాగే వుండటం విశేషం. ఏ ఆటలోనయినా ఆటగాళ్లని నియమాలతో, క్రమశిక్షణతో ఉంచుతారు




గానీ ఈ ఆటలో అలాంటి రూల్స్ ఏవీ వుండకపోవడం విశేషం. ఫుట్‌బాల్ ఆట లాగే దీంట్లో కూడా రెండు జట్లు వుంటాయి. ఒక్కో జట్టులో 27 మంది చొప్పున మొత్తం 54 మంది వుండాలి. ఒక జట్టు నీలంరంగు షర్టు, అదే రంగు నిక్కరూ వేసుకుంటే రెండో జట్టువారు ఆకుపచ్చ రంగు దుస్తులు ధరిస్తారు. దీనికి రిఫరీ వుండరు. ఫుట్‌బాల్‌ని చేత్తో, కాలితో కూడా తాకచ్చు. ఎదుటిపక్షం ఆటగాణ్ణి తిట్టచ్చు, కొట్టచ్చు, తోయచ్చు, కాలు అడ్డుపెట్టి పడే యచ్చు. అతని చేతిలోని బంతిని బలవం తంగా ఎంతమందయినా కలిసి లాక్కో వచ్చు.

ఆత్మరక్షణ చేసుకుంటూ ఆటగాడు గోల్ లోకి బంతిని పడెయ్యాలి. గోల్ వెనుక ఆరడుగుల ఎత్తులో వుండే నెట్ పై భాగంలో తాకితే అరపాయింట్ వస్తుంది.

ఈ ఆటలో తరచూ ఆటగాళ్లకి దెబ్బలు తగులుతూ వుంటాయి. అయినా ఆటలో కంటిన్యూ అవ్వాల్సిందే. ఒక ఆటగాడు గాయాల కారణంగా బయటకు వెళ్లిపోతే అతని స్థానంలో ఇంకో ఆటగాడు రాకూడదు. అంబులెన్స్, స్ట్రెచర్‌లు ఈ ఆట ఆడేటప్పుడు సిద్ధంగా వుంటాయి.

ఏటా ఈ ఆట టూర్నమెంట్స్ ఫ్లోరెన్స్‌లో జరుగుతూ వుంటాయి. అవి చూడడానికి ప్రపంచం లోని అనేక దేశాలనుంచి టూరిస్టులు వస్తూవుంటారు. ఆ పదకొండు రోజులూ ఫ్లోరెన్స్ నగరమంతా సందడి. హోటల్స్ అన్నీ నిండిపోతాయి. ఈ ఆట ఆడే అర్హత ఈరోజుకీ ఫ్లోరెన్స్‌లో పుట్టిన వాళ్లకే. ఈ ఆట ఇంకా బతికి వుండటానికి కారణాలు రెండు. ఒకటి టూరిజాన్ని పెంపొందించుకోడానికి, రెండోది రోమన్ సామ్రాజ్యకాలంలో లాగే ఆయుధాలు లేకుండా కొట్టుకుంటూ ఆడుకునే ఆటగాళ్లని చూడాలన్న ఆనాటి పాశవిక ఆనందం ఈనాడు కూడా ఆరోజుల్లోలాగే మనుషుల్లో స్థిరంగా వుండడం.

# వింత వ్యాపారాలు

వ్యాపారం మొదలుపెట్టాలనుకునేవాళ్ళు సాధారణంగా ఎప్పటినుంచో ఉన్నదాన్నే మొదలుపెడతారు. కానీ అమెరికాలో కొందరు ప్రబుద్ధులు తామే కొత్త వ్యాపారాన్ని కనిపెట్టి ఇతరులకి మార్గదర్శకులయ్యారు. అది విఫలం అయితే ఇంక ఇలాంటిది చెయ్యొద్దు సుమా అన్న సందేశంతో మరి కొందరు తమ తొలి ప్రయత్నంలోనే సఫలీకృతులయ్యారు.

వీడియోటేప్స్ అద్దెకిచ్చే వ్యాపారం ఆరంభించాలనుకున్న జిమ్ మాక్బీ అనే పెద్దమనిషి తనుండే ఊళ్ళో దానికి సంబంధించిన దుకాణాలన్నీ తిరిగి చూసి 'ఫ్లాప్స్' అనే పేర కేవలం ఫెయిలయిన చిత్రాల టేప్‌లనే అద్దెకిచ్చే దుకాణం తెరిచాడు. 'గేరంటీడ్ వరస్ట్ మూవీస్ ఇన్ టౌన్' అన్న ప్రకటనతో వందలమంది అతని దుకాణానికి వచ్చారు. అతని వ్యాపారం ఫ్లాప్ కాలేదు. వాళ్ళిప్పుడు అమెరికాలో చాలా బ్రాంచీలు తెరిచారు.

టెక్సాస్‌లో ఓ సెల్ఫ్ సర్వీస్ రెస్టారెంట్ పేరు ఫుడ్‌బ్యాంక్. లోపల సెట్ అప్ అంతా బ్యాంక్‌లాగానే వుంటుంది. క్యాష్‌కౌంటర్లో డబ్బు చెల్లించి టిఫిన్ చెక్ తీసుకుని దాన్ని టెల్లర్ కౌంటర్లో ఇస్తే టోకెన్ ఇస్తాడు. ఆ టోకెన్‌ని ఇంకో కౌంటర్లో ఇస్తే టిఫిన్ ఇస్తారు వాళ్ళు. బ్యాంక్‌లో లాగానే టోకెన్ నెంబరు పిలిచేదాకా ఆగాలి. ఈ పద్ధతి చిత్రంగా, ఆకర్షణీయంగా వుండటంతో కస్టమర్స్ ఎగబడ్డారు. ఈ వ్యాపార పద్ధతికి పేటెంట్ తీసుకున్నాడా ప్రొప్రయిటరు.

నెబ్రెస్కా రాష్ట్రంలో వందేళ్ళక్రితం కలప కొరత కాబట్టి గడ్డితో ఇళ్ళని కట్టేవాళ్ళు అని ఓ మ్యూజియంలో చూసి తెలుసుకున్న మేట్స్ అనే పెద్దమనిషి రిసెర్చ్ చేస్తే ఆ రకం ఇళ్ళు వందేళ్ళయినా ఇంకా చెక్కుచెదర లేదని తెలిసింది. అవెలా కట్టారో తెలుసుకుని ఆ రకం ఇళ్లని కట్టి అమ్మే వ్యాపారం ప్రారంభించాడు.

మామూలు ఇళ్లకన్న అవి చవక కాబట్టి మధ్యతరగతి వాళ్ళెందరో అతని కస్టమర్స్ అయ్యారు.

మార్జ్‌కార్ల్‌సన్ అనే ఆమె 'ఆర్టిస్ట్రి ఇన్ విజిలింగ్' అనే స్కూలుని తెరిచి విజిల్ వేయడంమీద పాఠాలు చెబుతోంది. చిన్న పిల్లల్ని తల్లితండ్రులు ఈ స్కూల్లో చేర్పించారు. వెయిటింగ్ లిస్ట్‌కూడా వుంది.

మనిషికి పామంటే ఆసక్తితో కూడిన భయం అని స్టీల్‌రెయిన్స్ అనే అతనికి తెలుసు. దాన్ని క్యాష్ చేసుకునే వ్యాపారం ఆరంభించాడు. ఒక డాలర్‌కి పావుగంట సేపు రేటిల్ స్నేక్‌నుంచి విషం తీయడం లాంటివి ప్రదర్శిస్తాడు. నోట్లో బెలూన్ వుంచుకుని పాముచేత కాటువేయించి దాన్ని పగలకొట్టే ప్రదర్శన, రేటిల్ స్నేక్స్‌తో నిండిన తొట్టిలో కూర్చున్న మనిషి జాగ్రత్తగా బయటకి రావడం లాంటి ప్రదర్శనలు రూపొందించాడు.




రోన్‌క్రిన్స్ అనే పెద్దమనిషి 'ఓల్డ్ ఫ్లేమ్‌ఫైండర్స్' అనే డిటెక్టివ్ సంస్థను తెరిచాడు. ఒకప్పటి ప్రేయసి లేదా ప్రియుడిని వెదికి, వారి ఫోన్ నెంబరు ఇవ్వడం మాత్రమే చేస్తాడితను. 250 నుంచి 500

డాలర్లు ఇందుకు వసూలు చేస్తాడు. ఏటా 250 మంది క్లయింట్స్‌దాకా ఇతని సహాయం తీసుకుంటున్నారు.

కొత్త వ్యాపారం గురించి ఆలోచించేవారు ఇలా అవసరాల్ని గుర్తించగలిగితే విజయవంతమైన వ్యాపారాల్ని నెలకొల్పి విజయం సాధించవచ్చును.

## హాలీవుడ్ సినిమాలెలా తీస్తారు?

హాలీవుడ్ లో కెమేరా రీలు కడిగే ముందు ఆ చిత్రకథ తాలూకా బొమ్మలను ముందే గీస్తారు. ఆ సంప్రదాయం... సినిమాలు స్క్రిప్టులలోంచి ఎలా తయారవుతాయో ఊహించలేని వారికోసం మొదలయినా నేటికీ ఈ స్కెచ్ సిస్టం ఇంకా కొనసాగడానికి కారణం దర్శకుడికి, కెమేరామేన్‌కీ ఇవి టెక్నికల్ కమ్యూనికేషన్ లింక్ గా ఉపయోగపడటమే.




సినిమా స్క్రిప్టుని దృశ్యాలుగా విభజిస్తారు. మళ్ళీ ఈ సీన్స్‌ని షాట్స్‌గా విభజిస్తారు. (కెమేరా తిరిగి ఆగే లోగా చిత్రీకరించేదాన్ని షాట్‌గా వ్యవహరిస్తారు).

తెరమీద నటీనటులు ఏ యాంగిల్‌లో ఎలా కనపడాలో దర్శకుల ఊహ మేరకు చిత్రకారులు బొమ్మలను గీస్తారు. వాటిని చూసి కెమేరా మాన్ లైటింగ్‌కి కెమేరాను ఏర్పాటు చేసుకుంటాడు.

ఈ స్కెచ్‌లని స్టోరీ బోర్డ్ స్కెచెస్' గా పిలుస్తారు. లేదా 'సీన్ స్కెచెస్' అని కూడా అంటారు. ఇవికాక మేకప్ స్కెచెస్, సెట్ స్కెచెస్, కాస్ట్యూమ్ స్కెచెస్ కూడా గీస్తారు. నటీనటులు తెరమీద ఆ పాత్రకు తగ్గట్టుగా కనపడేలా అనేకరకాల దుస్తులు, మేకప్‌లతో గీసిన స్కెచ్‌లనుంచి దర్శక, నిర్మాతలు ఎంపిక చేసి ఆ ప్రకారం వేషధారణ వేయిస్తారు. ఈ స్కెచ్ వల్ల కాలం, ఖర్చు కలిసి వస్తాయి.

సైంటిఫిక్, హిస్టారిక్, ఫాంటసీ చిత్రాల నిర్మాణంలో రచయిత, సెట్ డైరెక్టరు, మేకప్ మాన్‌ల మనసుల్లో ఏమున్నాయో మాటల్లోకంటే ఈ స్కెచ్‌ల ద్వారా ఎక్కువ బయటపడతాయి. అందరి అభిప్రాయాలనీ క్రోడీకరించి ప్రొసీడ్ అవడానికి ఈ స్కెచెస్ ఉపయోగిస్తాయి.

అయితే ఈ స్కెచెస్‌ని సాధారణంగా నిర్మాత, దర్శకుడు, ఇతర సాంకేతిక నిపుణులు తప్ప బయటివారు చూసే సందర్భాలుండవు. ఈ స్కెచెస్ ను గీసేందుకు నిపుణులయిన చిత్రకారులు ప్రతీ స్టూడియోకీ వుంటారు.

ఇండియాలో సత్యజిత్‌రే 'స్టోరీ స్కెచెస్' ని గీసుకుని గానీ సెట్స్‌కి వెళ్లేవాడు కాదు. తెలుగులో బాపూ పద్ధతి కూడా ఇదే. 'మాయాబజార్' లో ఘటోత్కచుడి పాత్రకి ఆహార్యాన్ని స్కెచెస్ ద్వారానే ఫైనలైజ్ చేశారు.

తెలుగులో స్టోరీ స్కెచెస్ పద్ధతికి మొదటి నుంచీ పెద్దగా ప్రాచుర్యం లభించలేదు. ★

# 'జ్యోతిష్యం' పై సమీక్షలు

మార్చి 'చతుర'లో ప్రచురితమైన ఆదిమూలం రామబ్రహ్మం రచన 'జ్యోతిష్యం' పై మాకందిన ఉత్తమ సమీక్షలు.

## మసిపట్టిన మాణిక్యం

*(ప్రథమ బహుమతి రూ. 100/–పొందిన సమీక్ష)*

జ్యోతిష్యశాస్త్రం తనని గాఢంగా నమ్మేవారి హృదయాల్లో కూడా ఏదో ఒకమూల తన పైనే కొద్దిపాటి సందేహాన్ని... తనను గాఢంగా విమర్శించేవారి మనసుల్లో కూడా అంతర్లీనంగా తనపై కొంత నమ్మకం వుండేటట్లూ... చేయగల విచిత్ర సామర్థ్యమున్న శాస్త్రం. ఈ ప్రత్యేక శాస్త్రాన్ని ముఖ్య విషయంగా తీసుకుని రాయబడిన ఈ నవలలో కొద్దిపాటి అస్పష్టత వెనకాల దాగున్న చక్కటి సందేశం వుంది.

నవల చదువుతున్నంతసేపూ ఒక మంచి సందేశాత్మకమైన నవలని చదువుతున్న అనుభూతిని పొంది, తీరా నవల పూర్తయిన తరువాత అసలు చెప్పదలచిందేమిటి? అన్న అయోమయ పరిస్థితిలో పడవలసి వచ్చింది.

'జ్యోతిష్యం... దీనిని కేవలం ఒక మూఢ నమ్మకంగా భావించనక్కరలేదు. ఓర్పు, పట్టుదలతో ఈ శాస్త్రాన్ని అధ్యయనం చేయగలిగినవారు భవిష్యత్తును చక్కగా దర్శించగలరు' అన్నది రచయిత చెప్పదలచిన అంశాలలో ఒకటిగా కనపడుతున్నది. ఐతే, రచయిత అస్పష్టంగానైనా పాఠకులకు అందించిన చక్కటి ప్రశంశార్హమైన అంశం మరొకటి వుంది. జ్యోతిష్యం ద్వారా భవిష్యత్‌ను దర్శించగలమేకానీ, ఆ దర్శించిన భవిష్యత్తులో జరిగే వివిధ సంఘటనలను ఆపగలగటం, లేదా మార్చగలగడం అసాధ్యం. మనకనుగుణంగా మార్పుకి వీలవనటువంటి మన భవిష్యత్‌ను మార్చాలనుకోవడం, తద్వారా రాబోయే ప్రమాదాలనుండి బయటపడే మార్గాలకొరకు అన్వేషించి ధనం, సమయం వృధా చేసుకోవడం అవివేకమే అవుతుంది. ముఖ్యంగా 'కష్టసమయంలో మనిషిని జ్యోతిష్యం ఆకర్షిస్తుంది' అన్న రచయిత భావం చాలావరకు నిజం. అట్టి సమయాల్లోనే ధృఢచిత్తం కలిగి వుండాలని ఈ రచయిత చెప్పక చెప్పిన సందేశం ఆచరణీయం.

కులాంతర ప్రేమతో కూడిన చతురస్ర ప్రేమకథ, పెళ్ళీడు పిల్లల యొక్క తల్లుల బాధలు, వ్యధలు, పంతాలు మొదలైన అంశాలతో కూడిన కథనం అసలు విషయాన్ని అర్థం చేసుకోవడానికి శ్రమ కల్గించేదిగా వుంది. మాణిక్యానికి మసిపడితే దాని అసలు రూపు ఎలా తెలియదో అలాగే ఒక చక్కటి సందేశానికి 'కథనం' అనే మసి వల్ల అస్పష్టత ఏర్పడింది.

చివరగా నవలంతా చదివేసి, తిరిగి కొంత సమయం కేటాయించి, చదివినదానిని విశ్లేషించి, ఆ విశ్లేషణ ద్వారా రచయిత యొక్క సిసలైన భావాన్ని పట్టుకోవాలన్న కోర్కె వుండే పాఠకులు అసలు వుండరని కాదుకానీ వెయ్యిలో ఒక్కరు ఉండవచ్చేమో!

–పి.యల్.ఎన్. బాలాజీ,
గుంటూరు - 522 003

## వంద సంవత్సరాలు వెనక్కి

*(ద్వితీయ బహుమతి రూ. 75/– పొందిన సమీక్ష)*

మార్చి నెలలో ఆదిమూలం రామబ్రహ్మం

గారిచే రాయబడిన 'జ్యోతిష్యం' ఈ కంప్యూటర్ యుగంలో ఇంటర్‌నెట్‌లూ, రాకెట్‌లూ అంటూ విశ్వాంతరయానం చేసే ఆధునిక ప్రపంచాన్ని సరిగ్గా వంద సంవత్సరాల వెనుకకు తీసుకువెళ్ళే నవలారాజం. ఆనాటి పల్లెలూ, బ్రాహ్మణులూ, అగ్రహారాలూ, వర్గాలమధ్య సంఘర్షణలూ ఒక్కసారి జ్ఞప్తికి తెచ్చింది. ఒక శాస్త్రాన్ని కూలంకషంగా తెలుసుకున్న జ్ఞాని అయినప్పటికీ పరమేశ్వర శాస్త్రి ఏ విధంగానూ పరిస్థితులను ఎదురించలేక, జరగబోయేది ఆపలేక మానసికంగా అతడు అనుభవించిన సంఘర్షణను వర్ణించడంలో రచయిత కృతకృత్యులయ్యారనే చెప్పాలి. కానీ రంగారావు కుటుంబంలో వరుసగా ఆత్మహత్యలు, రమేష్ పితృహంతకుడు కావడానికి తోడ్పడిన పరిస్థితులూ అతుకుల బొంతలాగా ఉన్నవే తప్ప కథలో లీనమై వాస్తవమా అని భ్రమించేట్టు లేవు. అంతేకాదు ఎక్కువ పాత్రలతోకల్పన జోడించి పేజీలకు పేజీలు రాయడంవలన ఎక్కడ వాస్తవమో ఎక్కడ కలో, ఊహో తెలియని అయోమయస్థితిలోకి పాఠకులను నెట్టింది. అంతకంటే పరమేశ్వరశాస్త్రి యొక్క జ్యోతిశ్శాస్త్రం గురించి ఇంకొంత విపులీకరించి ఉంటే పాఠకులకు కొంత విషయ పరిజ్ఞానమైనా అబ్బివుండేది. ఈ నవలలో ఏ హీరోకీ హీరోయిజమ్ లేకపోవడం గమనించవచ్చు. చంద్రశేఖర్ మనసు అమృత, మాధవిల మధ్య ఊగిసలాడటం, రమేష్ మనసు అమృత, స్వాతిల మధ్య... ఆ ఆడపిల్లలకు కూడా ఒక లక్ష్యం, ఒక గమ్యం లేనట్లు ఉండడం ఈనాటి స్త్రీపాఠకులను మెప్పించదు. అందుకే ఇది మహిళలను వంద సం.లు వెనక్కినేట్టే నవలగానే తప్ప పాఠకులకు ఉపయోగపడేదిగా నిలబడలేదు. పల్లెటూళ్ళలో కాలక్షేపం చేసే స్త్రీలుగానే తప్ప వారిలో ఎవరికీ విశిష్ట వ్యక్తిత్వం లేదు. నాట్యకళలో విశేష ఖ్యాతి నార్జించిన అమృత కూడా ఆ విద్యకు సార్థకత చేకూర్చినట్లు చూపబడలేదు అబలగానే తప్ప. పరమేశ్వరశాస్త్రి జ్యోతిష్య పాండిత్యం ఇతరులకు ఉపయోగపడేతీరూ, అతని మానసిక సంఘర్షణా చక్కగా రాయగలిగిన రచయిత ఇంకొంచెం శ్రమ తీసుకుని రాసి ఉంటే పాఠకులకు ఒక చక్కని నవల చదివిన అనుభూతి కలకాలం ఉండిపోయేది.

**–చివుకుల శ్రీలక్ష్మి,**
విజయనగరం- 535 002

## విజ్ఞత అవసరం

*(మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

**జ్యో**తిష్యం అనేది నమ్మినా, నమ్మకపోయినా వారివారి జన్మనక్షత్రం, తిథి, పుట్టిన సమయాన్ని బట్టి జరుగుతుందని నవల పూర్తిగా చదివిన తర్వాత అర్థమయ్యే విషయం. ఎవరు ఒప్పినా ఒప్పకపోయినా జరిగే దానిని మార్చడం, ఆపడం, ఎవరి తరం కాదు అన్నదిమాత్రం అందరూ అంగీకరించాల్సిన విషయం అన్న నిజాన్ని 'జ్యోతిష్యం' నవలలో కూలంకషంగా తెలిపారు రచయిత ఆదిమూలం రామబ్రహ్మం గారు. 'జ్యోతిష్యం', 'కర్మ'... పేరేదైనా ఇలా జరగాలని ఉంటే, ఆ సమయం వస్తే అలాగే జరిగి తీరుతుందని రచయిత అభిప్రాయపడ్డారు.

ఈ నవలలో మొత్తం సమస్య అమృత పెళ్ళి. అమృత పాత్ర మొదట్లో ఎంతో ధైర్యస్థురాలిగా పాఠకులకు పరిచయం ఔతుంది. అలాంటి అమృత తన తండ్రి, అత్తయ్యల పందేనికి తల ఒగ్గి యిష్టంలేని పెళ్ళి చేసుకుని ఆత్మహత్య చేసుకోవడం అన్నది కేవలం నవల మలుపుకోసమే అన్నట్టుంది. ఇలాగే జరుగుతుందని పాఠకులు కొంతవరకు ఊహిస్తారు పరమేశ్వరశాస్త్రి, అతని భార్య వర్ధనమ్మ సంభాషణలద్వారా. ఇలా జరుగుతుందని చెప్పినా తన భార్య తన జ్యోతిష్యాన్ని నమ్మదని పరమేశ్వరశాస్త్రి

మౌనం వహించినట్లు రచయిత తెలిపారు. ఐతే ఇలా జరగకూడదు అన్న విషయాన్ని పరమేశ్వరశాస్త్రి ఆశించినట్లయితే ఆ పెళ్ళి రద్దు అయ్యేదేమో. కేవలం సమస్యను గాలికి వదిలేస్తే అది ఎలా పరిష్కారమౌతుంది?

శివరామశాస్త్రి అంతా దేవుడిమీద భారం వేయడం చూస్తే అతని పాత్ర చాలా లోప భూయిష్టంగా అన్పిస్తుంది. తన కూతురి ప్రేమఉదంతం మొత్తం తెలిసిన అతను పరమేశ్వరశాస్త్రితో చేసే ఛాలెంజ్ ఏమాత్రం నవలకు సరిపోలేదు. 'అంతా నీ ఇష్టప్రకారమే జరుగుతుంద'ని కూతురికి యిచ్చిన హామీ నెరవేర్చడంకోసం అతడే మాత్రం ప్రయత్నం చేయలేదు. పైపెచ్చు దేవుడిమీద విరుచుకుపడ్డం అన్నది హాస్యాస్పదంగా ఉంది. దేవుడు అన్నది మనిషి బతకడానికి ఒక ఆలంబన, భావన అంతే. దేవుడే చేసేస్తాడనుకుంటే, మనిషి స్థానం ఏమిటి మరి? మనిషి పుట్టుక ఎందుకు?

పరమేశ్వరశాస్త్రి పాత్ర ఎంతో ఉదాత్తంగా ఉన్నా జరిగేది జరగకమానదు అన్న సిద్ధాంతం కేవలం తన జ్యోతిష్యం నిజం చేయడానికే అన్నట్టు ఉంది. రమేష్ ధైర్యం చేసి అమృతను పెళ్ళిచేసుకుంటే రంగారావు ఏం చేసేవాడు? చదువు పూర్తిచేయని, పైసా సంపాదనలేని రమేష్ తండ్రిని చంపడంలో మాత్రం తన గొప్పతనం చాటుకున్నాడే తప్ప అతడు పెద్ద సోమరిపోతు. వర్ధనమ్మ పాత్ర ఇలాంటి నోరున్న స్త్రీవలన ఎన్ని విపత్తులు సంభవిస్తాయో తెలియచేసింది. ఎలాంటిభర్తలనైనా మార్చుకునే స్త్రీలుంటారు కానీ, సుశీలమ్మ భర్తను మార్చుకోవడానికి ఎలాంటి ప్రయత్నం చేయకపోగా మరింత దూరం పెంచుకుంటుంది తన మౌనం ద్వారా. లోపమంతా ఆమెలో ఉందనిపిస్తుందిరంగారావులో కంటే. ఈ నవలలో చెప్పుకోదగ్గ మంచిపాత్రలు మాధవి, స్వాతి. ఐతే 'పెళ్ళి' మీద, 'కాబోయే భర్త'మీద స్వాతికున్న అభిప్రాయాలు, చొరవ మాధవి పాత్రలో లోపించాయి.

జన్మతేది, నక్షత్రం, రాత అనుకునే బదులు మనుషులు తమ పరిధిలో ధైర్యం చేసి యిలా చేస్తే బావుంటుంది అని ప్రగతి పథం వైపు ఆలోచించి అడుగువేస్తే అనుకున్నది జరుగుతుంది. ఎవరూ ఆత్మహత్యలు చేసుకోవాల్సిన అవసరం ఉండదు. మనిషి ఏదైనా సరైన సమయంలో సమస్యను లోతుగా ఆలోచించి పరిష్కారం వెతుక్కోవాలి. దైవానికి, రాతకు వదిలి వేయకూడదు. 'జ్యోతిష్యం' ఉన్నా లేకపోయినా మనిషికి ఆలోచనాశక్తి, అవగాహనా శక్తి, చొరవ, సమస్యను పరిష్కరించుకునే ధైర్యం, విజ్ఞత అవసరం.

—డా. యం.ఎస్. జ్ఞానేశ్వర్,
మదనపల్లి - 517 327

## రాగద్వేషాలు

*(నాలుగవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

"జ్యోతిష్యం" అనే నవలలో రచయిత రామబ్రహ్మంగారు ఎక్కడా జ్యోతిష విషయాలు ప్రస్తావించలేదు. పరమేశ్వరశాస్త్రి హైదరాబాద్ వెళ్ళి దేవరాజు జాతకం, సైటు చూసి, ఆర్నెల్లవరకు టైం బాగులేదని, వ్యాపార లావాదేవీలు చెయ్యవద్దన్నారు. దేవరాజుతో వచ్చిన ఆ ఇద్దరు జ్యోతిష్యులు "ఎందుకు బాగులేదు? గ్రహస్థితి వివరించండి" అని పరమేశ్వరశాస్త్రిని అడిగి ఉండవలసింది. రచయిత ఆ వివరాలు రాసి ఉంటే "జ్యోతిష్యం" అని నవలకు పేరు పెట్టినందుకు మరికొంత పరిపుష్టి కలిగివుండేది.

ఈ నవలలో ప్రధానంగా పరమేశ్వరశాస్త్రి, శివరామశాస్త్రి కుటుంబాల మధ్య వారి పిల్లల వివాహం గురించే కథ నడిచింది. మూడవ కుటుంబం విలన్ రంగారావు, అతని కొడుకు రమేష్‌పై. రెండు కుటుం

బాల మధ్య అగ్నిహోత్రం రగిలించారు. నాల్గవ కుటుంబం పరమేశ్వరశాస్త్రి చెల్లెలు, ఆమెకూతురు మాధవి.

కథాంశం అంతా రెండుజంటల యువతీ యువకుల మధ్య ప్రేమ, వివాహం గురించిన ప్రస్తావన.

రంగారావు క్రౌర్యం, లక్ష్మీదేవమ్మ అశక్తత, సుశీలమ్మ విరక్తి, భక్తి, రమేష్ రంగారావుల మధ్య ద్వేషం, కక్షలతో రగులుతూ ఉంటే, వర్ధనమ్మ పట్టుదల, పరమేశ్వరశాస్త్రి జ్యోతిష్యాన్ని నమ్మిన వ్యక్తిగా, శివరామశాస్త్రి దైవాన్ని నమ్మిన వ్యక్తిగా పాత్రలు రసవత్తరంగా నటించాయి.

అమృత, చంద్రశేఖర్‌లకు నృత్యంలో పోటీ ఏర్పాటు చెయ్యటం, అమృత ఓడిపోతే ఆమెను చంద్రకిచ్చి వివాహం చేయాలని పందేలు పడటం- కథా సహజత్వానికి, ప్రస్తుత పరిస్థితులకు విరుద్ధంగా ఉంది.

పాత్రల హావభావ ప్రకటన, కొన్ని సంఘటనలు అలా జరిగేయా అన్నట్టు అనిపించి, అవి కేవలం ఊహలే అనే భావాన్ని రచయిత చక్కగా చిత్రీకరించారు.

**-గండికోట నాగభరద్వాజ,**
విశాఖపట్నం-530 022

## నరుడి బతుకు నటన

*(అయిదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

"నరుడి బతుకు నటన... ఈశ్వరుడి తలపు ఘటన... ఈ రెండి నట్టనడుమ నీకెందు కింత తపన! తెలుసా... మనసా... తెలిసీ అలుసా..." అంటూ సాగే ఈ పాట అర్థాన్ని అంతరార్థంగా మలచి రకరకాల పాత్రల ద్వారా రచయిత తెలియచేసిన తీరు బాగుంది. ఆరు వేదాంగాలలో ఒకటయిన జ్యోతిశ్శాస్త్రం నిజానికి భూత, భవిష్యత్, వర్తమాన కాలాల ఫలితాలను ఖచ్చితంగా చెప్పగలిగినా... ఆ ఫలితాలను విశ్లేషించే పండితుడి మనోబుద్ధులపై కూడా ఆధారపడివుంటుంది. అంతఃకరణాన్ని జయించినవాడే ఖచ్చితమైన ఫలాలు చెప్పగలడు. జ్యోతిశ్శాస్త్రం పండితునికి మనశ్శాంతి లేకుండా చేయలేదు. కాని తనవాళ్ళనే అనురాగం, బంధం, మమకారాలే ఆయన మనశ్శాంతిని హరించివేస్తాయి. "జరిగేది జరుగుతుంది, అది అంతా గ్రహప్రభావాలే! వాటికి ఎవరూ కారకులు కాదు, కాని ఒకప్పటి నీ కర్మలే కారణం" అని చెప్పి, "అందుకనే నేనెప్పుడూ నిబ్బరంగా, నిశ్చలంగా వుంటాను" అని పండితుని ద్వారా పలికించిన రచయిత తన ఆంతర్యాన్ని వ్యక్తీకరించారు. మనిషికి తన పనులపట్ల ఉన్న అహంకారమునకు, న్యూనతా భావానికి ఈ తరహా వాదన గొడ్డలిపెట్టు. ఈ నవల ద్వారా రచయిత చెప్పదలచుకున్న సారాన్ని చక్కగా, సందర్భోచితంగా పాత్రల ద్వారా వివరించారు. పలువిధాలుగా, మనస్సు, బుద్ధిగల పాత్రలు ఒకే విషయాన్ని పలువిధాలుగా అన్వయించుకొని తత్సంబంధిత పాత్రలపై రాగద్వేషాలు కురిపించిన తీరు, మన సమాజ ధోరణికి ఏ మాత్రమూ తీసిపోదు.

వేదాంగం అయిన జ్యోతిశ్శాస్త్రాన్ని, దాని ప్రాముఖ్యతను అంతరార్థంగా తెలియచేస్తూ పాత్రలకు రంజకంగా జీవం పోయటం అనేది నిజంగా రచయిత శ్రీ ఆదిమూలం రామబ్రహ్మంగారు చేసిన పెద్ద సాహసకార్యమే!

**-పాటిల్ సోమశేఖర్,**
పాన్యం

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328. Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060.

